2075

A

# ఐక్యరాజ్యసమితి కార్యకలాపాలు




టామ్ గాల్ట్

# విషయసూచిక

అధ్యాయము — పుట

# మొదటి భాగం

# ఐక్యరాజ్య సమితి అవతరణ



## అధ్యాయం ౧

## ఐక్యరాజ్య సమితి ఎందుకు?

మన ఈ ప్రపంచంలో ఎన్నో సంఘాలు ఏర్పాటైనవి; మరెన్నో సంస్థలు స్థాపితమైనవి. అన్నింటిలో చాలా ముఖ్యమైనదీ, అత్యంత ప్రధానమైనదీ ఐక్యరాజ్య సమితి. మన ఈ సువిశాల దేశం ఆ సమితికి చెందినదే. ఈ దేశ పౌరులమైన మనం అందరం ఆ మహా సంస్థ అంతర్భాగమే.

కనుక ఇన్ని సంఘాలు, మరిన్ని సంస్థలు వుండగా ఈ సంస్థ ఎందుకు ఏర్పాటైనది? ఈ మహా సంస్థ ఏమి చేస్తుంది? ఆ చేసే పని ఏవిధంగా చేస్తుంది? ఈ మహా సంస్థకు గల శాఖలు, ఉప శాఖలు ఏవి? ఇందువల్ల మనకు వొరిగేది ఏమిటి? అనే ప్రశ్నలకు సమాధానాలు తెలుసుకోవడం మనందరికీ అవసరమే కాదూ?

యావత్ప్రపంచాన్నీ ఎదుర్కొంటున్న అతి జటిలమైన, మహాభయంకరమైన ఒక సమస్యను పరిష్కరించే నిమిత్తం సక్రమ మార్గాన ప్రయత్నించేందుకు ఈ సంస్థ ఏర్పాటైంది. సమస్త మానవకోటినీ భయం ఆవహించింది. ఒక ఘోర ప్రమాదం మనకు ప్రత్యక్షమైంది. మనలను ఆవహించిన భయాన్ని, మనలను ఎదుర్కొంటున్న ప్రమాదాన్ని

తొలగించి, ఆ భయప్రమాదాలనుంచి మనకు విముక్తి చేకూర్చడానికే ఈ మహా సంస్థ స్థాపన జరిగింది.

చేనుగట్ల దగ్గరా, చూరునీళ్ళ దగ్గరా ఎన్నెన్నో పోట్లాటలు జరుగుతూ వుంటవి. తగాదాను సర్ది, ఉభయ పక్షాలను శాంతి పరిచే ఒక తీర్పరి లేకపోతే ఈ కలహాలు కొట్లాటలుగా పరిణమిస్తవి.

హెండర్సన్ అమెరికా పౌరుడు. బహు కుటుంబీకుడు. పగలంతా పనిచేసి సూర్యాస్తమయ సమయానికి ఇల్లు చేరు కున్నాడు. అతని ఇల్లు ఎలాంటిది అంటే ఇద్దరు లోపలికి వస్తే నలుగురు బయటికి పోవాలి. మూడే మూడు గదులు. అందులో అతను, అతని ఇల్లాలు, నలుగురు పిల్లలు సరిపెట్టు కోవాలి. ఎటు మెసలడానికీ లేదు.

హెండర్సన్ పక్కింటి వాళ్ళు ముగ్గురే ముగ్గురు. ఆ ముగ్గురికే మూడు గదులు వున్నవి. భార్యా, భర్త, ఒక కూతురు సుఖంగా వుంటున్నారు. హెండర్సన్‌కు ఇది చాలా దారుణంగా కన్పించింది. ఆ రోజు సాయంత్రం ఇంటికి వస్తూనే "ఇంతకంటే అన్యాయం లేదు, మనం ఆరుగురం మూడు గదుల్లో ఇరుక్కు చావాలి! వారు ముగ్గురూ మూడు గదుల్లో హాయిగా వుండాలి! వాళ్ళకి అంత జాగా అనవసరం. మనకు మరికొంత జాగా అవసరం." అని ఇల్లాలుతో చెప్పాడు. చెప్పడం ఏమిటి ఆ జాగా సంపాదించడానికి ఉపక్రమించాడు.

తను ఇంటికివస్తూ తెచ్చిన బ్రహ్మాండమైన సుత్తితో రెండిళ్ళకూ మధ్యనవున్న గోడను బ్రద్దలుకొట్టడం ప్రారంభించాడు. పక్కింటివాళ్ళు సాయంకాలం వాహ్యాళికి వెళ్లారు. ఎవ్వరూ ఇంట్లో లేరు "ఇదేమిటి" అని అనేందుకైనా. కొద్ది సేపట్లో బాగా మనిషి రావడానికీ, పోవడానికీ చాలినంత కన్నం చేశాడు. పొరుగింట్లో ప్రవేశించాడు! వెంటనే ఆగది అవతలవేపు వున్న ద్వారబంధాన్ని వూడబెరికాడు. రాళ్ళు పెట్టి ఆ కన్నం పూడ్చివేశాడు. ఆ ద్వారబంధం తెచ్చి హెండర్సన్ తన ఇంటికీ, అవతలిఇంటి గదికీ మధ్యగోడల్లో తాను ఏర్పాటుచేసిన దారిలో పెట్టి బిగించివేశాడు. హెండర్సన్ కుటుంబానికి ఇప్పుడు నాలుగు గదులు అమరినవి. పక్కింటివాళ్ళకి రెండే రెండు గదులు మిగిలినవి.

చీకటిపడింది. పక్కింటివాళ్ళు తిరిగి వచ్చారు. తలుపులు తీసుకొని లోపలకి పోయినారు. గుండె గుభేలుమంది! అమాంతం ఒక గది గది హెండర్సన్ తన ఇంట్లో కలిపివేసుకున్నాడు! ఎంతదారుణం! వెంటనే పక్కింటి యజమాని పోలీసులకు రిపోర్టు యిచ్చాడు. వెంటనే ఒక పోలీసు వచ్చి జరిగింది అంతా స్వయంగా చూచుకున్నాడు. ఫిర్యాదు విషయంలో అతిశయోక్తిగాని, అసత్యంగాని ఏమీ వున్నట్లు అతనికి కన్పించలేదు. తక్షణం టెలిఫోనుమీద మరికొంత మంది పోలీసులను రప్పించాడు. అంతా చేరి హెండర్సన్‌ను అరెస్టుచేశారు. కేసుపెట్టి విచారణకు న్యాయస్థానానికి తీసుకు వెళ్లారు.

ఇదంతా హెండర్సన్‌కు దుస్సహమైంది. ఒళ్ళు మండి పోయింది. ఇంతకాలంగా తనకుజరిగిన అన్యాయాన్ని తొలిగించేందుకు ఎవరూ రాకపోగా తనే న్యాయంచేసుకుంటే, అది మహాపరాధం అని కేసుపెట్టడమా? "మీా చర్య ఎంతమాత్రం సబబుగాలేదు. న్యాయంగాని, ధర్మంగాని ఎక్కడా లేదు. నేను బహు కుటుంబీకుడను. నేను వుంటున్న ఇల్లు నాకూ, నా కుటుంబానికీ ఎంతమాత్రం చాలదు. మేము బతికి బట్టకట్టుకోవాలంటే మరికొంత జాగా కావాలి," అని హెండర్సన్ కోర్టుకప్పు ఎగిరిపొయ్యేటట్లు కేకపెట్టాడు.

న్యాయాధికారి అతి శాంతంగా, బహునిదానంగా ఇలా అన్నాడు: "హెండర్సన్, నీ బాధ నాకు అర్థమైంది. నీ వాదం గ్రహించాను. నీకు ఇప్పటికంటే సుఖంగా వుండేందుకు మీాకు మరొక ఇల్లును సమకూర్చడంలో ప్రభుత్వం కొంతవరకు సహాయ పడుతుంది. మన ప్రభుత్వం ఎన్నో క్రొత్త ఇళ్లు కట్టిస్తున్నది. ఈ కార్యక్రమం అంతా పూర్తి అయ్యేసరికి మన అమెరికా పౌరులు ప్రతి వొక్కడికీ వాసయోగ్యమైన ఇళ్ళు లభిస్తవి.

"నువ్వు ఈనాడు జరిపిన అక్రమ ఆక్రమణ మన శాసన సభలు తయారుచేసిన శాసనాలకు విరుద్ధం. న్యాయాధి కారులము అయిన మేము, ఈ రక్షకభటులు ఈ శాసనాలను అమలు జరుపవలసిన వారం."

హెండర్సన్ క్షణం నిరుత్తరుడైనట్లు నిలబడిపోయినాడు. ఏదో గుర్తు చేసుకుంటున్నట్లు బుర్రగోక్కొని, ఇలా ప్రారం

భించాడు : "నాచర్యలు ఎలా చట్టవిరుద్ధములు అవుతున్నవో నాకు బోధ పడడంలేదు. జపాన్ ప్రభుత్వం తన ప్రజలకు మరికొంత జాగా కావలసివస్తే మంచూరియాను ఆక్రమించింది కాదా! ఇటలీ మరో కొంత భూభాగాన్ని సంపాదించుకునేందుకు ఇథియోపియాను దిగమింగలేదూ? జర్మనులకు నిలువ నీడలేని పరిస్థితి ఏర్పడ్డప్పుడు చకోస్లావేకియానుంచి సుడేటన్ లాండును జర్మనీ తస్కరించింది కాదా? వీళ్ళ నెవర్నీ అరెస్టు చేసినవారు లేరు; ఆ పనులు చేయకుండా వారిని నివారించిన వారూ లేరు." . . .

హెండర్సన్ వాదాన్ని న్యాయాధికారి చాలా శ్రద్ధగా విన్నాడు. "మిస్టర్ హెండర్సన్ ఇదంతా నిజమే. కాని, ఇక్కడ ఒక విశేషం వుంది. జపాను, ఇటలీ, జర్మనీలపై అధికారం చలాయించగల ప్రపంచ ప్రభుత్వం లేదు. ప్రపంచ రాజ్యాల పాలనకు శాసనాలు చేసే పార్లమెంటు లేదు. దురాక్రమణ చర్యలను నివారించడానికిగాని, దురాక్రమణ జరిపినవారిని శిక్షించడానికిగాని ప్రపంచ పోలీసు అంటూ కూడా ఏమీలేదు. కొన్ని దేశాలు కంటబడిన దేశాన్నల్లా కబళించడం ప్రారంభించగా ఈ కిరాతక చర్యలను ప్రతిఘటించడానికి, ఈ దురాక్రమణలను అరికట్టి, దురాక్రమణ దారులను నిలువరించేందుకు ఇతర దేశాలు యుద్ధం ప్రకటించాయి. మన దేశానికి ఒక ప్రభుత్వం, దేశాన్ని పాలించడానికి కొన్ని శాసనాలు, ఆ శాసనాలను అమలు చేసేందుకు న్యాయాధికారులు, రక్షక భటులు వున్నారు.

కనుక, చట్టవిరుద్ధమైన చర్యలు చేయడానికి వీల్లేదు. నీది కాని మరొకరి ఆస్తిని నువ్వు తస్కరించడానికి వీల్లేదు,'' అని న్యాయాధికారి తీర్పు ఇచ్చాడు.

కొన్ని కొన్ని పనులుచేసే నిమిత్తం మనం ప్రభుత్వాలను ఏర్పాటు చేసుకున్నాం. మనదేశంలో రహదార్లను వేయాలి. నదులపై వారధులు నిర్మించాలి. పిల్లల చదువుకు పాఠశాలలు స్థాపించాలి. నిరుపేద పౌరులకు నివాసాలు ఏర్పాటు చేయాలి. నిరాధారులకు ఆధారం కల్పించాలి. ఇలాంటి పనులను నిర్వహించేందుకే మనం ప్రభుత్వాలను ఏర్పాటు చేసుకున్నాం. ప్రభుత్వాలు ఈ పనులు చేయడం వల్ల మనందరి జీవితం సుఖప్రదమై అంతా హాయిగా జీవించడానికి వీలు అవుతుంది.

ప్రభుత్వాలు సమష్టి ప్రయోజనాలను సాధించడంతో బాటు మరికొన్ని ధర్మాలనుకూడా నిర్వర్తించవలసి వుంటుంది. దేశంలో శాంతిని కాపాడాలి. ప్రజలు ఒకర్నొకరు చంపుకోకుండా చూస్తూవుండాలి. ఒకరి ఆస్తిని మరొకరు దొంగిలించకుండా రక్షణ ఏర్పాటుచేయాలి. ఒకరికొకరు అపకారం చేయకుండా శ్రద్ధవహించి వేయికళ్ళతో యావన్మందినీ కనిపెట్టి వుండాలి.

1945 కు ముందు ప్రపంచసంస్థ అంటూ లేదు. లేని దేశాలకు సహాయంచేస్తూ, దుర్బల దేశాలను పెద్దరాజ్యాలు తమలో కలుపుకోవడాన్ని నివారించగల ప్రపంచ ప్రభుత్వం లేదు.

ఆ కొరతను తీర్చి, ప్రపంచ శాంతి సౌఖ్యాలకు అవసరమైన ఈ రెండు ముఖ్యపనులను నిర్వహించేందుకే ఐక్యరాజ్యసమితిని స్థాపించడం జరిగింది. ఈ సమితి ఈ రెండు పనులనూ చేయగలిగితే మనకు యుద్ధభయం వుండదు. యుద్ధ ప్రమాదం పూర్తిగా తొలగి పోతుంది.

ఈ సంస్థవల్ల ఇంత ప్రయోజనం వుంటే, ఇంతకుపూర్వం ఎందుకు ఏర్పాటు చేయలేదు అన్న ప్రశ్న వుదయిస్తుంది. ఒక ప్రపంచ సంస్థ స్థాపన ఇతఃపూర్వం సాధ్యం కాలేదు. ఇప్పుడు శాస్త్రజ్ఞానం వృద్ధి అయింది. దూరభారాలు లేవు. ఒకరితో ఒకరు సంప్రతించుకోవాలంటే కూర్చున్న చోటునుంచి కదలక్కర్లేదు. ఎంత దూరదేశం వెళ్ళి రావాలన్నా మూడు నాలుగు రోజులకంటే పట్టదు. రేడియోద్వారా, వైర్లెస్ ద్వారా ఎక్కడో జరుగుతున్న సంఘటనల ఫోటోలను తీసి క్షణాలలో ప్రపంచంలో ఏమూలకైనా పంపవచ్చును. క్రిందటి యుద్ధకాలంలో మీరుపత్రికల్లో ఎన్నో రేడియో, వైర్లెస్ ఫోటోలను చూచివుంటారు.

మన తాత ముత్తాతల కాలంలో పరిస్థితులు ఎలా వుండేవో, వారు ఎలా జీవితం వెళ్ళబోసుకుంటూ వుండేవారో చిన్నతనంలో మనం మన తాత, అవ్వ చెప్పగా విన్నాం. ఆ రోజుల్లో వాళ్ళకి ప్రత్యక్షంగా కనిపించే ప్రపంచం తప్ప మరో ప్రపంచం తెలీదు. తమ దేశంతప్ప మరొక దేశం ఎరుగరు. అనేక దేశాల్లో తమకు సమకాలికులుగా వుంటున్న వారు తమవలెనే జీవిస్తున్నారనే విషయమే వారు ఎరుగరు.

తమ వూళ్ళోవాళ్ళని, దగ్గర వూళ్ళోవాళ్ళని మాత్రం చూస్తూ వుండేవారు. ఒక వందమైళ్ళ దూరాన వున్నవారు ఎలా వుంటారో వారు చూచి వుండరు. మనుష్యుల్ని కాకపోయినా వారి ఫోటోలనైనా వారు చూచివుండరు. మనకు సాక్షాత్కార మయ్యేవాటినన్నిటినీ యంత్రాలు పూర్తిగా మార్చివేసినవి. మనం మన దేశంలో వుంటున్నట్లే, ఇదే సమయంలో రష్యాలో రష్యన్లు, చైనాలో చైనీయులు, బ్రిటన్లో బ్రిటిష్ వారు జీవించి వున్నారనే విషయాన్ని విస్మరించడం మనకు సాధ్యమా? ఈ సువిశాల ప్రపంచంలో మన అమెరికా దేశము, ఆ దేశీయులమైన మనము తప్ప ఇతరు లెవ్వరూ లేరని మనం భావించగలమా?

'మనం తప్ప మరొకరు లేరు,' అని ఈ నాడు మనం భావించ డానికి వీలులేక పోవడమే మన తాతల కాలానికి, మన కాలానికి గల పెద్ద వ్యత్యాసం. ఇది చాలా ముఖ్యమైన తేడా కూడా. ఈ రెండు తరాలలో వచ్చిన ఈ మార్పు పర్యవసానంగా మన తాతలుచేసిన పొరపాట్లను మనం చేయకుండా ఉండ గలుగుతున్నాం. ఇతర దేశాల్లోవుంటున్న ప్రజలకు ఎప్పుడు ఏమి జరుగుతూ వున్నదో తెలుసుకోకుండా మనం వుండ లేము. వాళ్ళని సర్వనాశనం చేయగల మహాప్రళయం ముంచుకు వచ్చేవరకూ మనం వారిసంగతి పట్టించుకోకుండా వుండనూ లేము.

ఇది రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభం కావడానికి ముందు జరిగిన సంఘటన. జపాన్‌లో పట్టుబట్టలను నిలవచేసి

వుంచిన ఒక గిడ్డంగికి నిప్పంటుకొని అందులోవున్న సరుకు యావత్తూ పరశురామ ప్రీతి అయిపోయింది. మామూలుగానే పట్టుబట్టల ఖరీదు చాలా ఎక్కువగా వుండేది. జపాన్‌లో ఈ దారుణ సంఘటన జరిగి అరగంటైనా కాలేదు. అప్పుడే అమెరికాలో పట్టుబట్టల ధర విపరీతంగా పెరిగిపోయింది. అక్కడ జపాన్‌లో పట్టుబట్టల గిడ్డంగి యావత్తూ భస్మీభూతమై పోయిందని పదనిమిషాల్లో అమెరికా వర్తకులకు టెలిగ్రాములద్వారా వర్తమానం వచ్చింది. రేడియోద్వారా ఈ సంగతి యావత్ప్రపంచానికీ ఇట్టే తెలిసిపోయింది.

రేడియో, టెలిగ్రాము, టెలిఫోను, దేశాంతర వ్యాపారం ఇవన్నీ ప్రపంచ ప్రజలు ఎవరికి వారుగా వుండేందుకు వీలులేకుండా చేసినవి. ఒక దేశం ప్రజలు మరొక దేశం ప్రజలపై ఆధారపడి వుండవలసిన పరిస్థితులను కల్పించినవి.

ఈ శాస్త్రయుగంలో మనం కనిపెట్టిన యంత్రాలు అన్నింటిలో ప్రపంచాన్నే పూర్తిగా మార్చివేసినది విమానం.

ఈ విమానం రాకముందు చెన్నపట్నంనుంచి ఢిల్లీ వెళ్ళాలంటే మూడు రోజులు ప్రయాణం చేయవలసి వచ్చేది. ఇప్పుడు ఉదయం చెన్నపట్నంలో బయలుదేరితే సాయంత్రానికి ఢిల్లీ చేరుకుంటాము. అలాగే సరుకులను కూడా ఎంతో వేగంగా ఒక దేశంనుంచి మరో దేశానికి చేరవేయ్య కలుగుతున్నారు. ఇందువల్ల ప్రపంచంలో ఎవరు ఏమూల నున్నప్పటికి ప్రజలు అందరూ చాలా సన్నిహితంగా ఉండ కలుగుతున్నారు.

శాంతికాలంలో ఈ విమానాలు ఎంత ప్రయోజనకరమో, యుద్ధకాలంలో అంత ప్రమాదకరం. క్రిందటి యుద్ధంలో జర్మనీ విమానాలు లండన్ నగరాన్ని దాదాపు నేలమట్టం చేసినట్లు మనం విన్నాం. పత్రికల్లో ఈ విమాన దాడులనుగురించి వివరాలు చదివాం. మామూలు రోజుల్లో ప్రజావసర వస్తువులను చేరవేసే విమానాలు యుద్ధంవస్తే ప్రజలను హతమార్చి, పట్టణాలను సర్వనాశనంచేసే బాంబులను చేరవేస్తవి! ఏ దేశమూ సురక్షితం కాదని ఈ విమానాలు మనల్ని హెచ్చరిస్తున్నవి.

"మనదేశం మన ఇష్టప్రకారం వ్యవహారం చేస్తుంది. అలాగే మిగతా దేశాలు వాటి యిష్టప్రకారం చెయ్యనివ్వండి," అనేవారు మనతాతలు. "ఎవరు ఏంచేసుకుంటే మనకేం," అనే ధీమాలో మనం ఈనాడు వుండగలమా మరి? మన ఇష్టంవచ్చినట్లు మనం సంచరించడానికి లేదు. అలాగే మరోదేశం దాని ఇష్టప్రకారం వ్యవహరించడానికి లేదు. ఇందుకు భిన్నంగా ఆ దేశం ప్రవర్తిస్తే మనం చూస్తూ వూరుకునేందుకూ వీల్లేదు.

ఈ విమాన దాడులను, ఆటంబాంబులను నిషేధించి, వాట్ని ప్రయోగించేవారిని అదుపులో వుంచగల ఒక ప్రపంచ వ్యవస్థను మనం సృష్టించుకోవాలి. ఈ అణ్వాస్త్రాలు మనపై ప్రయోగింప బడకుండా చూచుకోవడమే గాక, ప్రపంచంలో ఎక్కడా వీటి ప్రయోగం జరక్కుండా చూడడంలో మనమూ, మన దేశమూ చేయవలసింది ఎంతో వుంటుంది.

ఈ విమానాలు, ఇంకా అనేక యంత్రాలు, మారణాస్త్రాలు తయారవడంవల్ల ఇలాంటి ప్రపంచ వ్యవస్థ ఒకటి అత్యంతావశ్యకమైంది. ఆ సంస్థ అవసరం కావడంతోబాటు దాని నిర్మాణమూ సుసాధ్యమైంది.

అయితే, ప్రపంచ దేశాలు కలిసి మెలిసి పరస్పరం సహకరించుకుంటూ వ్యవహరించడానికి ప్రబల ప్రతిబంధకం ఒకరొకరు నమ్మలేక పోవడం.

నా చిన్నతనంలో మామూలుగా ప్రతి పాఠశాలలోనూ అధ్యాపకులు ఇలా చెప్పేవారు: "మన అమెరికా చాలా ఉదాత్తతగల దేశం. కరుణానిధి. ఇతర దేశాలంటే మనం ఎంతో ఉదారంగా చూచేవాళ్ళం. ఆత్మరక్షణకు తప్ప మన దేశం ఎప్పుడూ ఎవరిమీదా యుద్ధం చేయలేదు. కాని, ఇతర దేశాలవారున్నారే—వారు నిజాయతీలేని జనం. మహానీచంగా ప్రవర్తిస్తారు. నిన్ను ఎప్పుడూ దగాచేస్తూనే వుంటారు. శుచి, శుభ్రం ఎరుగరు". ఈ విషయాలే మా పాఠ్య గ్రంథాల్లోనూ వుండేవి.

సామాన్య ప్రజల్లోనూ ఇవే భావాలు. ఈ అవిశ్వాసం అందరిలో బాగా జీర్ణించింది. "మిగతా దేశాలకు మనల్ని దగాచేయడమే పని కాబట్టి, మనం ఆ దేశాలతో చేరి ఒక ప్రపంచ వ్యవస్థను స్థాపించి, తద్వారా వ్యవహారాలు చేసుకోలేం". ఇదీ ప్రజలదోరణి.

ఏ దేశప్రజలు ఆ దేశంగురించి ఇలాగే అనుకుంటారు. మిగతా దేశాలనుగురించీ ఈ విధంగానే అంటారు. "మనం

తప్ప నీతి జాతిగలవారు ఇంకొకరులేరు," అనే ప్రతి ఒక్కరూ అనుకుంటున్నారు.

నా చిన్ననాటి అనుభవం ఒకటి చెప్తాను. చాలా ఏళ్ల క్రితం నా మిత్రు డొకడు మెక్సికో వెళ్ళివచ్చాడు. మెక్సికన్లను గురించి అతను ఇలా చెప్పాడు: "మెక్సికన్లు అందరూ దగాకోరులుగాదు. వాళ్ళల్లోనూ మర్యాదస్తులు, మంచివారు వున్నారు." అమెరికాకు ఇరుగూపొరుగూగా వుంటున్న మెక్సికోను గురించి నా అమెరికన్ మిత్రుడు ఇంతకంటే మంచి మాటలు చెప్పలేక పోయినాడు!

తరువాత కొన్నేళ్ళకు నేనే మెక్సికో వెళ్లాను. అక్కడ కొన్నాళ్ళు వున్నాను. అమెరికానుంచి తమ మాతృదేశాన్ని సంరక్షించుకోవడంలో 1847 లో ప్రాణాలను అర్పించిన మెక్సికన్ వీరుల స్మారకంగా ఏర్పాటైవున్న ఒక స్మారక చిహ్నాన్ని చూచాను. మెక్సికన్ విద్యార్థులు చదివే పుస్తకాలను చూచాను. "మెక్సికో చాలా గొప్పదేశం. ఎంతగొప్పదో అంత మంచిది కూడా. ఆత్మరక్షణకు తప్ప ఎన్నడూ ఎవరితోనూ యుద్ధంచేయలేదు. విరోధులైనవారిని కూడా ఎంతో దయాదాక్షిణ్యాలతో చూచింది. అయితే, అమెరికా నీతిలేనిదేశం. స్వార్థం తప్ప పరమార్థం ఎరుగదు. 1914 లో ప్రసిద్ధ విప్లవ నాయకుడు ఎల్లాను తరుముకుంటూ వచ్చి అమెరికా సైన్యం మెక్సికోపై యుద్ధంచేసింది."

అమెరికాను గురించి అమెరికా విద్యార్థులు చదివే గ్రంథాల్లో ఏవిధంగా వుందో, మెక్సికోనుగురించి మెక్సికో పిల్లలు చదివే పుస్తకాల్లో అదే విధంగా వుంటుంది.

ఒకరోజు ఒక మెక్సికన్ వృద్ధునితో పిచ్చాపాటి మాట్లాడు తున్నాను. మాటల సందర్భంలో నాది అమెరికాదేశం అని అతను తెలుసుకున్నాడు. రెండు మంచిమాటలు చెప్పడానికి ప్రయత్నించి ఇలా అన్నాడు: "అమెరికా నుంచి మా దేశం వచ్చే ప్రతి ఒక్కరూ మమ్మల్ని మోసం చేయడానికే రారు. వాళ్ళల్లోనూ కొందరు మంచివాళ్ళు, ఘరానా మనుష్యులు వుంటారు."

వెనక నామిత్రుడు మెక్సికన్లను గురించి ఏమాటలైతే అన్నాడో సరిగ్గా అవేమాటలు అమెరికన్లను గురించి ఈ వృద్ధ మెక్సికన్ అన్నాడు!

ఇతర దేశాలవారు మనల్ని దగాకోరులనీ, నిజాయతీ లేనివారనీ అభివర్ణించడం మనకు చాలా వికృతంగానూ, విడ్డూరంగానూ కన్పిస్తుంది. కాని, మనం ఇతర దేశాలవారిని గురించి అదే విధంగా అనుకోవడం మనకు వికృతంగాగానీ, తప్పుగాగానీ తోచదు!

ఐక్యరాజ్య సమితి శాంతిని సుస్థిరంచేసి, సంరక్షించ కలగడానికి ముందు ప్రపంచప్రజల్లో ప్రబలిన ఈ అపోహలను, దురభిమానాలను సమూలంగా నిర్మూలించాలి. వీట్ని వదుల్చుకొని మనం బయటపడాలి.

అమెరికా ఈ ప్రపంచ సంస్థలో ఎంతో ప్రముఖమైన స్థానాన్ని అలంకరించి వున్నది. సమితి ఫలప్రదం కావడానికీ, ఈ ప్రపంచ సంస్థ లక్ష్యం సిద్ధించడానికీ అమెరికా ప్రజలు యావన్మందీ యావచ్ఛక్తులా కృషిచేయాలి. (అలాగే భారత దేశమూ, భారతీయులూ కూడా.)

ఒకే సమయాన మనం అనేక ప్రభుత్వాల పౌరులుగ వుండటం సాధ్యమే గదా. మనం ఒక పంచాయితీ గ్రామం లోనో, లేక ఒక మహానగరంలోనో వుంటున్నాం. మనం ఆ పంచాయితీ అధికారానికో, ఆపురపాలక సంఘం అధికారానికో కట్టుబడివున్నాం. ఈ నగరం మన రాష్ట్రంలో అంతర్భాగం. మన రాష్ట్రానికి వేరే ప్రభుత్వం వుంది. ఈ రాష్ట్రం మన దేశంలో అంతర్భాగం. మన దేశానికి అంతటికీ ఒక కేంద్ర ప్రభుత్వం వుంది. ఈ విధంగా మనం ఒకేసారి మూడు నాలుగు ప్రభుత్వాల పౌరులుగా వుంటున్నాం. మన రాష్ట్రం మన దేశంలో అంతర్భాగంగా వుంటున్నట్లే మనదేశం ఇప్పుడు ప్రపంచసంస్థలో చేరి ఐక్యరాజ్యసమితి అంతర్భాగంగా వుంటున్నది. ఇదేవిధంగా యాభై రాజ్యాలకుపైగా సమితిలో చేరినవి. ఆ దేశాల ప్రజలందరితోబాటు మనమూ సమితికి చెందిన వారమైనాము.

ప్రపంచంలో ఇన్ని దేశాలు ఎలా కలసిమెలసి వుండ గలవు అన్న ప్రశ్నకు ఈ ఐక్యరాజ్యసమితి ప్రత్యక్ష సమాధానం.

దాదాపు యాభై దేశాల ప్రతినిధులు శాన్ ఫ్రాన్సిస్కోలో ఐక్యరాజ్య సమితిని స్థిరపరచడానికి సమావేశమైనారు. ఆ మహాసభానంతరం అమెరికా అధ్యక్షుడు తన ప్రజల నుద్దేశించి ఇలా చెప్పారు: "అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో మీరందరూ ఎలా కలసి మెలసి, కలసి కట్టుగా వుండకలుగుతున్నారో అలాగే ప్రపంచంలోని అన్ని జాతులూ ఈ ఐక్యరాజ్య సమితిలో కలసిమెలసి వుండగలవు. మొదటిది ఎంత సులభమో రెండవదీ అంత సులభమే. అర్కాన్సాస్ నదీ జలంపై కాన్సాస్ రాష్ట్రానికీ, కాలోరాడో రాష్ట్రానికీ తగాదా వచ్చిందనుకోండి. ఈ తగాదా పరిష్కారానికి ఈ రెండు దేశాలూ తమ సేనలను సమాయత్తంచేసి యుద్ధానికి దిగుతవా? ఉభయులూ అమెరికా సుప్రీముకోర్టులో దావా తెస్తారు. ఆ కోర్టు తీర్పుకు కట్టుబడి ఈ రెండు రాష్ట్రాలూ వ్యవహరిస్తవి. ప్రపంచంలో కొన్ని రాజ్యాలమధ్య ఏర్పడే తగవులను ఇదే విధంగా పరిష్కరించి వేసుకోవడానికి అధిగమింప నలవిగాని అవరోధాలుగాని, తొలగించడానికి సాధ్యంగాని కారణాలుగాని ఏమీ లేవు."

అధ్యాయం 2

# వివిధరాజ్యాల సమైక్యత

## శాంతిసమరములలో సహచరులు

శాంతిసాధనే ప్రపంచ రాజ్యాలన్నింటి ప్రధాన, ఏకైకలక్ష్యం. ఆ లక్ష్యసాధనకు ఉమ్మడిగా కృషిచేసేందుకు వీలుకలిగించే ఒక సంఘాన్ని స్థాపించే నిమిత్తం 1945 ఏప్రిల్ 25 వ తేదీన శాన్‌ఫ్రాన్సిస్కోలో చరిత్రాత్మకమైన ఒక మహాసభ జరిగింది. ఈ అపూర్వ సమావేశానికి 46 రాజ్యాల ప్రతినిధులు హాజరైనారు.

శాంతిసాధక సంఘాన్ని స్థాపించాలనే ఆలోచన ఒకరి బుర్రలో పుట్టిందికాదు. ఎంతకాలంగానో ఈ విషయమై ఆలోచనలు జరుగుతున్నవి. చాలామంది చాలా చాలా సూచనలు చేశారు. ఇందుకు సంబంధించిన ఎన్నో ప్రతిపాదనలు వెలువడ్డవి. తయారైన పథకాలు కొల్లలుగా వున్నవి. వీటన్నింటినీ ఆధారం చేసుకొని ఈ 46 దేశాల ప్రతినిధులు సమాలోచనలు ప్రారంభించారు.

ఆలోచనలకూ, పథకాలకూ ఎప్పుడూ కొరతలేదు. క్రిందటి ఏడుశతాబ్దాల్లోనూ ప్రాజ్ఞులెందరో ఇలాంటి ప్రణాళికలను తయారుచేశారు. విలియంపెన్ అనే అతడు సరిగ్గా ఇలాంటి పథకాన్నే తయారుచేసి వున్నాడు.

అయితే, ప్లాన్లు ఇన్ని వున్నప్పుడు వాట్ని అనుసరించి ఒక ప్రపంచ సంస్థస్థాపనకు ప్రయత్నాలు ఎందుకు జరుగలేదు?

ప్రయత్నించినా ఫలించే అవకాశం లేకపోవడం వల్లనే. అప్పట్లో ఇప్పుడున్న రవాణా, రాకపోకల సౌకర్యాలు లేవు. ఈనాడు మనకు సులభంగా లభించే సాధనాలు అన్నీ ఆనాడు అలభ్యంగానే వున్నవి.

దురాక్రమణ నిరోధక బాధ్యతను వహించే భద్రతా మండలి ఐక్యరాజ్యసమితి వివిధ శాఖలలో ఒకటి. ఇది చాలా ముఖ్యమైన సంఘంకూడా. ఈ మండలి సమావేశమై ఏదో చాలా ముఖ్యమైన విషయం చర్చిస్తున్న దనుకోండి. ఈ విషయంలో తను ఏ వైఖరిని అవలంబించాలనే సందేహం బ్రిటిష్ ప్రతినిధికి కలగవచ్చు. వెంటనే ఆయన లండన్‌లో వున్న బ్రిటిష్ ప్రధానమంత్రితో టెలిఫోనుపై మాట్లాడి సందేహాలు తీర్చుకోవచ్చును. టెలిఫోను సంప్రతింపులవల్ల ఈ అనుమానాలు నివృత్తి కాకపోతే న్యూయార్కులోని బ్రిటిష్ ప్రతినిధి వెంటనే ఇంగ్లండ్ వెళ్ళి ప్రధానమంత్రిని ఇతర అధికారులను కలుసుకొని ఈ వ్యవహారాన్ని కూలంకషంగా చర్చించుకుంటారు. ఒక నిర్ణయానికి వస్తారు. బ్రిటిష్ ప్రతినిధి వెంటనే న్యూయార్క్ తిరిగివస్తాడు. ఇంతపనీ రెండు మూడు రోజుల్లో పూర్తి అవుతుంది—ఈనాడు.

రెండు మూడువందల సంవత్సరాల క్రితం ఈ విధంగా సంప్రతింపులు జరుపుకొని 48 గంటల్లో ఒక నిర్ణయానికి వచ్చేందుకు ఎంతమాత్రం అవకాశం లేదుకదా. ఆ కాలంలో ఏదో విషయంపై ఇలా సంప్రతింపులు జరుపుకొని తిరిగివచ్చే సరికి మరొక కొత్త సమస్య ఉత్పన్నం కాగల అవకాశంకూడా

వుండేది. కనుకనే, రెండు మూడు శతాబ్దాలక్రితం ఇలాంటి సంప్రతింపులకు అవకాశంలేని కారణంచేతనే ఇలాంటి ప్రపంచ వ్యవస్థను స్థాపించి నిర్వహించడం అసాధ్యంగా వుంది.

సాధ్యాసాధ్యాల విషయం అలావుంచినా అసలు అనేక దేశాల ప్రజలకు ఈ విధమైన ప్రపంచ సంస్థల్లో ఆసక్తే లేదు. ఇన్ని దేశాల ప్రజలమధ్య సంబంధాలు కల్పించి ఒకరి వ్యవహారాల్లో మరొకరికి ఆసక్తి కలిగేట్లు చేయగల ప్రపంచ విస్తృత ప్రచారంగల పత్రికలు గాని, రేడియోలు గాని, వార్తాచిత్రాలు గాని, రేడియో ఫోటోలుగాని ఏమీ లేవు. ప్రయాణ సౌకర్యాలు లేనందువల్ల ప్రజలు ఎక్కడివారు అక్కడే వుండిపోయేవారు. ఇతరదేశ ప్రజలనుగురించి వారి కేమీ తెలియదు. తెలుసుకోవాలనే ఉత్సాహంకూడా ఎవ్వరికీ లేదు.

అమెరికా ప్రభుత్వ ప్రప్రథమ సమావేశం 1789 వ సంవత్సరంలో న్యూయార్కు పట్నంలో జరిగింది. జియార్జియా న్యూహాంప్షైర్లనుంచి న్యూయార్కుకు ప్రతినిధులు రావడానికి రెండు వారాలు, మూడు వారాలు పట్టింది. ఐక్యరాజ్యసమితి సర్వ సభ్యసంఘం న్యూయార్కులో సమావేశమైతే ఏ దేశపు ప్రతినిధులైనా ఒకటి రెండు రోజుల్లో వచ్చివేయ గలరు. ఇప్పుడు విమానాలద్వారా విస్తీర్ణాన్ని జయించడంవల్ల ప్రపంచం చాలా చిన్నదై పోయింది!

ప్రాచీన కాలంలో ఇలాంటి సమితిసంఘాలు, సమాఖ్యలు ఏర్పాటైనా, 1919 వ సంవత్సరంలో ఏర్పాటైన నానాజాతి

సమితి ఒక్కటే దాదాపు అన్ని ఖండాల ప్రజలను ఒక సంస్థలో చేర్చ కలిగింది.

ఒక మహావిపత్తు యావత్ప్రపంచాన్నీ ఎదుర్కొంటున్న సమయంలో ఐక్యరాజ్య సమితి ఏర్పాటైంది. బ్రహ్మాండమైన యుద్ధజ్వాలలు యావత్ప్రపంచాన్నీ ఆవహించినవి. ఏ దేశంపై చూచినా బాంబులు వర్షపాతంలా పడుతున్నవి. ప్రపంచ వినాశనం ఆసన్నమైనదా అని అందరూ భయపడుతూవున్న సమయంలో ఈ ఐక్యరాజ్యసమితి అవతరించింది. తెల్లవారితే ఏమో అనే భయం క్రుంగదీస్తుండగా, ఈ ప్రమాదంనుంచి బయటపడితే భవిష్యత్తు మహారాజ్యాలంగా ఉండగలదనే ఆశతో మిత్రరాజ్యాల ప్రతినిధులు ఒకచోట చేరారు. అప్పటికి అమెరికా రణరంగప్రవేశం చేయలేదు. యావత్ప్రపంచమూ నాజీ నియంతకు పాదాక్రాంతం కావడం ఇప్పుడో మరి కొంత సేపటికో అన్నట్లున్నది పరిస్థితి. ఐక్యరాజ్యసమితి అవతరణగాథ ఆ సమయంలో ప్రారంభమైంది.

నాజీసేనలు అపూర్వ విజయాలను సాధిస్తున్నవి. బ్రిటిష్ సామ్రాజ్యం జీవన్మరణ పోరాటాన్ని సాగిస్తున్నది. 1941 ఆగస్టు అది. అప్పుడు బ్రిటిష్ ప్రధానమంత్రి విన్‌స్టన్ చర్చిల్ అమెరికా అధ్యక్షుడు ఫ్రాంక్లిన్ డి. రూజువెల్ట్‌ను కలుసుకున్నారు. చరిత్రగతినే మార్చివేసిన ఈ సమావేశం అట్లాంటిక్ మహాసముద్రంలో ఒక అమెరికా యుద్ధనౌకపై జరిగింది. జర్మనీ రష్యాపైకూడా యుద్ధం ప్రారంభించి అరవై

రోజులైంది. జర్మనీసేనల పురోగమనంచూస్తే రష్యా ఏ క్షణంలోనైనా పడిపోవచ్చును అన్నట్లుంది.

అట్టి విపత్కర పరిస్థితులలో రూజ్‌వెల్ట్, చర్చిల్ అట్లాంటిక్ ప్రణాళికను తయారుచేశారు.

ప్రపంచ భద్రతకు మున్ముందు ఒక స్థిరమైన, విస్తృతమైన ఏర్పాటు జరుగగలదనే విశ్వాసాన్ని అమెరికా, బ్రిటన్‌లు జాయింటుగా ఈ ప్రణాళికలో వెల్లడించాయి. ఇదే ఈ ప్రణాళికలో పేర్కొనతగ్గ ప్రధాన విషయం.

ఈ ప్రకటన జరిగిన అయిదు మాసాలకు అనగా 1941 డిసెంబరు 7 వ తేదీన జపాన్ అమెరికాపై యుద్ధం ప్రారంభించింది. పెరల్ హార్బర్‌లో వున్న అమెరికను నౌకలపై విమానదాడులు జరిపి జపాన్ అనేక నౌకలను ధ్వంసం చేసింది. వెంటనే జర్మనీ అమెరికామీద యుద్ధం ప్రకటించింది. ఈ సంఘటనలు అన్నింటికీ సమాధానంగా దక్షిణ అమెరికా రాజ్యాలు అన్నీ జర్మనీ జపాన్‌లపై యుద్ధం ప్రకటించినవి.

ఇదంతా జరిగిన కొద్దిరోజులకే జర్మనీ, జపాన్‌లపై యుద్ధాన్ని ప్రకటించిన 26 దేశాల ప్రతినిధులు వాషింగ్టన్‌లో సమావేశమైనారు. అట్లాంటిక్ ప్రణాళికను ఆమోదించి తమ "యుద్ధ లక్ష్యాలను" ప్రకటించుకున్నారు. ఈ 26 రాజ్యాలు 'సమైక్య రాజ్యాలు' అని ఆ ప్రతినిధులు చెప్పుకున్నారు. అయితే, ఇప్పటికీ ప్రపంచ రాజ్యాల సమైక్యత సంపూర్ణంగా సిద్ధింపలేదు. అయినా అట్టి సమైక్యత సిద్ధింపదేమోనని సందేహ-

పడ నవసరంలేదు. అమెరికాలోని 13 రాష్ట్రాలు "అమెరికా సంయుక్త రాష్ట్రాలు"గా 1776 లో ప్రకటించుకున్నవి. తరువాత 13 సంవత్సరాలకుగాని అవి నిజంగా సమైక్యం కాలేదు.

ఈ మిత్రరాజ్యాలు శత్రువును జయించేందుకు సమైక్యంగా కృషిచేయడం ఎలాగా అని ఆలోచిస్తూ, ఆ ఆలోచనలను ఆచరణలో పెడుతూ అనుభవాన్ని సంపాదించుకుంటూ వుండగా, యుద్ధానంతరం శాంతిని ఎలాకాపాడుకోగలం అని అనేక మంది ప్రశ్నిస్తూ వచ్చారు.

ఈ ప్రశ్నలకు సమాధానాలు కూడా అప్పటికప్పుడు వస్తున్నవి. ప్రపంచసమితి స్థాపనకు అమెరికా సుముఖంగా వున్నట్లు శాసనసభలు రెండూ ప్రకటించినవి. వివిధ దేశాల్లో సామాన్య ప్రజలు, ప్రముఖ నాయకులు ఇదేవిధంగా తమ అభిప్రాయాలను ప్రకటించారు. ప్రపంచసంస్థ ఏర్పడాలనే వాంఛ గాఢమైంది. ఈ విషయాన్ని సమగ్రంగా చర్చించేందుకు 1943 అక్టోబరులో అమెరికా, బ్రిటన్, రష్యా, చైనా విదేశాంగ మంత్రులు మాస్కోలో సమావేశమైనారు.

అమెరికా అధ్యక్షుడు రూజువెల్టు ఒక ప్రవీణుల సంఘాన్ని నియమించి, ప్రపంచసంస్థ స్థాపనకు ఒక పథకాన్ని తయారుచేయమని ఆదేశించారు. అయిదారు మాసాలు దీర్ఘచర్చలు జరిపి, సమగ్ర పరిశోధనలుచేసి ఈ సంఘం ఒక పథకాన్ని తయారుచేసింది. అమెరికా ప్రభుత్వ విదేశాంగ

శాఖ ఈ పథకం ప్రతులను తయారుచేసి రష్యా, బ్రిటన్, చైనా ప్రభుత్వాలకు పంపించింది. ఈలోపున ఈ దేశాల ప్రభుత్వాలుకూడా కొన్ని పథకాలను తయారు చేసినవి.

ఇక ఈ వివిధ పథకాలను పరిశీలించి, సమన్వయంచేసి అందరికీ సమ్మతంగావుండే ఒక పథకాన్ని తయారుచేయవలసి వుంది. ఇందుకుగాను రెండు ముఖ్య సమావేశాలు జరిగినవి.

1944 ఆగస్టు 21 న డంబర్టన్ వోక్సు సమావేశం ప్రారంభమైంది. అప్పటికి యుద్ధగతిలో చాలా పెద్దమార్పు వచ్చింది. మిత్రసేనలు పారిస్‌ను తిరిగి స్వాధీనం చేసుకుని, పశ్చిమోత్తర ఫ్రాన్సును పూర్తిగా ఆక్రమించినవి. ఇటలీ పర్వతప్రాంతంలో అమెరికా సైనికులు వందలువేలుగా హతులై పోతున్నారు. నిరుపమాన త్యాగాలుచేసి, ప్రాణాలకు తెగించి, ఎంతో సాహసంచేసి అమెరికాసేనలు ఫ్రాన్సు దక్షిణతీరాన దిగినవి. అటు తూర్పున సోవియట్ సేనలు జర్మనీసేనలను తరుముకుంటూ పోలెండ్ రాజధాని వార్సా ముఖద్వారం వరకూ వచ్చినవి. నాజీసేనలు అన్నిరంగాల్లోనూ చావుదెబ్బ తింటున్నవి. సైనికదళాలు, దళాలు నేలకు వొరుగుతున్నవి.

జపాన్ సేనల స్థితి ఇంతకంటే మెరుగ్గాలేదు. మెకార్థర్ సేనలు ఒక ద్వీపంనుంచి మరొకద్వీపం మీదికి వురుకుతూ జపాన్ సేనలపై చక్రబంధాన్ని ప్రయోగించినవి.

ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరం, కొందరు ప్రముఖులు పారిస్‌లో సమావేశమై నానాజాతి సమితి స్థాపనకు ఒక పథకాన్ని తయారుచేశారు. వీరెవ్వరూ అసలు విషయాన్ని

ఆలోచించలేదు. తాము తయారుచేస్తున్న పథకాన్ని అమెరికా శాసనసభలు అంగీకరింపక పోవచ్చుననే అను మానమే వీరికి లేకపోయింది. కాని, తీరా పథకం తయారయ్యే సరికి అమెరికా శాసన సభలు ఆ పథకాన్ని తిరస్కరించినవి. నానాజాతి సమితిలో అమెరికా చేరలేదు.

ప్రపంచ రాజ్యాల్లో ఒక పెద్దరాజ్యం ప్రపంచ సంస్థలో చేరకపోతే ఆ సంస్థవల్ల కాగల పని ఏమీ లేదని నానాజాతి సమితి నిరూపించింది. కనుకనే, ఈనాటి పెద్దరాజ్యాలు నాలుగున్నూ—అమెరికా, రష్యా, బ్రిటన్, చైనా—చేరగల వనే నమ్మకం కలిగిన తరువాతనే డంబర్టన్ వోక్సులో పథక రచనకు నాలుగు రాజ్యాల ప్రతినిధులూ పూనుకున్నారు. వీరు తయారుచేసిన పథకాన్ని డంబర్టన్ వోక్సు ప్రతిపాదనలు అన్నారు. ఈ ప్రతిపాదనలను స్థిరపరచడానికి పూర్వా విశేషంగా ప్రచారం జరిగింది.

ప్రజాసామాన్యము, ప్రపంచ రాజకీయ వేత్తలు ప్రతి పాదనలను పరిశీలించారు. చాలామంది "ఇక్కడ ఇలావుంటే బాగుంటుంది" అనీ, "అక్కడ అలా ఉంటే బాగుంటుం దేమో చూడండి" అనీ సవరణలు ప్రతిపాదించారు.

శాంతి సురక్షణకు ప్రపంచసంస్థ అవసరం అనే విషయంలో విభిన్నాభిప్రాయాలుగాని, భేదాభిప్రాయాలుగాని లేవు. కాని, భద్రతామండలిపై అగ్రరాజ్యాలకు ఎంత అధికారం వుండాలో విషయంమీద మాత్రం డంబర్టన్

వోక్సులో సమావేశమైన నాలుగు అగ్రరాజ్యాల ప్రతి నిధులకూ సమాధానం కుదిరింది గాదు.

ఈ ప్రతిష్ఠంభనమును పరిష్కరిస్తేగాని ముందడుగుపడే అవకాశం లేదు. 1945 ఫిబ్రవరిలో అమెరికా అధ్యక్షుడు రూజ్‌వెల్ట్, బ్రిటన్ ప్రధానమంత్రి చర్చిల్, రష్యా అధిపతి మార్షల్ స్టాలిన్ యాల్టాలో సమావేశమైనారు. డంబర్టన్ వోక్సులో ఎంతకీ పరిష్కారంకాకుండా వుండిపోయిన సమస్య లను క్షుణ్ణంగా చర్చించి, తమ సలహాదారులతో సమాలోచ నలు జరిపి చివరికి అన్నింటిపైనా సమాధానాన్ని సాధించారు.

వెంటనే ప్రపంచసంస్థ స్థాపనా ప్రణాళికను ఆమోదించే నిమిత్తం ఐక్యరాజ్య ప్రకటనపై సంతకాలుచేసిన 26 రాజ్యాల ప్రతినిధులూ సమావేశం కావాలని అగ్రరాజ్యాలు సూచించి నవి. జపాను, జర్మనీలపై యుద్ధం ప్రకటించిన దేశాలు మాత్రమే శాన్‌ఫ్రాన్సిస్కోలో జరిగే ఈ సమావేశానికి హాజరు కావచ్చునని స్పష్టం చేయించడం జరిగింది. ఈ షరతు అనేక దేశాలను కలవరపెట్టింది. ఈ సమావేశం చాలా ముఖ్యమైనది కాబోతున్నదని అందరూ గ్రహించారు. ఆ విధంగా గ్రహించిన పది దేశాలు అప్పటి కప్పుడు జర్మనీ, జపాన్‌లపై యుద్ధం ప్రకటించినవి. చివరికి శాన్‌ఫ్రాన్సిస్కోలో జరిగిన ఈ ప్రపంచ రాజ్యాల మహాసభలో యాభై దేశాలు పాల్గొన్నవి. అక్కడ తయారైన ఐక్యరాజ్యసమితి ప్రణాళికపై 51 రాజ్యాలు సంతకం పెట్టినవి.

శాన్‌ఫ్రాన్సిస్కో సభ ప్రారంభమైన రోజున రష్యన్ సేనలు జర్మనీ రాజధానిని చుట్టుముట్టినవి. నాజీసేనలు బ్రహ్మాండంగా ప్రతిఘటించినవి. లాభం లేకపోయింది. తరువాత రెండురోజులకే అమెరికా రష్యా సేనలు కలుసు కున్నవి. జర్మనీ యుద్ధం పరిసమాప్తమైంది.

జపాన్‌తో మాత్రం యుద్ధం ఇంకా సాగుతూవుంది. ఒకినావా ఆక్రమణకు యుద్ధం ప్రారంభమైంది. ప్రాచ్య యుద్ధం ఇంచు మించు ముగింపు దశకు వచ్చింది.

ఈ సమయంలో ప్రపంచ దేశాల ప్రతినిధులు నాలుగు వందలమంది శాన్‌ఫ్రాన్సిస్కోలో ఒక ప్రసిద్ధ భవనంలో సమావేశమైనారు. సభాంగణం మిత్రరాజ్యాల జాతీయ పతాకాలతో అలంకరింప బడింది. అట్లాంటిక్ ప్రణాళిక ప్రవ చించిన చతుస్స్వాతంత్ర్యాలను గుర్తుచేస్తూ సభావేదికపై సువర్ణ వర్ణంలో నాలుగు శ్రేణులు ఏర్పాటై వున్నవి.

ఇక సభాస్థలి వెలుపల జపాన్ విమానాలు విహ రిస్తున్నవి. శాంతి పథకాన్ని తయారు చేస్తున్న వారినందరినీ హతమార్చాలని కాబోలు ఈ విమానాలు బాంబులు వేసినవి. అదృష్టవశాత్తూ ఇవి నగర పరిసరాల్లో వున్న పర్వతాల్లో పడి ప్రేలినవి. ఈ సంఘటన ఇక్కడ సమావేశమైనవారికి వారి కర్తవ్యాన్ని, బాధ్యతలను సూచించినది.

ప్రతినిధులుగానీ, ప్రేక్షకులుగానీ దాదాపు నాలుగువేల మంది ఆ సభాంగణంలో చేరారు. అంతా అతి గంభీరంగా,

కర్తవ్య నిర్వహణలో నిమగ్నులై వుండిపోయినారు. అధిక ప్రసంగాలు లేవు. అనవసర విషయాలపై తర్జన భర్జనలు లేవు.

ఇక్కడ సమావేశమైన వారిలో ఎందరో తమ ప్రాణాలనుకూడా సరకు చేయక యుద్ధంలో పాల్గొన్నారు. శత్రు ఆక్రమణనుండి తమ దేశానికి విముక్తి సాధించేందుకు ఎంతో ధైర్యంగా గెరిల్లా యుద్ధాన్ని సాగించిన యోధులు ఎందరో వున్నారు ఈ సభాసదులలో. సమష్టి ప్రయోజనం కొరకు స్వార్థాన్ని త్యజించి, ప్రపంచ శాంతిసాధనకు తమ మధ్య తల ఎత్తిన విభేదాలను తొలగించుకొనక తప్పదని ఇంతమంది గుర్తించారు.

యుద్ధరంగం పరిస్థితి ఎలా వున్నదీ, యీ యుద్ధం క్షణం సాగడంవల్ల ఎన్నివేలమంది హతులైపోతున్నదీ వీరు పత్రికల ద్వారా, రేడియోద్వారా ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ వున్నారు. మరొక యుద్ధమే ప్రారంభమైతే రాకెట్ బాంబులు ప్రపంచంలోని ప్రతి ఒక్క పట్నాన్నీ నేలమట్టం చేసివేయ గలవని వీరందరూ గ్రహించారు.

ఒక సంస్థ స్థాపనకు అవసరమైన ప్రణాళికను తయారు చేయడానికి ఇంతమంది చేరాలా? ఇన్నాళ్ళు చర్చలు, సంప్రతింపులు జరపాలా? ప్రతిభావంతులు, ప్రాజ్ఞులు అయిన వారు నలుగురైదుగురు ప్రశాంతంగా ఒక గదిలో కూర్చొని అన్ని ప్రతిపాదనలను పరిశీలించి ఒక కార్యక్రమాన్ని తయారు చేయలేరా? చేయవచ్చు. అది చాలా సులభమైన మార్గం

కూడా. నాలుగైదు రోజుల్లోనే పథకం తయారు కాగలదు కూడా. కాని, అసలు లక్ష్యం సిద్ధింపక పోవచ్చును.

సర్వజనసమ్మతం కాని విషయాలను ఈ బుద్ధిమంతులు ఈ ప్రణాళికలో చేర్చవచ్చును. అదేవిధంగా ఇలాంటి ప్రణాళికల్లో ముఖ్యంగా ఉండవలసిన అంశములను కొన్నింటిని వీరు వదలివేసి వుండవచ్చును.

అవకాశం వున్నంతవరకు అత్యధిక సంఖ్యాకులు తమ అభిప్రాయాలను తెలియచేయడానికి వీలు కల్పించి తదను గుణంగా ఈ ప్రణాళికను సవరించడం, సంస్కరించడం ప్రజాస్వామిక విధానం. ఇలాంటి ప్రపంచసంస్థలు ఫలప్రదం కావాలంటే ప్రజాసామాన్యం ఈ సంస్థల నిర్మాణంలోనూ, నిర్వహణలోనూ విశేషంగా ప్రమేయం పెట్టుకోవాలి.

ఐక్యరాజ్య సమితి వ్యవహారాల్లో అమెరికా ప్రజలు చూపిన శ్రద్ధాసక్తులను తెలుసుకొనేందుకు ఒకచిన్న విషయం చెప్తాను. శాన్‌ఫ్రాన్సిస్కో సభ ఇంకా ప్రారంభం కాలేదు. డంబర్టన్ వోక్సు ప్రతిపాదనలపై తమ అభిప్రాయాలను తెలుపుతూ వారంవారం ఇరవైవేలమంది అమెరికా విదేశాంగ శాఖకు వ్రాస్తూ వచ్చారు. విదేశాంగ శాఖ అధికారులు వీటిని బుట్టదాఖలు చేయలేదు. ప్రతి ఒక్క జాబును శ్రద్ధగా పరిశీలించి అన్నింటినీ విషయానుక్రమంలో కూర్చి ఏ ప్రతిపాదనకు ఎంతమంది సుముఖంగా వున్నారో, ఏ ప్రతి పాదనను ఎంతమంది సవరింప కోరుతున్నారో ఒక జాబితా తయారు చేశారు. ఇదేవిధంగా దాదాపు అన్ని దేశాల ప్రజలు

తమ ప్రభుత్వాలకు తమ తమ అభిప్రాయాలను నివేదించి వుంటారు.

శాన్‌ఫ్రాన్సిస్కో సభకు హాజరైన యాభై దేశాల ప్రతినిధులు, ప్రతి ఒక్క విషయంపైనా వివరాలు సేకరించుకొని, అనేకమంది సలహాదారులతో, ప్రవీణులతో, బహు భాషా కోవిదులతో ఏ అవాంతరాన్నయినా ఎదుర్కొన డానికి సంసిద్ధులైనారు. అమెరికా ప్రతినిధివర్గంలోనే దాదాపు రెండువందల పాతికమంది వున్నారు. ఏడుగురు అధికార ప్రతినిధులు, మరో ఏడుగురు అమెరికా శాసనసభల సభ్యులు, ఇరవైతొమ్మిది మంది సలహాదారులు, నూరుమందికిపైగా సహాయ వుద్యోగులు, వివిధ ప్రజాసంస్థలకు చెందిన ప్రముఖులు ఒక నలభైమంది, ఇతర వుద్యోగులు సుమారు రొకయాభై మంది. వీరుగాక, ప్రేక్షకులుగా తమంతటతాముగా ఈ సమావేశానికి హాజరైన ప్రముఖులు ఎందరో వున్నారు.

ఇదేవిధంగా ఇతర దేశాలనుంచీ ఎందరో వచ్చారు. మొత్తంపైన దాదాపు రెండువేలమంది సరిగ్గా రెండు మాసాల ఒకరోజు అహర్నిశలు కష్టపడి ఐక్యరాజ్యసమితి ప్రణాళికను తయారుచేశారు.

ఒక్కొక్క విషయాన్ని విచారించేందుకు ఒక ఉపసంఘం ఏర్పాటైంది. ప్రతి ఒక్కరూ డంబర్టన్ వోక్సు ప్రతిపాదనలను ఎలా మెరుగుపెట్టడమా అనే ఆలోచించారు. తమ పంతమే నెగ్గాలని ఎవ్వరూ మంకుపట్టు పట్టలేదు. ఆస్ట్రేలియా ప్రతినిధి వర్గం ఈ ప్రతిపాదనలకు 38 సవరణలను సూచించింది.

సర్వసభ్య సమావేశం ఇందులో 26 సవరణలను అంగీక రించింది!

ప్రతి ఉపసంఘంనుంచీ తయారై వచ్చిన ప్రణాళికా పర్వములను క్రోడీకరించి అవసరమైనప్పుడు సమన్వయంచేసి యూభై రాజ్యాల ప్రతినిధులు మహోత్కృష్టమైన ఈ సమితి ప్రణాళికను తయారు చేశారు.

ఈ ప్రణాళిక సాఫుప్రతిని అయిదుభాషల్లో సిద్ధం చేశారు. ఈ అయిదు ప్రతులను సభావేదికపై వుంచారు. మహాసభాధ్యక్షుడు ఈ ప్రణాళికపై సభ్యుల సమ్మతి తీసుకున్నాడు. ప్రతి ఒక్క ప్రతినిధివర్గం తన సంపూర్ణా మోదాన్ని ప్రకటించింది. అంతమందిలో ఒక్క ప్రతికూల ధ్వని వినిపించలేదు.

అందరూ మూజువాణిగా ఆమోదించిన తరువాత ఈ యాభై దేశాల తరఫున ప్రతినిధి వర్గాల నాయకులు సంతకం చేశారు. ఈ అయిదు ప్రతులమీాదా మొత్తం 148 మంది సంతకం చేశారు. ప్రప్రథమంగా చైనా ప్రతినిధివర్గంవారు సంతకం పెట్టారు. ఇక వివిధరాజ్యాల ఆమోదమే మిగిలి వుంది.

శాన్‌ఫ్రాన్సిస్కో మహాసభ ముగిసిన ఒకమాసం తరువాత అమెరికా సెనెట్‌సభ ఈ ప్రణాళికను దీర్ఘంగా చర్చించి ఆమోదించింది. అమెరికా ఐక్యరాజ్య సమితిలో చేరడానికి సమ్మతి తెలుపుతూ సెనెట్‌సభ ఒక తీర్మానం కూడా చేసింది.

అక్టోబరు 24 నాటికి ఈ ప్రణాళిక ప్రపంచ శాసన మైంది. శాసనాన్ని అమలు పరచడానికి అవసరమైనన్ని రాజ్యాలు తమ ఆమోదాన్ని తెలిపినవి. ఇక ఈ శాసనాన్ని ప్రతి ఒక్క దేశం శిరసావహించి తీరవలసిందే.

మూడు మాసాలతరువాత ఈ ప్రణాళికా రచనలో పాల్గొన్న 51 దేశాలు ఈ శాసనాన్ని అంగీకరించినట్లు వెల్లడి అయింది. 1946 జనవరి 10 న ఈ ప్రపంచ శాసనం అమలుకు వచ్చింది. ఆ రోజున సమితి సర్వసభ్య సమావేశం లండన్‌లో ప్రారంభమైంది. భద్రతా మండలికి, సమితి ఇతర శాఖలకు, కార్యాలయానికి స్వరూపం ఏర్పడింది. ఐక్యరాజ్య ప్రణాళిక కేవలం ఒక పథకం మాత్రమేగాక అనేక సజీవమైన ప్రపంచ సంస్థగా వెలిసింది.

# రెండవ భాగం

# ఐక్యరాజ్య సమితి వ్యవహారాలు



## అధ్యాయం 3

## సర్వసభ్యసంఘం—ప్రపంచ పౌరమహాసభ

మీరు మీ రాష్ట్ర శాసనసభల సమావేశాలు ఎలా జరుగుతూ వుంటవో, మీ దేశ పార్లమెంటు ఎలా జరుగుతూ వుంటుందో చూచివుంటే ఈ ప్రపంచ పార్లమెంటు సమావేశం ఎలా జరుగుతుందో సులభంగా తెలుసుకోగలరు. దేశీయ శాసన సభల్లో పార్టీలవారిగా స్థానాలు ఏర్పాటుచేస్తారు. ఈ ప్రపంచ పార్లమెంటులో ఆ యా దేశాలకు అక్షరక్రమంలో స్థానాలను ఏర్పరుస్తారు.

ప్రతిదేశమూ అయిదుగురు ప్రధాన ప్రతినిధులను, మరో అయిదుగురు ప్రత్యామ్నాయ ప్రతినిధులను పంపవచ్చును. ఈ పదిమందికీ సర్వసభ్యసంఘ సమావేశం జరిగే హాలులో బల్లలు, కుర్చీలు వుంటవి. ఈ విధంగా దాదాపు అరవై దేశాలనుంచి వచ్చే అయిదారు వందలమంది ఈ సమితి సర్వ సభ్య సమావేశంలో పాల్గొంటూ వుంటారు. ప్రతిదేశపు ప్రతినిధి వర్గానికీ ముప్పయి, నలభైమంది సలహాదారులు వుంటారు. వీరికి సమితి సమావేశం జరుగుతున్న హాలులో గాక, ఈ హాలుకు అనుకొనివున్న మరొక హాలులో స్థానాలను ఏర్పాటు చేస్తారు.

వివిధ రాజ్యాలకు చెందిన అయిదారు వందలమంది ప్రతినిధులేగాక, సుమారు రెండువేలమంది సమితి సిబ్బందికూడా ఈ సమావేశాలకు హాజరవుతూ వుంటారు. ప్రతినిధులుచేసే ఉపన్యాసాలను వ్రాసుకునేందుకు సంక్షిప్తలేఖకులు, ఆ ఉపన్యాసాలను ఇతర భాషల్లోకి అనువదించేవారు, మామూలు గుమాస్తాలు—వీరు అందరూ సమితి సిబ్బందిలో చేరినవారే.

సాధారణంగా సమితి సర్వసభ్య వార్షిక సమావేశం ప్రతిసంవత్సరం సెప్టెంబరు 2 తరువాతవచ్చే మూడవ మంగళవారంనాడు ప్రారంభ మౌతుంది. ఈ సమావేశం అయిదారు వారాలు జరుగుతుంది. ఈ వార్షిక సమావేశం లోనే ఆ సంవత్సరానికి సర్వసభ్యసంఘ అధ్యక్షుణ్ణి, ఏడుగురు ఉపాధ్యక్షులను ఎన్నుకుంటారు. సమితి ప్రణాళికను అనుసరించి ఏ సంవత్సరానికి ఆ సంవత్సరం సమితి సమావేశాలకు సంబంధించిన నియమ నిబంధనలను తయారు చేసుకుంటారు. సమావేశకాలం దగ్గర్నుంచి ఒక్కొక్క ప్రతినిధి ఎంతకాలం ఉపన్యాసం చేయవచ్చు అనేవరకూ అన్ని విషయాలూ ముందే నిర్ధారణ అవుతవి.

ఎప్పుడైనా అసాధారణ పరిస్థితులు ఏర్పడితే, భద్రతా మండలి సూచించినా, సమితి సభ్యులలో హెచ్చుమంది కోరినా సర్వసభ్య సమావేశం జరుగుతుంది. సమితి సమావేశాలన్నీ బహిరంగంగానే జరగాలనిగాని, రహస్యంగా జరగాలనిగాని ఏమీ లేదు. రహస్యంగా సమావేశం కావడం వల్ల ఎక్కువ ప్రయోజనం వుంటుందని సభ్యులు భావిస్తే తప్ప

సాధారణంగా సర్వసభ్య సమావేశాలే గాక, సమితికి సంబంధించిన అన్ని సంఘాల, ఉపసంఘాల సమావేశాలు కూడా బహిరంగంగానే జరుగవలసి వుంటుంది. ఎప్పుడైనా రహస్య సమావేశాలు జరిగితే వాటి నిర్ణయాలను విధిగా వెల్లడి చేయవలసి వుంటుంది.

ఈ సమావేశాల్లో ఏ దేశం ప్రతినిధి ఏ విషయంమీద ఏమి చెప్తున్నాడో, అప్పటి కప్పుడు ప్రపంచ ప్రజలందరికీ తెల్సిపోతుంది. దాదాపు నాలుగు వందలమంది పత్రికా విలేఖరులు యీ ప్రసంగాలను వ్రాసుకొని, ఆ క్షణమే ప్రపంచంలో ఎక్కడెక్కడో వుంటున్న తమ పత్రికలకు పంపుతారు. రేడియో, టెలివిషన్ సంస్థలు యీ కార్యక్రమాన్నంతా ఎప్పటికప్పుడు ప్రసారం చేస్తూవుంటాయి. దాపరికం అనేది లేకపోవడంవల్ల, రహస్యం అనేది లేకపోవడంవల్ల ఇతర దేశాల ప్రతినిధులు తమ చర్యలను గురించి ఏమి చెప్పగలరో అనే భయం దాదాపు అన్ని దేశాల ప్రభుత్వాధికారులకూ వుంటుంది.

ఎవ్వరికీ తెలియని భాషలో ఒక దేశం ప్రతినిధి ప్రసంగిస్తాడని సమాధాన పెట్టుకోడానికి వీల్లేదు. ఏ భాషలో మాట్లాడినా ఆ ప్రసంగం అప్పటికి అప్పుడు ఇతర భాషల్లోకి తర్జుమా అయిపోతుంది. ఫ్రాన్సు ప్రతినిధి ఫ్రెంచి భాషలో మాట్లాడితే ఆయన ప్రసంగం వెంటనే ఇంగ్లీషులోకి తర్జుమా అవుతుంది. అందుకే సమితి సిబ్బందిలో అనేక భాషల్లో పాండిత్యంగలవారిని కేవలం తర్జుమాలుచేసే నిమిత్తం

నియమించారు. అడ్డు ప్రశ్నల దగ్గర్నుంచి వీరు ఇతర భాషల్లోకి అనువదించి చెప్పాలి. రష్యన్ భాషలో మాట్లాడినా, చైనా భాషలో మాట్లాడినా, ఆ మాట్లాడిన మాటలను ముందు ఫ్రెంచి భాషలోకి, తరువాత ఆంగ్లంలోకి తర్జుమా చేస్తారు. ఎక్కడ ఏమాత్రం పొల్లురాదు.

ఈ తర్జుమాలు, అనువాదాలు చేసేవారు బ్రహ్మాణ్యులు; అసాధ్యులు. కేవలం ఉపన్యాసాన్ని మక్కీకి మక్కీ అనువదించడమేగాక, సాభినయంగా ఆ ఉపన్యాసాన్ని మరో భాషలో చేస్తున్నట్లే ప్రదర్శిస్తారు. పొరపాటు అనేది వస్తే ఉపన్యాసకుడు అప్పటికప్పుడు ఆక్షేపిస్తాడుగాదా మరి!

ఈ ప్రపంచ సంఘం కార్యక్రమాన్ని యావత్తు ఒక డజను సంఘాలు నిర్వహిస్తవి. ఈ సంఘాలు కొన్నింటిలో దాదాపు సమితిలో సభ్యత్వంగల అన్ని దేశాలకూ సభ్యత్వం వుంటుంది. తీవ్రమైన చర్చలు, ఉద్రేకపూరిత ఉపన్యాసాలు హెచ్చుగా యీ ఉపసంఘాల్లోనే జరుగుతూ వుంటవి.

పని తేలిక కావడానికీ, శీఘ్రంగా పూర్తికావడానికీ ఒక్కొక్క కమిటీ ఒక్కొక్క విషయాన్ని విచారిస్తుంది. ఒక కమిటీ సమితికి సంబంధించిన సమస్త ద్రవ్యవ్యవహారాలను విచారిస్తుంది. ఒక దేశం మరొక దేశంపై చేసే ఫిర్యాదును విచారిస్తుంది మరొక సంఘం. ప్రపంచ ప్రజల్లో అత్యధిక సంఖ్యాకుల స్థితి ఆర్థికంగాను, సాంఘికంగాను, విద్యావిషయికంగాను ఎంతమాత్రం తృప్తికరంగా వుండదు. ఈ పరిస్థితిని ఎలా బాగుచేయడమో ఒక కమిటీ దాని పనిగా

పెట్టుకొని అహర్నిశలు కృషిచేస్తుంది. ఈ విధంగా సమితి నిర్వహించవలసిన ప్రతి ఒక్క ప్రధాన విషయ విచారణకు ఒక ప్రత్యేక కమిటీ వుంటుందన్న మాట.

ఈ మాదిరిగా వివిధ సమస్యలను ఆమూలాగ్రంగా పరిశీలించి పరిష్కార మార్గాలను సూచిస్తూ వివిధ ఉపసంఘాలు సర్వసభ్య సమావేశానికి నివేదికలు సమర్పిస్తవి.

ఈ నివేదికలను సమితి సర్వసభ్యసంఘం స్థూలంగా చర్చించి, మార్పులు అవసరమని తోస్తే, ఆ విధంగా సవరించి ఆమోదిస్తుంది.

ఏదైనా విషయాన్ని సమితి సర్వసభ్య సమావేశం చర్చించవలసి వున్నప్పుడుగాని, ఏ విషయంమీదనైనా నిర్ణయం చేయవలసి వున్నప్పుడుగాని మహాసభాధ్యక్షుడు ఆ విషయాన్ని సభ్యులకు తెలియజేస్తాడు. భద్రతామండలికి సభ్యులను ఎన్నుకోవలసిన ప్రతిపాదన సిద్ధంగా వుంటే, ఆ ప్రతిపాదన అలా సిద్ధంగా వున్నట్లు ప్రకటించి అధ్యక్షుడు అన్ని వైపులా తేరిపార చూస్తాడు.

ఒకప్రక్కన రష్యా ప్రతినిధి చెయ్యి పైకి ఎత్తినట్లు కన్పిస్తుంది. అప్పుడీ అధ్యక్షుడు "ఈ ప్రతిపాదనపై ప్రసంగించవలసిందిగా సోవియట్ ప్రతినిధిని ఆహ్వానిస్తున్నాను," అని ప్రకటిస్తాడు.

"ఈ ప్రతిపాదనను సావధానంగా విచారించుకునేందుకు వీలుగా చర్చను వచ్చే సోమవారం మధ్యాహ్నంవరకూ

వాయిదా వేయడం మంచిది," అని రష్యా ప్రతినిధి ఒక సూచన చేస్తాడు.

"మరే దేశపు ప్రతినిధులుగానీ తమ అభిప్రాయాలను తెలియజేయాలని అనుకోనకపోతే ప్రతిపాదనపై వోటు తీసుకుంటాను," అని అధ్యక్షుడు ప్రకటిస్తాడు.

రష్యా సూచనపై వోటు తీసుకోవలసి వుంది. అసలు ప్రతిపాదన చాలా స్వల్పమైనది. ఆ ప్రతిపాదనపై తక్షణం నిర్ణయం చేయవచ్చునుగదా! దీనిని సోమవారంవరకూ వాయిదా వేయాలా ?

ప్రతిపాదన వోటుకు రాగానే సభాంగణం అంతా గుసగుసలు ప్రారంభమౌతవి. ప్రతి ప్రతినిధివర్గ నాయకుడు తనతోటి ఇతర సభ్యులతో సమాలోచనలు ప్రారంభిస్తాడు. తీర్మానానికి అనుకూలంగానో, ప్రతికూలంగానో వోటు చేయడం నిర్ణయించుకుంటారు. ఇదే విధంగా అన్ని దేశాల ప్రతినిధులు సంప్రతింపులు జరుపుకుంటారు. పది నిమిషాల్లో వోటుతీసుకోనడం ప్రారంభమౌతుంది. ప్రతినిధులు ఎందరున్నా ఒక్కొక్క దేశానికి ఒక్కొక్క వోటు మాత్రమే వుంటుంది.

భద్రతామండలికి సభ్యుల ఎన్నిక వాయిదా వేయాలనే రష్యా సూచనకు అనుకూలంగా తొమ్మిది దేశాల ప్రతినిధులు తమ స్థానాల్లోనే లేచి నిలబడతారు. వీరి లెక్క తీస్తారు. తరువాత సూచనకు ప్రతికూలంగా వున్న దేశాల ప్రతినిధివర్గ నాయకులు అలానే నిలబడతారు. అధ్యక్షుడు వారి లెక్కకూడా తీస్తాడు. ఈ విధంగా రష్యా సూచనకు

అనుకూలంగా తొమ్మిది మంది, ప్రతికూలంగా 34 గురు వోటుచేస్తారు. తీర్మానం వీగిపోతుంది. అయితే, దాదాపు పదిహేను దేశాలు తటస్థంగా వుండిపోయినవి. బహిరంగంగా వోటు చేయడంలో చాలా దేశాలు అగ్రరాజ్యాల అభిమతాలకు విరుద్ధంగా వోటుచేయ సాహసించలేవు. అందువల్ల పెద్ద విషయాలమీద వోటు తీసుకోవడం రహస్యంగా జరుగుతుంది.

రష్యా సూచన వీగిపోవడంవల్ల భద్రతామండలికి సభ్యుల ఎన్నిక అప్పటికప్పుడే ప్రారంభమౌతుంది. ఈ సారి వోటింగు రహస్యంగా జరుగుతుంది. సభాధ్యక్షుడు వోటు తీసుకునే వారిని పిలుస్తాడు. వీరిని 'టెల్లర్స్' అంటారు. వీరు వోటు పత్రాలను (బాలెట్ పేపర్స్) తీసుకొని ప్రతిదేశం ప్రతినిధి వర్గ నాయకునికి ఒక్కొక్కటి ఇస్తారు. "ప్రతినిధులు తమ వోటును వోటుపెట్టలో వుంచవచ్చును," అని అధ్యక్షుడు ప్రకటిస్తాడు.

వెంటనే మళ్ళీ గుసగుసలు ప్రారంభమౌతవి. ఈ వోటు కాగితంమీద భద్రతామండలికి ఎన్నికకావడానికి ప్రతిపాదింపబడిన దేశాలన్నింటిపేర్లూ వుంటవి. ఇందులో ఏ దేశానికి వోటు చేయాలి అన్నది చాలా ముఖ్యమైన విషయం. అందువల్ల ప్రతినిధివర్గనాయకులు తమ తమ ప్రతినిధులతో, సలహాదారులతో సంప్రతిస్తారు. ఎవరికి ఏవరుసలో వోటు చేయాలో తేల్చుకుంటారు.

సమితి ఉద్యోగి ఒకడు అక్షరక్రమంలో ప్రతి దేశాన్నీ పేరు పేరున పిలుస్తాడు. ఏదేశం పేరు వచ్చినప్పుడు ఆదేశం ప్రతినిధివర్గనాయకుడు వోటు కాగితం తీసుకొని వెళ్ళి వోటు పెట్టెలో వేసి వస్తాడు. ఈ పద్ధతివల్ల ఏదేశం ఎలా వోటు చేసిందీ తెలియదు. అందువల్ల అల్పరాజ్యాలు అగ్ర రాజ్యాలకు భయపడి తమ అభిమతానికి విరుద్ధంగా వోటు చేయక్కర్లేదు.

సాధారణ, సామాన్య విషయాలమీద నిర్ణయాలు ఏమాత్రం మెజారిటీవున్నా చేయవచ్చును. కాని, నిరాయుధీ కరణ, అణ్వస్త్రాల నిషేధం మొదలయిన ముఖ్య విషయాలపై జరిగే నిర్ణయాలకు మొత్తం సభ్యులలో మూడింట రెండు వంతులమంది అనుకూలంగా వుండాలి. అయినా సమితి సభ్యులలో 18 మంది ప్రతికూలంగావున్నాకూడా ప్రధానమైన నిర్ణయాలు చేయడానికి వీలుంది.

ఏదేశం ఎంత పెద్దదయినా, ఆ దేశానికి ఇతర చిన్న దేశాలతో సమానంగా ఒకే వోటు వుంటుంది. పాతిక ముప్ఫయి చిన్న రాజ్యాల్ని చేర్చితే అమెరికా విస్తీర్ణానికి సరిపోతుంది. అయినా, అమెరికాకు ఒకే ఒక వోటు వుంటుంది. బ్రిటిష్ కామన్వెల్తుకు ఆరు వోట్లున్నవి. అయితే, ఆరు దేశాలు కలిసికదా బ్రిటిష్ కామన్వెల్తు ఏర్పడింది. కాని, ఈ ఆరు రాజ్యాలు ఎప్పుడూ ఏవిషయంమీదా ఒకేవిధంగా వోటు చేస్తారనే నియమంగాని, నిబంధనగాని లేదు. అనేక సందర్భాల్లో ఈ ఆరు రాజ్యాలు—బ్రిటన్, ఆస్ట్రేలియా,

కెనడా, దక్షిణ ఆఫ్రికా, న్యూజిలాండు, భారతదేశాలు— ఒకదానికి ప్రతికూలంగా మరొకటి వోటు చేసి వుండడం ఎందరో గమనించి వుంటారు.

సోవియట్ యూనియన్ (రష్యా)కు మాత్రం మూడు వోట్లున్నవి. సోవియట్ యూనియన్, బైలోరష్యా, యుక్రేన్‌లు మూటికీ సమితిలో సభ్యత్వం వుంది.

ఈ దేశాల తరఫున సమితి సమావేశాలకు హాజరయ్యే ప్రతినిధులకు వేతనాలను ఆ యా దేశాల ప్రభుత్వాలే చెల్లించాలి. ప్రతినిధివర్గాన్ని నిర్ణయించుకునే అధికారం కూడా ఆ దేశ ప్రభుత్వానిదే. ఇవి కేవలం ఆ దేశం ఆంతరంగిక వ్యవహారాలకు సంబంధించిన విషయాలు. ఏ దేశం ఎవర్ని ప్రతినిధులుగా పంపుతుంది? వారికి ఎంత జీతం ఇస్తుంది అన్న విషయాలతో సమితికి సంబంధం లేదు. అలాగే ఏ దేశంలో ఏ రాజకీయపక్షం అధికారంలో వుండాలి? ఎవర్ని ప్రధాన మంత్రిగా నియమించుకోవాలి? అనే విషయాల్లో సమితి జోక్యం కలిగించుకొనడానికి వీలు లేదు. అధికారంలోవున్న వారు తమ దేశాన్ని ఏ విధంగా పాలిస్తున్నారన్నదికూడా సమితికి సంబంధించని విషయమే.

కాని, ఒక దేశం మరో దేశంపై ఏవైనా చర్యలు జరిపితే, ఆ దేశ ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాలు మరొక దేశ భద్రతకు, ఉనికికి ముప్పు తెచ్చేవిగా వుంటేమాత్రం సమితికి జోక్యం కలిగించుకునే అధికారం వుంది. అయితే ఆ అధికారానికి పరిమితులుకూడా ఎన్నో వున్నవి.

మన చట్టసభలు మనలను శాసించినట్లుగా ఈ ప్రపంచ పార్లమెంటు ప్రపంచ రాజ్యాలను శాసించ లేదు. ఒక విషయంలో ఒక దేశం ఈవిధంగా నడుచుకుంటే బాగుంటుంది అని మాత్రం సూచించగలదు. రెండు దేశాలమధ్య ఏర్పడ్డ తగాదా పరిష్కారానికి ఆరెండు దేశాలు ఫలానా విధంగా ప్రవర్తించాలని సమితి సిఫార్సు చేయగలదు. అంతే.

అయితే, ఏది జాతీయవ్యవహారం, ఏది అంతర్జాతీయ సమస్య అన్న సంగతిని సమితి విచారించవచ్చును.

ఒక దేశం మరోదేశానికి మత్తుపదార్థాలను ఎగుమతి చేస్తున్నది. లేదా తను తయారుచేస్తున్న మత్తు పదార్థాలను మరొకదేశంలో విక్రయించడానికి ఒకదేశం ప్రయత్నిస్తున్నది. సమితి ఈ వ్యవహారాన్ని విచారింప వచ్చును. ప్రజలు ఇతర దేశాలనుంచి, మరికొన్ని దేశాలకు నల్లమందు, గంజాయి మొదలైన మత్తు పదార్థాలను చేరవేస్తున్నారన్న ఫిర్యాదు అందగానే సమితిసంఘం ఇందులోని సత్యాసత్యాలను విచారించి, తగిన ఆధారం వుందని ధృవపడితే ఇట్టి మత్తు పదార్థాల రవాణా విక్రియాలను నిషేధించాలని సిఫార్సు చేయవచ్చు.

సమితి కార్యాలయం ఈ సిఫార్సులను అచ్చువేయించి అన్నిదేశాల ప్రభుత్వాలకు పంపుతుంది. కొన్ని దేశాలు ఈ సిఫార్సులను అంగీకరించి ఆ ప్రకారంగా చర్యలు తీసుకుంటవి. కొన్నిదేశాలు ఈ సిఫార్సులను ఎంతమాత్రం లక్ష్యంచేయక పోవచ్చును.

ఆ పరిస్థితులలో సమితిచేయ కలిగింది వొక్కటే. ఏ యే దేశాలు ఈ సిఫార్సులను అలక్ష్యం చేసినవో ఆ యా దేశాల వైఖరి, విధానాలను సమితిసంఘం చర్చించుతుంది. కొన్ని దేశాల ప్రతినిధులు ఈ దేశాల వైఖరిని తీవ్రంగా విమర్శించవచ్చు. మరికొన్ని దేశాల ప్రతినిధులు నచ్చచెప్పడానికి ప్రయత్నించవచ్చు. ఆ దేశాల విధానాలను సమర్థించేవారు ఎవ్వరూ ఉండకపోవచ్చును. ఇంత జరిగిన తరువాత తమ విధానాలను మార్చుకొనని నిరాకరించే ప్రభుత్వాలు అంటూ ఉండవు.

సమితి ఈ విధంగానే అనేక సమస్యలను పరిష్కరిస్తున్నది. ఎన్నో దేశాలు సమితి సిఫార్సులను పూర్తిగా అంగీకరించి, అమలు చేస్తున్నవి.

మూడు మహత్తర కార్యాలను సాధించడానికి సమితి సర్వసభ్య సంఘం నిరంతరం కృషిచేస్తున్నది. ప్రజాసామాన్యానికి వారి జీవితాలు సుఖంగానూ, ఆనంద దాయకంగానూ వుండేటట్లు చేయడం ఇందులో మొదటిది ; చాలా ముఖ్యమైనదికూడా. రెండవది : ప్రపంచంలో శాంతిని సంరక్షించడము. ఈ మహాసంస్థ నిర్వహణ మూడవకార్యం.

ప్రజలు సుఖజీవనాన్ని గడపగల పరిస్థితులను కల్పించడంలో సమితికి ఆర్థిక, సాంఘికసంఘం తోడ్పాటు ఎక్కువగా లభిస్తుంది.

ప్రజలకు—తరతమ భేదం లేకుండా, జాతి విచక్షణ లేకుండా—అందరికీ మంచి పుష్టికరమైన ఆహారాన్ని, కట్టు

కు నేందుకు కావలసిన బట్టను, ఉండడానికి ఇళ్ళను లభింపచేయడానికి ఈ ఆర్థిక, సాంఘికసంఘం కృషిచేస్తుంది. ఇందుకు ఇతరత్రా జరిగే ప్రయత్నాలు ఫలప్రదం కావడానికి దోహదం చేస్తుంది.

సర్వప్రజలు జీవనోపాధిని కల్పించుకొనుటకు వ్యష్టిగ, సమష్టిగ జరుపుకొనే ప్రయత్నాలలో ఈ ఆర్థిక, సాంఘిక సంఘ సహాయం లభిస్తుంది.

ఒక దేశానికి, ఇతర దేశాలనుండి ప్రధానావసర వస్తువులు సులభంగా లభించేటట్లు చేయడానికి ప్రయత్నిస్తుంది.

వివిధ దేశాలలోని ప్రజలు ఒకర్నిగురించి ఒకరు తెలుసుకొనడానికి అవకాశాలను కల్పిస్తుంది. ప్రజలను ఆరోగ్యవంతులుగచేసి, వ్యాధి నిరోధక నిర్మూలన కార్యక్రమాల్లో వివిధ దేశాలకు తోడ్పడుతుంది.

ప్రజలకు స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు లభించేటట్లు చూస్తుంది.

ఇక ప్రపంచ శాంతి సంరక్షణ అంటే వివిధ రాజ్యాల మధ్య సంఘర్షణలను నివారించడం, ఆ సంఘర్షణ హేతువులను తొలగించడం భద్రతా మండలి బాధ్యత.

ఏదో ఒక విషయంమీాద రెండు దేశాలు పేచీపడవచ్చు. ఆ వ్యవహారం ముదిరి ఆ రెండుదేశాలూ ఘర్షణపడి, సంఘర్షణకు దిగవచ్చు. ఈ పేచీని పరిష్కరించేందుకు, సంఘర్షణను నివారించేందుకు భద్రతామండలి వెంటనే పూనుకుంటుంది.

ఏకారణంవల్ల గాని భద్రతామండలి జోక్యం చేసుకోనక పోతే సమితి సర్వసభ్య సంఘమే విషయవిచారణకు పూను కుంటుంది. అసలు సమస్యను సమగ్రంగా పరిశీలించి, పరిష్కార మార్గాలను సూచిస్తుంది. భద్రతామండలే విచారణ ప్రారంభిస్తే సర్వసభ్యసంఘం ఆ జోలికే వెళ్ళకూడదు.

ఒకే సమస్యను ఇటు భద్రతా మండలి, అటు సర్వసభ్య సంఘమూ విచారించి తీర్మానాలు చేయడం అంటూవస్తే ఈ రెండు తీర్మానాలూ ఒకే విధంగా ఉంటవనే నమ్మకం లేదు. ఫాక్‌లెండ్ దీవులను గురించి బ్రిటన్—అర్జెంటినాలకు పేచీ వచ్చింది. ఆ దీవులు ఎవరికి చెందినవో నిర్ధారణ కావాలి.

భద్రతా మండలి, సమితి సర్వసభ్య సంఘమూ ఏక కాలంలో ఈ సమస్యను విచారించడం జరిగిందనుకోండి. ఈ దీవులు అర్జెంటీనాకే చెందాలని సర్వసభ్య సంఘం తీర్మానించవచ్చు. ఈ దీవులు అర్జెంటినాకుగాక బ్రిటన్‌కే చెందాలని భద్రతామండలి నిర్ణయించవచ్చును. అసలు తగాయిదా పరిష్కారం కాకపోగా ఒక కొత్తసమస్య ఉత్పన్న మౌతున్నది. భద్రతామండలికి లొంగని సమస్యలను, మండలి పట్టించుకోనని సమస్యలనే సర్వసభ్య సంఘం విచారించడానికి పూనుకోవాలి.

వివిధ దేశాలమధ్య ఏర్పడే తగాయిదాలను పరిష్కరించడం ఎక్కువగా భద్రతా మండలి బాధ్యత. శాంతి సంరక్షణ సమితి సర్వసభ్య సంఘబాధ్యత. కొన్ని సామ్రాజ్య దేశాలు అనుసరించే వలస విధానంవల్ల శాంతికి భంగం కలగవచ్చు.

కొన్ని రాజ్యాల ఎగుమతి దిగుమతి సుంకాలు ఆర్థిక సంక్షోభానికి దారితీసి, రాజకీయ అశాంతికి దోహద మివ్వవచ్చు. అసలు అవసరం యేర్పడినప్పుడు వెనుకటి ఒప్పందాలను మార్పుచేయకపోతే ఆ ఒప్పందాలను కుదుర్చుకొన్న దేశాల మధ్య సంఘర్షణలు ప్రారంభం కావచ్చు. శాంతికి ముప్పు తెచ్చి పెట్టగల ఈ పరిస్థితులను అన్నింటినీ తొలగించడానికి సమితి సర్వసభ్య సంఘం కృషిచేస్తుంది.

యుద్ధ నిర్వహణ పరికరాలను, మారణాస్త్రాలను తయారు చేయడానికి అనేక దేశాలు తమ జాతీయాదాయంలో హెచ్చుభాగాన్ని వ్యయం చేస్తుంటవి. అలా చేయవద్దని, ఆ ధనాన్ని ప్రజల జీవన పరిస్థితులను వృద్ధిచేయడానికి వెచ్చించమని సమితి సంఘం వివిధ దేశాలకు సలహా ఇస్తుంది.

అంతర్జాతీయ ధర్మ స్మృతిని ప్రజాసామాన్యానికి సులభంగా గ్రహింపుకు వచ్చే విధంగా అంతర్జాతీయ న్యాయశాస్త్రాన్ని తయారు చేయడం ఈ సర్వసభ్య సంఘం నిర్వర్తించవలసిన విధులలో ఒకటి.

ఇక సమితి సంస్థ నిర్వహణ: సమితిలో సభ్యత్వంగల యావత్తు రాజ్యాలకు ప్రాతినిధ్యంగల సంఘం సర్వసభ్య సంఘమే కాబట్టి, సమితి సంస్థ నిర్వహణ బాధ్యతను పూర్తిగా సర్వసభ్య సంఘమే వహించాల్సి వుంటుంది. ఈ కర్తవ్యాన్ని నిర్వర్తించడంలో సమితి సంఘం కేవలం చర్చలతోనే తృప్తి పడక, అంతిమ నిర్ణయాలుకూడా చేస్తుంది.

"ఒక దేశానికి కొత్తగా సభ్యత్వం ఇవ్వాలి. లేక ఒక దేశాన్ని సమితినుంచి బహిష్కరించి ఆ రాజ్యం సమితి సభ్యత్వాన్ని రద్దు చేయాలి," అన్న విషయాలను సమితి సర్వ సభ్య సంఘమే ముందుగా నిర్ణయించాలి.

సమితి ఉపసంఘాలలో ప్రధానమైన మూడు సంఘాలకు సభ్యులను సర్వసభ్య సంఘమే ఎన్నుకోవాలి. అంతర్జాతీయ న్యాయస్థానానికి న్యాయాధికారులనుకూడా ఈ సంఘమే ఎన్నుకోవాలి.

"ధర్మకర్తృత్వ ఒప్పందాలను ఆమోదించి స్థిరపరచాలి. సమితి కార్యాలయం ఏం చేయాలి? ఆ చేసేపని ఏ విధంగా చేయాలి?" అన్న ప్రధాన విషయాలకు సంబంధించిన నియమ నిబంధనలను సర్వసభ్య సంఘమే నిర్ణయిస్తుంది.

సమితికి చెందిన వివిధ ఉపసంఘాలు, శాఖలు ప్రతి సంవత్సరము వాటి కార్యక్రమం, అవి సాధించిన ఫలితాలు మొదలైన అంశములను వివరిస్తూ వార్షిక నివేదికలను సమర్పించాలి. సర్వసభ్య సంఘం ఈ నివేదికలను పరిశీలిస్తుంది. ఇంతవరకూ జరిగిన పనిపై అభిప్రాయాలను వెల్లడిస్తూ ఇకముందు జరగవలసిన పనులను, అనుసరించవలసిన మార్గాలను సూచిస్తుంది. ఈ ఉపసంఘాలు ఆ విధంగా నడుచుకోవలసిందే.

అసలు సమితి ప్రణాళికను సవరించవలసి వస్తే, ఆ సవరణలను సర్వసభ్య సంఘం పరిశీలించి అభిప్రాయాలను వెల్లడి చేయాలి. సమితి ఖజానాపై సర్వాధికారం సర్వసభ్య

సంఘానిదే. ఏ దేశం ఎంత ఋసుం చెల్లించాలో నిర్ణయించి వసూలు చేస్తుంది. ఋసుం చెల్లించని దేశంపై సమితి తీసుకో గల చర్య ఒక్కటే. ఆదేశానికి గల వోటుహక్కును రద్దు చేసివేయగలదు.

సమితి సంఘాలు సంవత్సరానికి ఎంత ఎందునిమిత్తం ఖర్చుచేయాలో సర్వసభ్య సంఘమే నిర్ణయించాలి గనుక, ఏ సంఘం వ్యవహారం సమ్మతంగా లేకపోతే ఆ సంఘానికి సర్వ సభ్య సమావేశం ధనం మంజూరు చేయక పోవచ్చును.

సర్వసభ్య సంఘానికి ఖజానాపై ఇంత అధికారం వున్నందువల్ల సమితి సంస్థ యావత్తుపైనా యీ సంఘానికి సంపూర్ణమైన సర్వాధికారం లభిస్తున్నది.

అధ్యాయం ४

# భద్రతా మండలి

## శాంతి సంరక్షక సంస్థ

ఐక్యరాజ్య సమితి సర్వసభ్యసంఘం వివిధ సమస్యలను చర్చించి ఏ యే సమస్యలు ఏ విధంగా పరిష్కారమైతే బాగుంటుందో, ఏ యే పనులను ఏ విధంగాచేయాలో అందుకు సంబంధించిన సంఘాలకు సిఫారుసు చేస్తుంది. వివిధ రాజ్యాల ప్రతినిధులు ఎక్కడివారు అక్కడికి వెళ్ళిపోతారు. ఏదైనా అసాధారణ పరిస్థితి ఏర్పడి, అవసరంగా సమావేశం కావాల్సి వుంటేనేగాని తిరిగి సర్వసభ్యసంఘం సమావేశం జరుగదు.

భద్రతామండలి అలాగాదు. దాదాపు 365 రోజులూ సమావేశం అవుతూనే వుంటుంది. ప్రపంచంలో ఏమూలైనా అంతర్జాతీయసంఘర్షణలకు దారితీయగల అల్లరు ప్రారంభమైతే భద్రతామండలి తక్షణం సమావేశం కావాల్సి వుంటుంది.

ఒకదేశం మరోదేశంపై దురాక్రమణ జరపడానికి సంసిద్ధమైతే భద్రతామండలి ప్రధాన పోలీసు అధికారి రూపంలో అవతరిస్తుంది. దురాక్రమణ దారులను శిక్షించేందుకు సమితి బలాన్ని యావత్తూ భద్రతామండలి సమీకరించగలదు. అలాగని ప్రతి సమస్యా పరిష్కారానికి దండప్రయోగంతప్ప మరోమార్గం లేదని భద్రతామండలి భావించదు. సాధ్యమైనంతవరకు చతుర్విధోపాయాలలో మొదటి సామోపాయం ద్వారానే ఎంత జటిలమైన వ్యవహారాన్ని అయినా, ఎంత క్లిష్టమైన సమస్యనైనా పరిష్కారం చేయడానికి ప్రయత్నిస్తుంది. భద్రతామండలి ఆ విధంగానే వ్యవహారం చేయాలనీ, ప్రతి సమస్యా శాంతియుతంగానే పరిష్కారం కావాలనీ మనం అంతా ఆశిస్తాం.

"మా పొరుగుదేశం మాపై దురాక్రమణ జరపడానికి సన్నద్ధమవుతున్నది. మా దేశ ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం కల్గించుకుంటున్నది," అని ఏదేశ ప్రతినిధి అయినా భద్రతామండలికి ఫిర్యాదుచేస్తే, అక్కడ సమావేశమైన 11 మంది సభ్యులూ, ఆ ప్రతినిధి ఏమి సహాయం కావాలని అడుగుతాడో అని భయాందోళనలతో మహా ఆత్రంగా చూస్తుంటారు.

"భద్రతామండలి ఈ వ్యవహారాన్నంతా సమగ్రంగా విచారించి ఈ పరిస్థితులను తొలగించడానికి అవసరమైన చర్యలను సిఫార్సు చేయవలసిందని మండలిని కోరుతున్నాను," అని మాత్రమే ఆ ప్రతినిధి విజ్ఞప్తిచేస్తాడు. ఇది వినగానే మండలి అధ్యక్షుడు తన ప్రక్కనున్న సమితి సెక్రెటరీ జనరల్‌తో సంప్రతిస్తాడు.

ఫిర్యాదు నివేదన పూర్తికాగానే తర్జుమా దారులలో ఒకడులేచి ఫిర్యాదు అంశములను, ఆ ప్రతినిధి ఉపన్యాసాన్ని ఫ్రెంచి భాషలోకి తర్జుమాచేస్తాడు. ఈ విషయాన్నంతా సంక్షిప్త లేఖకులు వ్రాసుకొని వెంటనే టైపుచేసి రికార్డు సిద్ధంచేస్తారు. సమితి ఇంగ్లీషు, ఫ్రెంచి, స్పానిష్, రష్యన్ భాషలను అధికార భాషలుగ పరిగణించింది. సమితి, సమితి సంఘాల యావత్తు కార్యక్రమం ఈ నాలుగు భాషల్లోనూ రికార్డు అయి వుంటుంది.

ఏదైనా ఒక ఫిర్యాదు విచారణకువస్తే ఫిర్యాదునూ, ఆ ఫిర్యాదును వివరిస్తూ వాదిచేసే ప్రసంగాన్నీ 11 మంది సభ్యులు, వారి వెనకనే కూర్చుని విషయాలన్నింటినీ వింటున్న వారి సలహాదారులు వినగానే అధ్యక్షుడు "ఈ ఫిర్యాదుపై ఎవరైనా అభిప్రాయాలు తెలుపుతారా" అని అడుగుతాడు. ఎవరో ఒకరు చేతిలోవున్న పెన్సిల్‌ను వూపుతూ తాను ప్రసంగించనున్నట్లు అధ్యక్షునికి సూచిస్తాడు. వెంటనే అందరూ ఆ సభ్యుడు ఏం చెప్తాడా అని చెవులు నిక్కబెట్టుకొని అత్యంత శ్రద్ధగా కూర్చుంటారు. ఈ సభ్యుడుచేసే ఉపన్యాసం

శబ్ద విస్తరణ యంత్రాలద్వారా ఆ సమావేశం జరుగుతున్న హాలు అంతటా వినిపిస్తుంది. ఈ హాలులో దాదాపు పదిహేనువందలమంది కూర్చోడానికి జాగా వుంటుంది. పత్రికా విలేఖరులు హాజరు కావచ్చును. ప్రేక్షకులకు ప్రత్యేక స్థానాలున్నవి. సమితి సభ్యత్వంగలిగి, భద్రతామండలి సభ్యత్వంలేని దేశాల ప్రతినిధులు పరిశీలకులుగ హాజరు కావచ్చును.

సమితి సిబ్బంది యాభై, అరవై మందికిపైగా వుంటారు. ఈ మండలి సభ్యులు 11 మందీ కలిసిచేసే నిర్ణయాలు ప్రపంచ గతినే మార్చివేసేవిగా వుంటవి. ప్రపంచంలో చాలా శక్తివంతమైన, బలిష్ఠమైన సైన్యంపై ఈ సంఘానికి సర్వాధికారం వుంది. దురాక్రమణ జరిపే దేశాన్ని ఈ భద్రతామండలి ఈ సైన్యం సహాయంతో నామరూపాలు లేకుండా చేయగలదు.

ఒక దేశం మరొక దేశంపై దురాక్రమణ జరిపిందనిగాని, జరుపనున్నదనిగాని భద్రతామండలికి ఫిర్యాదు అందినప్పుడు ఆ ఫిర్యాదుపై మండలి ఏ విధమైన తీర్పు ఇస్తుందా అని కోట్లాది ప్రజలు ఆశ, నిరాశలతో, భయాందోళనలతో, ధైర్యోత్సాహాలతో నిరీక్షిస్తుంటారు. మండలి నిర్ణయం విని నిట్టూర్చేవారు కొందరు, నిస్పృహతో క్రుంగిపోయేవారు కొందరు, ఆనందభరితులై, ఉత్సాహంతో భవిష్యత్తును ఎదురుచూచేవారు మరికొందరు వుంటారు.

ప్రపంచ భవిష్యత్తును నిర్ధారించే ఈ భద్రతామండలిలో 11 దేశాలకు మాత్రమే సభ్యత్వం వుంటుంది. అయిదు అగ్రరాజ్యాలకు—అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సు, రష్యా,

చైనాలు—మాత్రం శాశ్వత సభ్యత్వం వుంది. మిగతా ఆరు దేశాలను సమితి సర్వసభ్య సంఘం ఎన్నుకుంటుంది. ఈ ఆరుదేశాల్లో మూడు దేశాలు సంవత్సరానికి ఒక పర్యాయం ఎన్నిక అవుతవి. మిగతా మూడు రాజ్యాలు రెండేళ్ళ కోమారు ఎన్నిక అవుతుంటవి. సమితిలో సభ్యత్వంగల రాజ్యాలు ఏవైనా ఈ స్థానాలకు పోటీ చేయవచ్చు. అయితే, ఏదేశంకూడా వెంటవెంటనే ఎన్నిక అయ్యేందుకు వీలులేదు. అన్ని దేశాలకూ అవకాశం లభించేందుకు ఈ షరతు విధించారు.

అగ్రరాజ్యాలకు వున్న వీటో అధికారం వదలివేస్తే, మండలిలో అగ్రరాజ్యాలకంటె అల్పరాజ్యాలకే బలం ఎక్కువ. అగ్రరాజ్యాలు అయిదింటికిమాత్రం శాశ్వత సభ్యత్వం వున్నా, ఎన్నిక అయ్యే ఆరురాజ్యాలు చిన్న రాజ్యాలనే చెప్పవచ్చును. ఈ విధంగా మండలిలో అల్ప రాజ్యాలకే ఎక్కువ సంఖ్యాబలాన్నివ్వడంలో అగ్ర రాజ్యాలు ఎంతో ఉదారంగా ప్రవర్తించినవని అంగీకరించక తప్పదు. ప్రపంచంలోని చిన్నరాజ్యాలన్నింటి మొత్తం జనాభా ఎంతో ఈ అయిదు అగ్రరాజ్యాల మొత్తం జనాభా అంతకంటే ఎక్కువే.

భద్రతామండలి సభ్యత్వంగల 11 దేశాలూ మండలి సమావేశాల్లో పాల్గొనేందుకు ఒకొక్కక్క ప్రతినిధిని నియమిస్తవి. ఈ 11 మందికి మరొక 11 మంది సలహాదార్లు

వుంటారు. ఏ దేశపు ప్రతినిధికి, ఆ ప్రతినిధి సలహాదారులకు ఆ దేశపు ప్రభుత్వమే జీతాలు ఇచ్చుకుంటుంది.

ఈ 11 మందీ సమావేశమై ప్రపంచశాంతి భద్రతలను సంరక్షించవలసిన గురుతర బాధ్యతను నిర్వహించడంలో నిమగ్నమైవుంటే వీరిచర్యలు, వీరి సమావేశాలు చూచే వారికి మహా విసుగు కల్గిస్తుంది. ఒక ప్రతినిధి ఒక భాషలో ఉపన్యాసం చేస్తే, ఆ ఉపన్యాసాన్ని ఇతరభాషల్లోకి తర్జుమా చేస్తారు. ఈవిధంగా విన్న ఉపన్యాసాన్నే మళ్ళీ మళ్ళీ వింటూవుండాలి. మండలి సభ్యులు మాత్రం శ్రద్ధగా అన్నీ వింటూ కూర్చోక తప్పదు. ఏమాత్రం అశ్రద్ధగావున్నా ఆ విషయాన్ని పత్రికావిలేఖరులు క్షణక్షణం పంపే వార్తా నివేదికలవల్ల యావత్ప్రపంచానికీ తెల్సిపోతుంది.

మండలి సమావేశం జరుగుతూవుంటే సమావేశం వివరాలను ఎప్పటికప్పుడు దేశదేశాల్లోని పత్రికలకు పంపడానికి సభలు జరుగుతున్న చోటే తంతి తపాలా సౌకర్యా లుంటవి. వెంటనే ఫోటోలు తీసి పంపేందుకుకూడా ఏర్పాట్లువుంటవి. ఫోటోలు, ఫిలుములు తీసేందుకు అనుకూలంగా సభాంగణం అంతా విద్యుద్దీపాలతో ప్రకాశవంతం చేయబడుతుంది.

ఈ విధంగా భద్రతామండలి కార్యక్రమం యావత్తు అప్పటికప్పుడు యావత్ప్రపంచానికి తెలిసిపోయేవిధంగా ఏర్పాట్లు చేయబడినందువల్ల మండలి ప్రతినిధులు వాళ్లు దగ్గర పెట్టుకొని మరీ వ్యవహరించవలసి వుంటున్నది.

ప్రతినిధులు తమ స్థానాల్లోనే కూర్చుని ఏ విషయం మీాదైనా సరే తమ మామూలు ధోరణిలోనే ప్రసంగిస్తారు. కాని, ఆ ప్రసంగాలను వింటున్నవారిలో కొందరు ఉద్రిక్తులు కావచ్చును; మరికొందరు విపరీతంగా ఆందోళన చెందవచ్చును. భద్రతా మండలి ప్రతినిధులు అరమర లేకుండా, మొగమోటం లేకుండా మాట్లాడ్డం వింటున్నవారికి "ఇదివర్లో ఎవరన్నా, ఎప్పుడైనా ఇంత ఖచ్చితంగా, కుండబద్దలు కొట్టినట్లు మాట్లాడి వుంటారా" అనే అనుమానం కల్గుతుంది.

ఏ సమస్య అయినా మండలిలో జరిగే చర్చలవల్ల, అక్కడ ప్రతినిధులు చేసే వుపన్యాసాలవల్ల పరిష్కారంగాదు. ఈ చర్చలు, వుపన్యాసాలు అయిన తరువాత ప్రతినిధులు ఇష్టాగోష్ఠి సంప్రతింపులు జరుగుపుకుంటారు. ఏ సమస్యను ఏ విధంగా పరిష్కరిస్తే బాగుంటుందో సంప్రదించు కుంటారు. చాలా నిర్ణయాలు ఈ ఇష్టాగోష్ఠి చర్చల పర్యవసానంగానే జరుగుతూ వుంటవి.

ఈ విధంగా సంప్రతింపులు జరుపుకునేముందు సభ్యులు తమ ఆఫీసుల్లో కూర్చొని ఈ సమస్యల పూర్వాపరాలను చర్చించుకుంటారు. అందుకు సంబంధించిన యావత్తు వివరాలను పరిశీలిస్తారు. ప్రపంచంలోని వివిధ ప్రాంతాలనుంచీ వచ్చే సూచనలను గమనిస్తారు. ఈ విధంగా విషయాన్ని ప్రతి ఒక్కరూ అవగాహన చేసుకున్న తరువాత పరస్పరం సంప్రతింపులు జరుపుకుంటారు.

భద్రతామండలి ఒకసారి ఫ్రాంకోస్పెయిన్ విషయం విచారణజరిపి నిర్ణయం చేయవలసి వచ్చింది. ఆస్ట్రేలియా ప్రతినిధి ఫ్రాంకోస్పెయిన్‌ను గురించి విచారణ జరిపించాలని భద్రతామండలి సమావేశంలో ప్రతిపాదించాడు. ఇతర దేశాల ప్రతినిధులు ఎవ్వరూ ఈ ప్రతిపాదనపై తమ అభిప్రాయాలను ప్రకటించక ముందే సమావేశం ముగిసింది. మండలి సభ్యులు వెంటనే ముగ్గురు నలుగురుగా సమావేశమై ఆస్ట్రేలియా ప్రతిపాదనను చర్చించుకోవడం ప్రారంభించారు. ఈ ఇష్టాగోష్ఠి సంప్రతింపులలో తేలిన విషయం ఒక్కటే— ఫ్రాంకోస్పెయిన్‌ను గురించి విచారణ జరిపించాలనే అందరూ అభిప్రాయ పడ్డారు. అయితే, ఆస్ట్రేలియా ప్రతినిధి ఆ తీర్మానాన్ని ప్రతిపాదించగానే వోటు తీసుకోవలసివస్తే తీర్మానం నెగ్గేదేగాదు. ఆస్ట్రేలియా తయారుచేసిన తీర్మానం చాలామందికి నచ్చలేదు. ఆ "కూర్పు"లో మార్పు అవసరం అని అనుకున్నారు.

అయిదురోజులు మండలి సభ్యులు ఇష్టాగోష్ఠి సంప్రతింపులు జరిపారు. భద్రతామండలి సమావేశాలతో నిమిత్తం లేకుండానే ఒక కొత్తతీర్మానం తయారైంది. ముగ్గురు ప్రతినిధులు ఖులాసాగా కాఫీతాగుతూ ఈ తీర్మానంపై మాట్లాడుకుంటూ ఒక ముసాయిదాను తయారుచేశారు. వెంటనే భద్రతామండలి సమావేశమైంది. ఈ తీర్మానంపై చర్చజరిగింది. సులభంగా ఆమోదింపబడింది. సర్వసాధారణంగా భద్రతామండలి వారంవారం సమావేశ

మవుతూవుంటుంది. ఎప్పుడైనా ఒక సమావేశానికీ, మరో సమావేశానికీ పది, పదిహేను రోజులకంటే ఎక్కువ వ్యవధి వుండదు. 11 మంది సభ్యులలో ఏ ఒక్కరుకోరినా మండలి సమావేశంకావాల్సిందే.

భద్రతామండలి సమావేశాలు ఏదైనా ప్రత్యేక అవసరం ఏర్పడితే తప్ప, బహిరంగంగానే జరుగుతూవుంటవి. ఎప్పుడైనా రహస్య సమావేశాలు జరిగితే, ఆ సమావేశాల్లో ఏం జరిగిందీ సభ్యత్వంగల 11 దేశాల ప్రభుత్వాలకైనా తెలియదు. కాని, నిర్ణయాలంటూ జరిగిన తరువాత అంతా అందరికీ తెలియ వల్సిందే. సమితి వ్యవహారాలకు సంబంధించి నంతవరకు రహస్యం అంటూ ఏమీ వుండదు.

భద్రతామండలి సామాన్యంగా న్యూయార్కులోనే సమావేశ మవుతూవుంటుంది. కాని, ప్రపంచంలో ఎక్కడ సమావేశం జరపాలని అనుకొన్నా జరపవచ్చు. (కాశ్మీర్‌లో సైనిక చర్యలు జరిగినవిగదా; భద్రతాసంఘం అక్కడ సమావేశం కావాలనుకుంటే అక్కడే సమావేశం కావచ్చు.) ఈ సమావేశాలకు ఎవరు అధ్యక్షత వహించాలనే విషయం మొదట్లోనే నిర్ధారణ అయింది. నెలకు ఒకదేశం ప్రతినిధి అధ్యక్షత వహిస్తాడు. ముందు ఎవరు, ఆ తరువాత ఎవరు అనే వరుసక్రమంకూడా సభ్యత్వంగల దేశాల అక్షరక్రమంబట్టి నిర్ణయమైపోయింది. మొట్టమొదటి సమావేశానికి ఆస్ట్రేలియా (ఎ)ప్రతినిధి అధ్యక్షత వహించాడు. ఆ తరువాతమాసం బ్రెజిల్ (బి) ప్రతినిధి అధ్యక్షత వహించాడు.

భద్రతామండలిలో సభ్యత్వంవున్న దేశాల ప్రతినిధులకు రాయబారి హోదా వుంటుంది. ఏ దేశపు ప్రతినిధి జీతం ఆ దేశపు ప్రభుత్వం ఇచ్చుకుంటుంది. తమ తరఫున ఎవరు ప్రతినిధిగా వుండాలో కూడా ఆ యా ప్రభుత్వాలే నిర్ణయిస్తవి. అమెరికా ప్రతినిధిని అధ్యక్షుడు సెనేట్ ఆమోదంతో నియమిస్తాడు. భద్రతామండలి విచారణకు, నిర్ణయానికి వచ్చే ప్రతి సమస్యమీదా ఆ యా దేశాల ప్రతినిధులు వారి ప్రభుత్వాభిప్రాయాలను తెల్సుకొని, ఆ ప్రకారంగా వోటు చేస్తారు.

భద్రతామండలిలో అమెరికా ప్రతినిధిగా అధ్యక్షుడు మొదలు సెనేట్ ఆమోదంతో ఆయన నియమించే ఉద్యోగి వరకూ ఎవరైనా వ్యవహరించ వచ్చును.

వివిధ విషయాలపై భద్రతామండలి నిర్ణయాలు ఎలా జరుగుతవో చూద్దాం. ఇరాన్‌నుంచి తన సేనలను మే 16 వ తేదీలోపుగా ఉపసంహరించగలనని రష్యా భద్రతామండలికి ఒక లేఖ వ్రాస్తుంది. కొంతమంది ప్రతినిధులు తమ అభిప్రాయాలను వెల్లడిస్తారు. అధ్యక్షుడు సభ్యులందర్నీ ఒకసారి పరికించి చూస్తాడు. "మీరెవ్వరూ మాట్లాడదల్చకపోతే, ఈ విషయంపై వోటు తీసుకుంటాను," అని ప్రకటిస్తాడు. అనుకూలంగావున్న వారందరూ చేతులెత్తుతారు. అధ్యక్షుని గుమాస్తా ఎత్తిన చేతులను లెక్కపెట్టి తొమ్మిదిమంది అనుకూలంగావున్నట్లు అధ్యక్షునికి నివేదిస్తాడు. భద్రతామండలి ఈ ప్రతిపాదనను ఆమోదించినట్లు అధ్యక్షుడు ప్రకటిస్తాడు.

ఒక దేశం దురాక్రమణకు సన్నద్ధమైనదనో, దురాక్రమణ ప్రారంభించినదనో ఫిర్యాదు వస్తుంది. ఆ దేశానికి చమురు, బొగ్గు, ఆయుధాలు అమ్మరాదని ఒక ప్రతినిధి ప్రతిపాదిస్తాడు. చర్చ సమాప్తమైన తరువాత అధ్యక్షుడు యీ తీర్మానంపై వోటు తీసుకుంటాడు. తొమ్మిదిమంది అనుకూలంగా వున్నట్లు తేలుతుంది. అయితే, రెండు అగ్రరాజ్యాలు రష్యా, చైనాలు వోటు చేయలేదు. అప్పుడు తీర్మానం వీగిపోయినట్లు అధ్యక్షుడు ప్రకటిస్తాడు.

ఏ తీర్మానమైనా భద్రతామండలి ఆమోదాన్ని పొందాలంటే 11 మందిలో 7 గురు అనుకూలంగా వోటుచేస్తే చాలును. కాని, ఒక దేశంపై చర్యలు తీసుకోవాల్సిన అవసరం కలిగితే ఆ తీర్మానాన్ని అగ్రరాజ్యాలు అయిదూ ఆమోదించాలి. మిగతా ఆరు దేశాల్లోనూ ఏ రెండు దేశాలైనా అంగీకరించాలి. ఒక దేశంపై భద్రతామండలి చర్య తీసుకోవడం అగ్రరాజ్యాల్లో ఏ రాజ్యానికి ఇష్టం లేకపోయినా అందుకు సంబంధించిన తీర్మానంపై వోటు చేయకుండా వుంటేనే చాలు.

పాకిస్థాన్—భారత దేశాలకు కాశ్మీరు సమస్యపై పేచీ వచ్చింది. ఈ సమస్యను శాంతియుతంగా పరిష్కరించుకొనేందుకు యీ క్రింది రాజ్యాలు కొన్ని చర్యలు తీసుకోవాలని భద్రతామండలి ఆదేశింప దలచింది. రష్యాకు యీ పద్ధతి నచ్చలేదు. ఇందుకు సంబంధించిన తీర్మానాన్ని రష్యా

వ్యతిరేకిస్తుంది. చాలు. భద్రతామండలి భారత-పాకిస్థాన్ ప్రభుత్వాలను ఎంతమాత్రం ఆదేశించలేదు.

ప్రపంచంలో ఏవో రెండురాజ్యాల మధ్య ఏర్పడిన తగాయిదా యుద్ధానికి దారితీయగలదని సభ్యులు 10 మంది అభిప్రాయపడవచ్చును. "అది మామూలు సంఘటనేగాని, సంఘర్షణకు దారితీసే తగాయిదా ఎంతమాత్రం కాదు" అని అగ్రరాజ్యాలు అయిదింటిలో ఒక రాజ్యం ప్రతినిధి వాదింపవచ్చును. ఇక భద్రతామండలి చేయకలిగింది ఏమీలేదు. అగ్రరాజ్యాల్లో ఏరాజ్యం కక్షిదారుల్లో ఒకరైనాకూడా ఆ రాజ్యం భద్రతామండలి చర్యలను వీటో చేయగలదు. అంటే అగ్రరాజ్యాలు మండలి తమపై ఎద్విధమైన సైనిక చర్యలను తీసుకో సంకల్పించినా అట్టి ప్రయత్నాలను వీటో అధికారం ద్వారా వమ్ము చేయవచ్చును.

ఈ వీటో అధికారాన్ని అగ్రరాజ్యాలు దేనికిబడితే దానికే ఉపయోగించవచ్చు. ఒక కొత్త రాజ్యానికి సమితిలో సభ్యత్వం ఇవ్వాలని అంతా అంగీకరించినా, ఒక అగ్రరాజ్యం అడ్డుపడితే ఆ రాజ్యానికి ఎన్నటికీ సమితి సభ్యత్వం లభించదు. అలాగే సమితి సభ్యత్వంగల ఒక రాజ్యాన్ని సమితినుంచి బహిష్కరించాలని అందరూ నిర్ణయిస్తే ఏ అగ్రరాజ్యం అయినా దాన్ని కాకుండా చేయవచ్చును.

సమితి ప్రణాళికను వర్తమానావసరాలకు తగ్గట్టుగా సవరించాలని అనుకుంటే అగ్రరాజ్యాలు అయిదూ అంగీకరిస్తే గాని సాధ్యంగాదు. రాచరికంగల ఏదేశమూ సమితిలో

వుండేందుకు వీల్లేదని ఏ దేశమైనా ప్రణాళికకు ఒక సవరణను ప్రతిపాదించవచ్చు. రాచరికంక్రింద పరిపాలింపబడుతున్న బ్రిటన్ ఈ సవరణను సహింపలేదు. కాబట్టి, బ్రిటన్ ఈ సవరణను వీటో చేస్తుంది. సమితి సభ్యులంతా ఏకమైనా ఇక చేయకలిగింది ఏమీా వుండదు.

నియంతృత్వంక్రింద వున్న దేశాలకుగాని, కమ్యూనిస్టు ప్రభుత్వాల ఏలుబడిలోవున్న దేశాలకుగాని సమితిలో సభ్యత్వం వుండరాదని బ్రిటన్ ప్రతిపాదించవచ్చును. రష్యా ఈ ప్రతిపాదనను వీటో చేయనచ్చు. ఏదేశానికీ వలసలు వుండరాదని రష్యా సూచించితే ఫ్రాన్సు ఆ సూచనను వీటో చేయగలదు.

అయినా వీటో పనిచేయని సందర్భాలుకూడా కొన్ని వున్నవి. ఐర్లెండులో ఒక పాతికమంది బ్రిటిష్ పౌరులను ఐరిష్ ప్రజలు హత్యచేసినారని బ్రిటన్ సేనలనుపంపి కొన్ని ఐరిష్ గ్రామాలను నాశనం చేసింది. ఐర్లెండుగాని, మరోదేశంగాని బ్రిటిష్ ప్రభుత్వం చర్యలపై భద్రతామండలికి ఫిర్యాదు చేయవచ్చు. ఇది కేవలం బ్రిటన్ ఆంతరంగిక వ్యవహారాలకు సంబంధించిన విషయం అని, ఇందులో భద్రతామండలి వేలు పెట్టడానికి వీల్లేదని బ్రిటన్ ప్రతినిధి ఎంత వాదించినా, చర్చకు ఎంత అభ్యంతరం పెట్టినా ప్రయోజనం వుండదు. ఇది బ్రిటన్ ఆంతరంగిక వ్యవహారం అవునా కాదా అని చర్చించే అధికారం భద్రతామండలికి వుంది.

కనుకనే అనేక దేశాలు అవకాశం వున్నంతవరకు తమ మధ్య పొడచూపే తగాయిదాలను భద్రతామండలి వరకూ రానివ్వకుండానే అన్యమార్గాలద్వారా పరిష్కరించుకోవడానికి ప్రయత్నిస్తూ వుంటవి.

ఈజిప్టులో 1936 ఒప్పందాన్ని అనుసరించి బ్రిటన్ తన సేనలను అక్కడ వుంచింది. ఈ సేనలను ఉపసంహరించుకోవలసిందనీ, అలా చేయకపోతే భద్రతామండలికి ఫిర్యాదు చేయగలననీ ఈజిప్టు ప్రభుత్వం బ్రిటన్‌ను హెచ్చరించింది. బ్రిటన్ వెంటనే పాత ఒప్పందం స్థానే ఒక కొత్త ఒడంబడికను ప్రతిపాదించింది. ఈ విషయమై సంప్రతింపులు జరిపేందుకు బ్రిటన్ అలెగ్జాండ్రియాకు ఒక రాయబారవర్గాన్ని పంపింది.

భద్రతామండలిలో సభ్యత్వంలేని దేశాల మధ్య ఏర్పడ్డ తగాయిదాలు విచారణకువస్తే ఆ చర్చలకు హాజరై తమ వాదాన్ని వినిపించే అధికారం ఆ దేశాలకు వున్నదా లేదా అన్న విషయాన్నికూడా మండలి నిర్ణయించగలదు. అగ్ర రాజ్యాల్లో ఒకరాజ్యం ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఈ తగాయిదాల్లో ఇరుక్కొనివున్నా, ఆ అగ్రరాజ్యానికి ఇతర దేశాలను భద్రతామండలి సమావేశాల్లో పాల్గొననివ్వాలా లేదా అనేవిషయంమీద వీటోను ప్రయోగించే అధికారంలేదు.

సిరియా, లెబనాన్ ప్రభుత్వాలు తమ దేశాల్లోవున్న బ్రిటిష్, ఫ్రెంచిసేనలు వైదొలగాలని బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వాలకు సూచించినవి. బ్రిటన్, ఫ్రాన్సులు ఇందుకు సమ్మతించలేదు. ఎన్నో సాకులు చెప్పినవి. అయినా అమెరికా

రష్యాలు సిరియా, లెబనాన్‌ల వాదాన్ని సమర్థించినవి. బ్రిటన్, ఫ్రాన్సులు ఈ దేశాలనుంచి తమ సేనలను ఉపసంహరించుకోవాలని స్పష్టంచేసినవి. భద్రతామండలి ఈ సమస్యను చర్చించినంతకాలం బ్రిటన్, ఫ్రాన్సులతో సరిసమాన స్థాయిలోనే సిరియా, లెబనాన్‌లు హాజరైనవి. ప్రతిపాదన వోటుకురాగా ఈ నాలుగు దేశాలూ వోటింగులో పాల్గొనలేదు—సిరియా, లెబనాన్‌లకు మండలి సభ్యత్వంలేదు గనుకనూ, బ్రిటన్, ఫ్రాన్సులు కక్షిదారులు గనుకను. అయితే, ఏ తీర్మానమైనా మండలి ఆమోదాన్ని పొందాలని సమితి ప్రణాళిక నిబంధించిందే; మరి ఈ తీర్మానం మండలి ఆమోదాన్ని ఎలా పొందింది అనే అనుమానం వస్తుంది. అగ్రరాజ్యాల్లో కక్షిదారులు గాని మిగతా అగ్రరాజ్యాలు అన్నీ ఆమోదిస్తూ తీర్మానం నెగ్గడానికి కావాల్సిన ఏడువోట్లు వస్తే చాలు, తీర్మానం నెగ్గుతుంది.

అగ్రరాజ్యాలకు అసలు ఈ వీటో అధికారం ఎందుకు ఇవ్వడం జరిగింది అంటారు చాలామంది. అగ్రరాజ్యాలకు ఈ వీటో అధికారం లేకపోతే సమితిలో చేరడానికి అమెరికా, రష్యాలు అంగీకరించలేదు. బలిష్ఠమైన ఈ రెండు రాజ్యాలనూ వదలి, సమితిని ఏర్పాటు చేసి ప్రయోజనం లేదని మిగతా రాజ్యాలన్నీ గ్రహించినవి. ఆ రెండు దేశాలను వదిలి సమితిని ఏర్పాటు చేసుకోవడంకంటే అగ్రరాజ్యాలకు వీటో అధికారం ఇవ్వడమే మంచిదని అన్ని దేశాలూ అంగీకరించినవి.

ఈ వీటో అధికారం భద్రతామండలి వ్యవహారాలకు మాత్రమే ఎందుకు పరిమితమైవుంది ? సమితి సర్వసభ్య సంఘంలో ఈ దేశాలన్నీ మిగతా రాజ్యాల స్థాయిలోనే ఎందుకు వుంటవి ? అని సహజంగా ప్రశ్నిస్తారు. ఈ రెండు సంఘాలూ నిర్వహించే పనులు వేరు వేరు. సమితి సర్వసభ్య సంఘం చర్చించే విషయాలు ఏమిటి ? ప్రపంచంలో వ్యాధులను ఎలా నివారించాలి ? ప్రజల దారిద్ర్యాన్ని నిర్మూలించేందుకు ఏ యే చర్యలు తీసుకోవాలి ? ప్రపంచ పౌరులందరికీ వైద్య, విద్యా సౌకర్యాలను కల్గించేందుకు ఎవరెవరు ఏమేమి చెయ్యాలి ? పనివారికి న్యాయమైన కనీస వేతనాలను లభింపచేయడం ఎలా ? ఈ విధమైన అనేక ప్రశ్నలకు సమాధానాలను అన్వేషించడమే సర్వసభ్యసంఘం నిర్వహించవలసిన ప్రధాన బాధ్యత. ఈ విధమైన సమస్యల పరిష్కారానికి మార్గాలను విచారించి, ఆ మార్గాలను అనుసరించవలసిందని సమితి దేశాలకు సిఫారస్సు చేస్తుంది.

యుద్ధాలను నివారించడం, సైనిక చర్యలు ప్రారంభం కాకుండా చూడడం భద్రతామండలి బాధ్యత.

రెండు దేశాల మధ్య ఏ తగాయిదా ఏర్పడ్డా, ఆ తగాయిదా తీవ్రమై ఈ రెండు దేశాల సంబంధాలు విషమించి ప్రపంచ యుద్ధానికి దారితీయవచ్చును. చినికి చినికి గాలివానైనట్లు ఈ తగాయిదా పెరిగి పెరిగి ఈ రెండు దేశాలమధ్యా యుద్ధం ప్రారంభం కాబోయేవరకూ భద్రతామండలికి ఈ విషయం తెలియక పోవచ్చును. కాని, రెండు దేశాలమధ్య ఏర్పడ్డ

తగాయిదాలు ఇలాంటి విషమపరిణామాలకు దారితీయకముందే భద్రతామండలి ఆవివాదాన్ని పరిష్కరించడానికి ప్రయత్నిస్తుంది.

కొన్ని కొన్ని సందర్భాల్లో సమితి సర్వసభ్యసంఘం జోక్యం కల్గించుకొని రాజీచేయడానికి ప్రయత్నించవచ్చు. కాని, భద్రతామండలికి వున్న అధికారం సమితి సర్వసభ్య సంఘానికి లేదు. సమితి సర్వసభ్యసంఘం కక్షిదారులను బ్రతిమాలి, మంచిగా నచ్చచెప్పి రాజీకి కృషిచేయ వలసిందే గాని, భద్రతామండలి మాదిరిగా పోలీసు అధికారివలె వ్యవహారం చేయలేదు.

సమితి ఏర్పడిన మొదట్లో భద్రతామండలి విచారించవలసి వచ్చిన ప్రధాన సమస్యల్లో ఒకటి ఇరాన్‌లోని రష్యన్ సేనల ఉపసంహరణకు సంబంధించిన సమస్య. ఇరాన్‌లో సోవియట్ సేనలు ఉండడం చాలా అప్రధానమైన మామూలు పరిస్థితియేనా? లేక ఆ రెండు దేశాలకు మధ్య ఏర్పడిన ఒక తగాయిదా అని భావించవచ్చునా? మామూలు పరిస్థితి అయినప్పుడు ఆ వ్యవహారంలో ప్రమేయం పెట్టుకునే అధికారం భద్రతా మండలికి లేదు. ఆ పరిస్థితి ఒక సంగ్రామానికి దారితీయగలదిగా మార్పు చెందేవరకూ భద్రతామండలి ఏమీ చేయలేదు. అనేక విషయాలను విచారించినట్లే ఈ పరిస్థితినీ విచారించ గలదేగాని ఎట్టిచర్యలూ తీసుకోవడానికి లేదు.

ఇరాన్‌లో రష్యన్ సేనలు వుండడం అన్నది మామూలు పరిస్థితే గాని, యుద్ధానికి దారితీయగల ప్రమాదం అందులో ఏమీలేదని భద్రతా మండలిలోని సోవియట్ ప్రతినిధి వాదింప

వచ్చును. అలాగే వాదించాడు. సోవియట్ ప్రతినిధి అంతటితో ఆగలేదు. "ఇరాన్ ప్రతినిధి తన ఫిర్యాదులో రష్యా సేనలు తమ దేశంలో వుండడం ఒక పరిస్థితి అని మాత్రమే పేర్కొన్నాడు. యుద్ధానికి దారితీయని ఏ వ్యవహారంపైనైనా అగ్రరాజ్యాలు వీటో ప్రయోగించవచ్చు. కనుక రష్యా ఈ ప్రతిపాదనపై వోటుచేయవచ్చు. అవసరమైతే వీటోనుకూడా ప్రయోగించ వచ్చును," అన్నాడు. ఈ విధమైన వాదన రాగలవని మండలిలోని ఇతర ప్రతినిధులు ఎవ్వరూ భావించలేదు. రష్యా ఆ విధంగా ఈ చర్చను నిలిపివేసింది.

సమితి సర్వసభ్యసంఘం అయితే ఏ పరిస్థితినైనా విచారించవచ్చును. ఏ సమస్యనైనా చర్చించి దాన్ని పరిష్కరించేందుకు కక్షిదారులైన దేశాలు అనుసరింపవలసిన మార్గాలను సూచించవచ్చును. ఇలాంటి సందర్భాల్లో భద్రతామండలి అధికారాలు పరిమితమై వుంటవి. ఏదో ఒక దేశం యుద్ధం చేయబోతున్నానని బెదిరించేవరకూ, ఆ దేశం అలా చేయబోతోందని మరో దేశం నివేదించేవరకూ భద్రతామండలి చేయగలిగింది ఏమీ లేదు.

అయినా సమితి ప్రణాళికలోని 3 వ అధ్యాయాన్ని పరిశీలించితే విపత్కర పరిస్థితులను ఎదుర్కొనేందుకు మండలి చేయగలిగింది చాలా వున్నట్లు స్పష్టమాతుంది. అయితే, మండలి నిర్ణయాలన్నీ ప్రణాళికలోని మొదటి రెండు సూత్రాలకూ లోబడి వుండాలి సుమా అని 24 వ సూత్రం

హెచ్చరిస్తున్నది. ఈ సూత్రం ప్రకారం భద్రతామండలి చేసిన యావత్తు పనిని సమితి సర్వసభ్య సంఘానికి నివేదించవలసి వుంటుంది. మండలి ఏంచేసినా అవి సమితి ప్రణాళికలోని సూత్రాలకు, సిద్ధాంతాలకు అనుగుణంగా వుండాలి. సమితి ప్రణాళికలోని మొదటి రెండు సూత్రాలూ, ఈ సమితి లక్ష్యాలను, సమితికి ఆధారమైన సిద్ధాంతాలను, సూత్రాలను వివరించినవి. (ఈ ప్రణాళిక పాఠం పూర్తిగా గ్రంథాంతాన వుంది.) మండలి నిర్ణయాలు, చర్యలు సమితి ప్రణాళికలో వివరింపబడిన లక్ష్యాలకు అనుగుణంగా వుండేటట్లు సమితి సర్వసభ్యసంఘం చూడాలి.

మండలి నిర్ణయం ఏదైనా సమితి ప్రణాళికకు విరుద్ధంగా వున్నట్లు సర్వసభ్యసంఘం భావిస్తే ఆ విషయం మండలికి నివేదించి అలా ఎందుకు చేయవలసివచ్చిందని సంజాయిషీ అడుగుతూ ఆ నిర్ణయాన్ని పునః విచారించమని కోరవచ్చు.

భద్రతామండలి ఈ సిఫార్సును లక్ష్యం చేయక పోవచ్చును. లక్ష్యంచేయని పరిస్థితుల్లో బ్రహ్మాండమైన గాలి దుమారం రేగుతుంది. భద్రతామండలి వైఖరి ప్రపంచ ప్రజల విమర్శలకు గురి అవుతుంది. ఆ నిర్ణయానికి అమెరికా ప్రతినిధికూడా సహాయపడినట్లు అమెరికా ప్రజలు తెల్సుకుంటే వెంటనే ప్రభుత్వ వైఖరిని విమర్శిస్తూ దేశం దశ దిశలనుంచి విమర్శలు బయల్దేరుతవి. అమెరికా ప్రభుత్వ భవిష్యత్తే అస్థిరమైపోతుంది. అమెరికా ప్రతినిధి అధ్యక్షుడు ఎలా చెప్తే అలా చేయవలసినవాడేగదా! అమెరికా ప్రజలు

ఎలా చేయమంటే అలా చేయవలసినవాడు అధ్యక్షుడు. పదభ్రష్ఠం కాకతప్పుతుందా? ఇంత ప్రమాదంవుంది గనుక భద్రతామండలి తొలిసిద్ధాన్ని పునర్విమర్శ చేయక తప్పదు.

అధ్యాయం ౫

# ఆర్థిక, సాంఘిక సంఘం

## ప్రజల జీవన పరిస్థితుల అభివృద్ధే లక్ష్యం

సమితి వుపసంఘాలలో భద్రతామండలి తరువాత అంత ముఖ్యమైంది ఆర్థిక, సాంఘికసంఘం. ప్రపంచ ప్రజల నిత్య జీవితానికి సంబంధించిన అనేక సమస్యలను విచారిస్తుంది. మన దేశీయ, రాష్ట్రీయ ప్రభుత్వాలలో వుండే ప్రజారోగ్యశాఖ లాంటిది ఈ ఆర్థిక, సాంఘిక సంఘం. ప్రజాసామాన్యానికి ఉల్లాసాన్ని, ఆనందాన్ని కల్పించే ప్రతి ఒక్క వ్యవహారంతోను ఈ సంఘానికి సంబంధం వుంది.

కడుపునిండా తిండి, వంటినిండా బట్ట, తలదాచుకునేందుకు తగిన ఇల్లు, పిల్లలను చదివించుకునేందుకు చక్కని పాఠశాలలు, మంచి వైద్యశాలలు—ఇది సర్వ సామాన్యంగా ప్రపంచ ప్రజలు, వారేదేశీయులైనప్పటికి, వాంఛించే కనీస నిత్యజీవితావసరాలు. ప్రథమ, ద్వితీయ ప్రపంచ సంగ్రామాల మధ్యకాలంలో రెండు దశాబ్దాలు ఈ నిత్యావసరాలను సంపాదించుకునేందుకు తగిన డబ్బులేక ప్రజాసామాన్యం ఎన్నో అవస్థలు పడింది. పనులుదొరకక, తిరిగి

వుద్యోగాలు దొరక్క అనేకమంది తమవద్ద నిలవవున్న కొద్ది డబ్బు ఖర్చుచేసుకొని దరిద్రులై పోయినారు.

ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరం ఏర్పడిన ఈ విషమ ఆర్థిక పరిస్థితులే ద్వితీయ ప్రపంచ సంగ్రామానికి కారణం అని ఇప్పటికి మనం గ్రహించాం. మరో సంగ్రామాన్ని నివారించాలంటే ఈ వెనుకటి ఆర్థికమాంద్యం ఏర్పడకుండా చూచుకోవడం చాలా అవసరం అని అందరు గుర్తించారు. ప్రపంచంలో ఏ ఒక్క దేశంలో అయినా సరే ప్రజలజీవితం దుర్భరమైతే ఆ పరిస్థితి ప్రపంచ యుద్ధానికి దారితీస్తుందని ఇప్పుడు ఋజువైంది.

తిండికి మల మల మాడుతున్న ప్రజాసామాన్యాన్ని వుద్దేశించి ఒక రాజకీయ వేత్త ఇలా వుద్బోధిస్తే ఎలా వుంటుందో ఆలోచించుకోండి: "నేను చెప్పేమాటలు విని నన్ను అనుసరించండి. మీకు కావాల్సినంత తిండి పెట్టిస్తాను. మన ఈ స్థితికి కారణభూతులైన వారితో పోరాడి ఘనమైన విజయాలు సాధిద్దాం. మనకు ఏకొరతా వుండదు. మనకు కావాల్సినవన్నీ పుష్కలంగా లభిస్తవి. అప్పుడు మనంగాక మన ఈదుస్థితికి బాధ్యులైన మన శత్రువులు ఆ స్థితిని అనుభవిస్తారు." పట్టెడు అన్నానికి నోచుకోని ప్రజలకు ఇలాంటి ఆశలు కల్పిస్తున్నప్పుడు ప్రజలు ఆ నాయకుని అనుసరించకుండా ఎలా వుండగలరు?

హిట్లరు జర్మనీ ప్రజలను అలాగే రెచ్చగొట్టాడు. తత్ఫలితం ద్వితీయ ప్రపంచ సంగ్రామం. ఇలాంటి దుస్సంఘట

నలు తిరిగి సంభవించకుండా చూచుకోవాలి. అందుకు తగిన ప్రయత్నం జరక్కపోతే మరొక ఇరవై సంవత్సరాలకు తృతీయ సంగ్రామం తప్పని సరిగాదా ? ఈ సమస్యను పరిష్కరించేందుకు, సంగ్రామ హేతువులను పూర్తిగా తొలగించేందుకు సమితి ఆర్థిక, సాంఘిక సంఘం కృషిచేస్తున్నది.

ఆర్థిక, సాంఘికసంఘ సమావేశాలకు హాజరవుతున్న వివిధ దేశాల ప్రతినిధుల ముఖకవళికలను, వారి వాలకాన్ని జాగ్రత్తగా పరిశీలించితే ఆర్థిక, సాంఘికసంఘం నిర్వహించే బాధ్యత ఎలాంటిదో సులభంగా గ్రహింపవచ్చును. ఏ దేశపు ప్రతినిధిని చూచినా ఎంతో భారంతో కృంగిపోతున్నట్లు కన్పిస్తాడు. ఎవరిముఖం చూచినా ఎంతో గంభీరంగా కన్పిస్తుంది.

వార్తా పత్రికల్లో బ్రహ్మాండమైన శీర్షికతో ప్రచురణకు వుపయోగింపబడే సంఘర్షణలను ప్రోత్సహించేందుకు వీరిక్కడ సమావేశం కావడంలేదు. ఈ సంఘ కార్యక్రమాలకు వార పత్రికలు ఎలాంటి ప్రాముఖ్యం ఇవ్వకపోగా, అప్రధానంగానే అయినా సవివరంగా ప్రకటించవు.

తిండికి మొహంవాచిపోయిన ప్రజలకు ఇంత తిండి లభింప చేయడానికి, ఆకాశమే ఆచ్ఛాదనంగాకల్గి నిలువ నీడలేకుండా పోయిన లక్షలాది ప్రజలకు ఇల్లు, వాకిలి ఏర్పాటు చేయడానికి, ఏ దేశంలోనూ ఆశ్రయం లభించని రక్షణార్థులకు ఆవాసం కల్పించడానికి, మరో తృతీయ సంగ్రామారంభానికి దారితీయగల పరిస్థితులను తొలగించడానికి, ప్రపంచాన్ని

కిందుమీదుచేసే అతిక్లిష్టమైన ఆర్థికసమస్యలను పరిష్క-రించడానికి ఈ ఆర్థిక, సాంఘికసంఘం చేస్తున్న బ్రహ్మాండమైన కృషికి తగిన ప్రచారమే లేదు.

ఈ సంఘంలో ఒక్కొకసారి 18 దేశాలకు సభ్యత్వం వుంటుంది. ఈ 18 దేశాల ప్రతినిధులతోబాటు ఈ ఆర్థిక. సాంఘిక సంఘ సమావేశాలకు సమితి ప్రధాన కార్యదర్శి, సహాయ కార్యదర్శి, ఈ 18 దేశాల ప్రతినిధుల సలహాదార్లు అంతాచేరి దాదాపు యాభైమంది హాజరవుతారు. ఈ సమావేశాలకు వివిధదేశాల అధికార ప్రతినిధులే గాక, ఈ సంఘం నిర్వహించే కార్యక్రమాల్లో ఆసక్తిగల అనేక అనధికార సంస్థల, ప్రజాసంఘాల ప్రతినిధులు ఎందరో హాజరవుతారు. ఏడెనిమిదివందల మంది హాజరవడానికి ఎర్పాట్లుంటవి సమావేశాలు జరిగే హాల్లో.

ఆర్థిక, సాంఘికసంఘంలో నాలుగు అనధికార సాంఘిక సేవాసంఘాలకు ప్రత్యేక సౌకర్యాలున్నవి. ప్రపంచ కార్మిక సంఘాల సమాఖ్య (వరల్డ్ ఫెడరేషన్ ఆఫ్ లేబర్), అమెరికను కార్మిక సంఘం (అమెరికన్ ఫెడరేషన్ ఆఫ్ లేబర్), అంతర్జాతీయ సహకార సమ్మేళనం (ఇంటర్నేషనల్ కోఆపరేటివ్ ఎలయన్స్), అంతర్జాతీయ వాణిజ్య మండలి (ఇంటర్నేషనల్ ఛేంబర్ ఆఫ్ కామర్స్) ఈ నాలుగు సంఘాల్లో ఏ సంఘం అయినా కొన్ని సమస్యలను పరిష్క-రించాలని సూచించినా ఆర్థిక, సాంఘికసంఘం ఆ విషయాలను విధిగా విచారించాలి.

"వార్తా స్వాతంత్ర్యం ప్రప్రథమ స్వాతంత్ర్యంగా సాధింప తగ్గది," అని అమెరికా ప్రతినిధి మిస్టర్ వినాంట్ ఆర్థిక, సాంఘికసంఘం తొలి సమావేశంలో ప్రతిపాదించాడు. వార్తా స్వాతంత్ర్యం అంత ప్రధానమైనది కాదని రష్యా ప్రతినిధి వాదించాడు. ఆర్థిక, సాంఘిక సంఘం ప్రప్రథమంగా సాధింప వలసింది సర్వజాతుల సమత్వం అని, అందుకు కృషి చేయాలని సోవియట్ ప్రతినిధి సూచించాడు.

రష్యాలో వార్తాపత్రికలకు స్వేచ్ఛ లేదని అందరికీ తెలుసు. సోవియట్ పత్రికలు వాటికి ఇష్టమైన వార్తలను ప్రచురించేందుకు వీలులేదు. అమెరికాలో పత్రికలను ఆ విధంగా బంధించడం అన్నది లేదు. ఇలాంటి నిర్బంధాలను అమెరికా ప్రజలు, పత్రికలు సహించరు. అమెరికా ప్రతినిధి రష్యా పేరెత్తి ఏమీ అనకపోయినా వార్తాస్వాతంత్ర్యం సంగతి ప్రస్తావించి నప్పుడు ఆయన ఏ విషయం మనస్సులో పెట్టుకొని మాట్లాడుతున్నాడో ఎవరికీ తెలియదు?

అలాగే రష్యా ప్రతినిధి ముందు సర్వజాతుల సమత్వ సాధనకు కృషిచేయాలని సూచించినప్పుడు, అమెరికాను మనస్సులో వుంచుకునే సోవియట్ ప్రతినిధి అలా అన్నాడని అందరికీ తెలుసును. అమెరికాలో తెల్లజాతివారికీ, నీగ్రో జాతివారికీ వుంటున్న హక్కులు వేరు వేరని తెలియని వారు లేరు. అమెరికాలోని అనేక రాష్ట్రాల్లో రంగుజాతుల వారు మంచి పాఠశాలలకు పోయేందుకు లేదు. కొన్ని రైల్వే

స్టేషన్లలో నల్లజాతులవారు అడుగు పెట్టడానికి వీల్లేదు. రష్యాలో ఇలాంటి విచక్షణను సహించరు.

ప్రధాన విషయాలపై ఈ విధమైన తీవ్ర అభిప్రాయ భేదాలున్నప్పుడు వివిధ జాతులు కలిసి పనిచేయడం చాలా కష్టం. ఆర్థిక, సాంఘిక సంఘం చేయవలసిన పని ఇది.

ప్రపంచంలో ఏ ప్రాంతంలో వున్నప్పటికీ, వారు ఏ జాతికి చెందినవారైనప్పటికీ ప్రజలు అందరికీ పుష్టికరమైన ఆహారం లభించేటట్లు చేయాలి. ప్రజాసామాన్యానికి కావలసినంత బట్ట అందజేయాలి. ఎవ్వరూ ఇళ్ళు లేక నడివీధుల్లో నివాసాలేర్పాటు చేసుకోకుండా చూడాలి. పనిచేయగలవారందరికీ పని దొరికేటట్లు చూడాలి. ఈ పనులన్నింటినీ చేయవలసిన బాధ్యత ఆర్థిక, సాంఘిక సంఘంపై వుంది. ఇంతేగాదు. ఈ సంఘం నిర్వహింపవలసిన బాధ్యతలు ఇంకా ఎన్నో వున్నవి.

ఒక దేశం సరకు తమ దేశానికి రాకుండాను, తమ దేశం సరుకు ఇతర దేశాలకు పుష్కలంగా ఎగుమతి కావడానికి వీలుగా అనేక దేశాల ప్రభుత్వాలు దిగుమతి ఎగుమతి సుంకాలను నిర్ణయిస్తారు. దీన్ని తగ్గించమని ఇతర దేశాలవారు ఆ దేశాలను ఆర్థిక, సాంఘికసంఘంద్వారా కోరవచ్చును. అంతేగాక, ఒక దేశం మరో దేశంనుంచి ముడిపదార్థాలను, ఆహార ధాన్యాన్ని, పారిశ్రామిక వస్తువులను దిగుమతి చేసుకోవాలంటే అందుకు కావలసిన విదేశ ద్రవ్యాన్ని లభింపచేయడంకూడా ఈ ఆర్థిక, సాంఘికసంఘం బాధ్యతే. అంటే,

అంతర్జాతీయ వర్తక లావాదేవీలు ప్రపంచ ప్రజాసామాన్యానికి ప్రయోజనకరంగా వుండేటట్లు, అన్ని రాజ్యాలకు అంగీకారంగా వుండేటట్లు అవసరమైన ఏర్పాట్లు చేయడమే ఆర్థిక, సాంఘిక సంఘం ప్రధాన బాధ్యత ; ముఖ్య కర్తవ్యం.

కార్మికుల స్థితిగతులను బాగుచేయడానికి ఆర్థిక, సాంఘిక సంఘం ప్రయత్నిస్తుంది. కార్మికులకూ, వారి యజమానులకూ మధ్య ఏర్పడే తగాయిదాలను శాంతియుతంగా పరిష్కరించడానికి వివిధ దేశాల ప్రభుత్వాలను ప్రోత్సహింప వచ్చును. పనివారి కిచ్చే కూలీ తక్కువగా వుంటే, పనికి తగ్గ వేతనాలు లభ్యమయ్యేందుకు అవసరమైన చర్యలను తీసుకొనవచ్చును. న్యాయమైన కూలీని నిర్ణయించి యజమానులు ఆ కూలీ చెల్లించేటట్లు చూడవలసిందని ఆ యా రాజ్యాలకు సిఫార్సు చెయ్యవచ్చును. ఏ దేశంవారైనా మరో దేశం వెళ్ళి పని సంపాదించుకొని జీవితం గడపడానికి అవకాశాలు కల్పింపమని ఎందరో ఆర్థిక, సాంఘికసంఘాన్ని అడుగుతున్నారు. 1930 వ సంవత్సరంలో ఆర్థిక మాంద్యం ఏర్పడింది. ప్రతి దేశంలోనూ లక్షలాదిగ కార్మికులు నిర్వ్యాపారులైనారు. అప్పట్లో అనేక దేశాలు, ఇతర దేశాలవారు వచ్చి ఆ దేశంలో ఉద్యోగాలు సంపాదించడానికి వీలు లేకుండా శాసనాలు చేసినవి.

ప్రపంచ ప్రజలు పరస్పరం గౌరవించుకొనడానికి, ఒకరిలో ఒకరికి విశ్వాసం కలగడానికి కూడా ఆర్థిక, సాంఘిక సంఘం కృషి చేస్తుంది. ప్రపంచ రైతాంగం ఎక్కువగా

పండించడానికి అవసరమైన సాధన సంపత్తిని సమకూరుస్తూ, పంటదారులు ఏ లోటు లేకుండా జీవితం గడపడానికి అవసరమైన సహాయం చేస్తుంది.

ఒక దేశం ప్రజలు మరొక దేశం ప్రజలను తెలుసుకునేందుకు కావలసిన రేడియో, టెలిఫోను, వార్తాప్రచారాది సౌకర్యాలను కల్పించడానికి ప్రయత్నిస్తుంది.

సమితి ప్రణాళికలోని 55 వ సూత్రం ఈ విషయాలన్నింటినీ వివరించింది.

ఆర్థిక, సాంఘికసంఘం ఈ ప్రధానాంశాలకు సంబంధించిన సమస్యలను పరిష్కరించేందుకు ప్రయత్నించడంతోబాటు, ఈ వివిధ రంగాలలో అభివృద్ధిని, అభ్యుదయాన్ని సాధించడానికికూడా కృషి చేస్తుంది. మన తాతముత్తాతలకు తృప్తిని, ఆనందాన్ని ఇచ్చిన పరిస్థితులు నేడు మనకు అంతులేని ఆందోళనను కల్గిస్తున్నవి.

శాస్త్రజ్ఞులు క్షణ క్షణం ఏవో క్రొత్తవిషయాలను కనిపెడుతున్నారు. ప్రతి రంగంలోనూ వృద్ధి కన్పిస్తున్నది. ఈ అభివృద్ధి ఫలితాలు మనకూ అనుభవానికి రావాలని మనం అనుకుంటున్నాం. ఇలా ఆశించడం మానవ ప్రకృతి. అభివృద్ధి, అభ్యుదయం కావాలనే ఈ వాంఛే మన జీవితాలను కొంత ఉత్సాహభరితం చేస్తున్నవి. నైరాశ్యాన్ని కొంతవరకు తొలగిస్తున్నది.

ఏ ఒక్క దేశమూ ప్రజలకు ఈ సౌకర్యాలన్నింటినీ, ఈ ఫలితాలన్నింటినీ అనుభవానికి వచ్చేటట్లు చేయలేదు. పది

దేశాలు కలిసి సమష్టిగా ప్రయత్నిస్తే ఒక దేశానికి అసాధ్యమైనది సాధ్యంకావచ్చు.

మీ దేశంలోనూ, మీ పొరుగు దేశంలోనూ మలేరియా వ్యాధి విపరీతంగా వుందనుకోండి. ఈ వ్యాధిని వ్యాపింపచేసే క్రిమి కీటకాదులను మీ దేశంలో నిర్మూలించి, మీ ప్రభుత్వం మలేరియాను నామరూపాలు లేకుండా చేసిందనుకోండి. కాని, అందువల్ల మీకు మలేరియానుండి విముక్తి లభించదు. మీ పొరుగు దేశంనుంచి మలేరియా క్రిములు మీ దేశంలో ప్రవేశిస్తూనే వుంటవి. తిరిగి వ్యాధి తలెత్తుతూనే వుంటుంది. కాబట్టి, మీ దేశమూ, మీ పొరుగు దేశమూ కలిసి మలేరియా నిర్మూలనకు సమష్టిగా ప్రయత్నిస్తేగాని లాభంలేదు.

అలాగే దేశాభివృద్ధి కార్యక్రమాల్లోనూ ఒక దేశానికి అలవిగాని పని, ఆ దేశానికి మరి పదిదేశాల సహాయ సహకారాలు లభిస్తే సులభంగా పూర్తి అవుతుంది. భారత దేశంలో ఒరిస్సా, చెన్నరాష్ట్రాలమధ్య మత్స్యఖండ్ నది వుంది. ఆ నదీ జలపాతంనుంచి విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయడానికి ఎంతో అవకాశం వుంది. ఈ ప్రాజెక్టును ఇటు ఒరిస్సాగాని, అటు చెన్నరాష్ట్రంగాని నిర్మించలేదు. రెండు రాష్ట్రాలుచేరి ఈ ప్రాజెక్టును నిర్మించుకుంటే తత్ఫలితంగా ఉత్పత్తి అయ్యే విద్యుచ్ఛక్తిని రెండు రాష్ట్రాలూ వుపయోగించుకో వచ్చును. ఇదే విధంగా రెండుదేశాలు సహకరించుకొని ఇలాంటి ప్రయోజనాలను పొందవచ్చును.

ఒక దేశంలో బట్టల మిల్లుల పనివారందరు సమ్మెలుచేసి ఎక్కువ వేతనాలను సాధించడం మనం చూస్తూనే వున్నాం. పనివారి వేతనాలను ఎక్కువ చేయడంవల్ల ఆ దేశంలో బట్టధర పెరిగిపోతుంది. కాని, ఆ దేశానికి అయిదారు వేల మైళ్ళ దూరంలోవున్న ఒక దేశంలో కార్మిక వేతనాలు చాలా తక్కువగావుండి బట్ట చాలా చౌకగా తయారవుతుంది. ఈ దేశంలో తయారయ్యే బట్ట ఆ మొదటి దేశానికివచ్చి అక్కడి బట్టకంటే చౌకగా అమ్మక మవుతుంది. అందువల్ల ఆ దేశంలో తయారయ్యే బట్టకు గిరాకీలేకుండా పోతుంది. ఆ కారణంగా ఆ బట్టలు తయారుచేసే మిల్లులు మూతబడిపోతవి. ఇన్ని మిల్లులు పనిలేకుండా పోవడంవల్ల ఆ మిల్లులలో పని చేసే లక్షలాది కార్మికులు నిరుద్యోగులై పోతారు. ఈ సమస్యను ఏ ఒక్క దేశమూ పరిష్కరించలేదు. ప్రపంచంలో నేడు పరిష్కారం కావాల్సిన అన్ని సమస్యలూ దాదాపు ఇలాంటివే.

ఈ సమస్యలు ఏ ఒక్క దేశం కృషివల్లా పరిష్కారం కావు. ప్రపంచ రాజ్యాలన్నీ సమష్టిగా ప్రయత్నించేటట్లు చేయడమే ఆర్థిక, సాంఘికసంఘం ప్రధాన కర్తవ్యం.

ఆర్థిక, సాంఘికసంఘం సాధారణంగా సంవత్సరంలో మూడుమార్లు సమావేశమవుతుంది. అవసరం ఏర్పడితే ప్రత్యేక సమావేశాలను కూడా జరపవచ్చు. ఈ సమావేశాలన్నీ ఎలా జరగాలో, ఏ నియమ నిబంధనలకు లోబడి వుండాలో ఆర్థిక, సాంఘికసంఘం సర్వసభ్య సమావేశమే

నిర్ణయించుకుంటుంది. ఈ సర్వసభ్య సంఘానికి సభ్యులను సమితి సర్వసభ్యసంఘం ఎన్నుకుంటుంది. ఏ దేశపు ప్రతినిధి ఆ సంఘానికి ఎన్నిక అవుతాడో, ఆ ప్రతినిధే ఆ మూడు సంవత్సరాలూ ఆ దేశ ప్రతినిధిగా వ్యవహరించాల్సివుంటుంది.

ఆర్థిక, సాంఘికసంఘం మొదటి సమావేశానికి భారత దేశం ప్రతినిధి సర్ ఎ. రామస్వామి మొదలియార్ అధ్యక్షుడుగా ఎన్నికైనాడు. మేధావి. ప్రతిభా సంపన్నుడు. శాంతస్వభావం కలవాడు. సంఘ ఉపాధ్యక్షులుగా యుగో స్లావియా, కొలంబియా ప్రతినిధులు ఎన్నికైనారు.

ఆర్థిక, సాంఘికసంఘంలో అగ్రరాజ్యాలకు ఎక్కువ అధికారాలు లేవు. పెద్ద రాజ్యాలెంతో చిన్న రాజ్యాలూ అంతే. ఒక్కొక్కసారి అగ్రరాజ్యాలు ఈ సంఘానికి ఎన్నికే కాకపోవచ్చును. ఈ సంఘ సమావేశాల్లో ప్రతిపాదిత విషయం ప్రధానమేగాని, ఆ విషయాన్ని ఎవరు ప్రతిపాదించా రన్నది ముఖ్యంగాదు.

ఆర్థిక, సాంఘికసంఘం నిర్వహించవలసిన కార్యక్రమానికి విషయ సేకరణ చాలా ప్రధానం. ఏదైనా ఒక సమస్య ఆర్థిక, సాంఘికసంఘ విచారణకువస్తే ఆ సమస్య పూర్వాపరాలను సమగ్రంగా తెల్సుకోవాల్సి వుంటుంది. ఈ విషయ సేకరణకు, సమాచార సంగ్రహణకు ఆర్థిక, సాంఘికసంఘం అనేక మార్గాలను అనుసరించ వచ్చును. కొంతమంది ప్రవీణులను నియమింపవచ్చును. సమగ్ర విచారణజరిపి నివేదిక తయారు చేసేందుకు ప్రవీణుల కమిషన్‌ను ఏర్పాటు చేయవచ్చును.

ఈ సమస్య ఏ ప్రాంతానికి సంబంధించిందో ఆ ప్రాంతానికి విచారణాధికారులను పంపవచ్చును గాని, ఈ కమిషన్ ఆ ప్రాంతానికి రావడానికి వీల్లేదని ఆ ప్రాంతీయ ప్రభుత్వం అభ్యంతరపెట్టవచ్చును. అప్పుడు అన్యమార్గాల ద్వారా వివరాలను సేకరింపవలసి వుంటుంది.

ఏ ఒక ప్రత్యేకాంశ విచారణకైనా ఆర్థిక, సాంఘిక సంఘం ఒక అంతర్జాతీయ మహాసభను సమావేశ పరచ వచ్చును. ఈ ప్రపంచ ఆరోగ్యసంస్థను స్థాపించడానికి తయారైన వివిధ పథకాలను పరిశీలించేందుకు ప్రతినిధులను పంప వలసిందిగా 67 ప్రపంచ రాజ్యాలను ఈ సంఘం కోరింది. 1946 జూన్ మాసంలో ఈ 67 దేశాల ప్రతినిధులు న్యూయార్కులో సమావేశమైనారు. ప్రపంచారోగ్య సంస్థ నిబంధనలను, నియమావళిని తయారుచేశారు. ప్రపంచ ఆరోగ్యసంస్థ రూపొందింది. సమితి ప్రత్యేక అంగములలో ఒకటైంది.

ఆర్థిక, సాంఘికసంఘం నిర్వహింపవలసిన బాధ్యతలు చాలా గురుతరమైనవి. నిర్వర్తింపవలసిన విధులు బ్రహ్మాండమైనవి. అందువల్లనే ప్రత్యేక పనులను నిర్వహించేందుకు, ప్రత్యేక శాఖలను, ప్రత్యేక కమిషన్లను నియమించేందుకు సమితి ప్రణాళిక ఈ సంఘానికి అధికారం ఇచ్చింది. ఈ ప్రత్యేక కమిటీలు, కమిషన్లు ఆర్థిక, సాంఘికసంఘానికి ఆ యా విషయాలపై సలహాలు ఇస్తుంటవి. ఈ సలహాలను, వీటి ఆధారంగా తయారయ్యే పథకాలను ఆమోదించడమూ, లేదా

అన్ని విషయాలను మాత్రమే ఆర్థిక, సాంఘికసంఘ సర్వసభ్య సమావేశం నిర్ణయిస్తుంది. ఇప్పటికి ఈ సంఘం తొమ్మిది కమిటీలను, కమిషన్లను ఏర్పాటుచేసింది. అవసరం అని సర్వసభ్యసంఘం భావిస్తే ఇంకా ఎన్ని కమిషన్లనైనా ఏర్పాటు చేయవచ్చును.

మానవ హక్కుల సంరక్షణ ఈ సంఘం నిర్వర్తింపవలసిన ప్రధాన విధులలో ఒకటి. మన హక్కులకంటే, ఇతర ప్రజల హక్కులు చాలా ముఖ్యం. ఎక్కడో దూరదేశంలో ప్రజలు నానా బాధలూ పడుతున్నారనుకోండి. వారికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లేవనుకోండి. ఆ ప్రజల దారుణ స్థితితో మనకేమీ ప్రమేయంలేదని, వారెట్లావున్నా మనకు అవసరం లేదని భావించడానికి ఎంతమాత్రం వీలుగాదు. ఆ దేశంలోని పరిస్థితుల ప్రభావం క్రమంగా మనపైనా కన్పిస్తుంది.

నిరంకుశత్వము, ప్రజాపీడన అన్నవి కలరా, మలేరియాలవంటి వ్యాధులే. అవి ప్రపంచలో ఏమూల తలెత్తినా అక్కడి నుంచి క్రమంగా యావత్ప్రపంచాన్నీ ఆవరిస్తవి. అవీ ఒక రకమైన అంటువ్యాధులే.

మానవ హక్కులను గురించి సమితి ప్రణాళిక విస్పష్టంగా, నిర్దుష్టంగా ఏమీ చెప్పకపోయినా ఆ హక్కులను గురించి స్థూలంగానే అయినప్పటికీ అనేక వివరాలను వెల్లడించింది. సమితిలోచేరిన ప్రతిదేశమూ, సమితి మానవ హక్కులను, ప్రాథమిక స్వాతంత్ర్యాలను గౌరవించేందుకు

ప్రజలను ప్రోత్సాహింప గలమని ప్రమాణం చేయాలని సమితి ప్రణాళిక నిర్దేశిస్తున్నది.

అయితే, ఈ మానవహక్కులు ఏమిటో, ఈ ప్రాథమిక స్వాతంత్ర్యాలు ఏమిటో సమితి ప్రణాళిక వివరించలేదు. ఒకే ఒక విషయాన్ని సమితి ప్రణాళిక ఖచ్చితంగా చెపుతున్నది. ప్రపంచ ప్రజలందరికీ జాతి వర్ణ భాష వికక్షతలతో నిమిత్తం లేకుండా సమానమైన హక్కులను ఇవ్వాలి. పురుషులకు ఏ హక్కులు, అవకాశాలు వున్నవో స్త్రీలకూ అవే హక్కులు, అవకాశాలు వుండాలని సమితి ప్రణాళిక స్పష్టం చేస్తున్నది.

ఏ మతానికి చెందినవారైనా సరే, వారి కులం, మతం, జాతి, శరీరచ్ఛాయలతో నిమిత్తం లేకుండా ప్రజలందరికీ ప్రాథమిక స్వాతంత్ర్యాలు లభించేటట్లు చేయగలమని సమితి, సమితి దేశాలు వాగ్దానం చేయాలని సమితి ప్రణాళిక నిబంధిస్తున్నది. అంతేగాదు; అట్టి ప్రాథమిక స్వాతంత్ర్యాలను హరించేందుకు వీల్లేదనికూడా సమితిప్రణాళిక స్పష్టంచేస్తున్నది.

"ప్రపంచ ప్రజలమైన మేము" అనే మాటలతో సమితి ప్రణాళిక పరిచయ వాక్యాలు ప్రారంభ మవుతవి. అంటే ప్రపంచ ప్రజలు తమ ప్రభుత్వాలచేతే ప్రణాళికలో వివరింప బడిన వివిధపనులను చేయిస్తామని ప్రకటించుకున్నారన్న మాట. ప్రజలు ప్రభుత్వాలకొరకే వున్నారు అనీ, ప్రజలు ఏమి చేయవలసిందీ ఆ ప్రభుత్వాలే నిర్ణయించగలవనీ ఫాసిస్టు సిద్ధాంతం చెప్తున్నది. సమితి ప్రణాళిక ఈ ఫాసిస్టు సిద్ధాంతానికి పూర్తిగా విరుద్ధంగావుంది.

ప్రజల హక్కుల విషయం సమితి ప్రణాళికలో ఇలా వున్నదిగదా. ఇక వివిధ దేశాల హక్కులను గురించి సమితి ప్రణాళిక ఏం చెప్తున్నదో కూడా చూడండి. ప్రపంచంలో పెద్ద రాజ్యాలకు ఏ హక్కులైతే వున్నవో చిన్న రాజ్యాలకూ అవే హక్కులు వుండాలని సమితి ప్రణాళిక స్పష్టంగా, ఖచ్చితంగా చెప్తున్నది.

ప్రపంచ శాంతికి ప్రాణాధారమూ, ఐక్యరాజ్య సమితికి ఆయువు పట్టు సమితి ప్రణాళిక మొదటి సూత్రంలోని 2 వ నిబంధన. ఈ నిబంధన ప్రకారం ప్రపంచ ప్రజలకు, తాము ఏ జాతికి చెంది వుందామనుకుంటారో, తమకు ఎలాంటి ప్రభుత్వం కావాలనుకుంటారో నిర్ణయించుకునేందుకు సంపూర్ణ స్వాతంత్ర్యం ఇవ్వాలిసివుంటుంది.

"నవప్రపంచం అత్యంత ప్రధానమైన నాలుగు స్వాతంత్ర్యాలపై నిర్మాణం కావాలని మనం అందరం ఆశిస్తున్నాం. అలాంటి ప్రపంచావతరణకు మనం యావన్మందీ నిరీక్షిస్తున్నాం," అని 1941 సంవత్సరారంభంలో అమెరికా అధ్యక్షుడు ఫ్రాంక్లిన్ రూజ్వెల్ట్ ఒక ఉపన్యాసంలో ప్రకటించాడు. రూజ్వెల్ట్ అధ్యక్షుడు ఆ నాడు ప్రకటించిన చతుస్స్వాతంత్ర్యాలు చరిత్ర ప్రసిద్ధి కెక్కినవి. ఆ చతుస్స్వాతంత్ర్యాలేమిటి? వాక్స్వాతంత్ర్యం; ఆరాధనా స్వాతంత్ర్యం; లేమి, భీతినుండి విముక్తి నిచ్చే స్వాతంత్ర్యాలు.

అమెరికా అధ్యక్షుడు ఈ చతుస్స్వాతంత్ర్యాలను పేర్కొన్న ఆరు మాసాలకు అట్లాంటిక్ ప్రణాళిక వెలువడింది.

అట్లాంటిక్ మహాసముద్రంలో ఒక అమెరికన్ యుద్ధనౌకపై సమావేశమై బ్రిటిష్ ప్రధాన మంత్రి విన్‌స్టన్ చర్చిల్, అమెరికా అధ్యక్షుడు రూజ్వెల్ట్ సంయుక్తంగా ప్రకటించిన ఈ ప్రణాళిక ప్రపంచ ప్రజలకు లేమి, భీతినుండి విముక్తి చేకూరాలని మాత్రం హెచ్చరించింది. మరుసటి సంవత్సరం తయారైన సమితి ప్రణాళిక మత, ఆరాధనా స్వాతంత్ర్యాన్ని ప్రపంచ ప్రజలకు సమకూర్చాలని సూచించింది.

ఒక రిద్దరు వ్యక్తులు ఈ విధమైన చతుస్వాతంత్ర్యాలు ప్రజలకు లభించాలనీ, లభింపచేయడానికి ప్రపంచ రాజ్యాలు కృషి చేయాలనీ చెప్పడం సులభమే. కాని, ప్రపంచ రాజ్యాలు సమష్టిగా ఇలాంటి ప్రకటన చేయడం అంత సులభం గాదు. ఈ నాటివరకూ సమితి ప్రణాళికలో వాక్‌స్వాతంత్ర్యం గురించి ప్రపంచ రాజ్యాలు చేయవలసిన పనులను వివరిస్తూ నిబంధనలను చేర్చడం సాధ్యంగాలేదు. సమితి ప్రణాళికద్వారా ప్రపంచ ప్రజలకు వాక్‌స్వాతంత్ర్యాన్ని లభింప చేయడానికి ఎప్పుడు ప్రయత్నాలు జరిగినా ఏదో ఒక దేశం అడ్డు తగులుతూనే వచ్చింది. అయితే, కాలక్రమేణా ఇది సాధ్యం కాగలదనే ప్రపంచ రాజ్యాంగ తంత్రజ్ఞులు ఆశిస్తున్నారు.

అమెరికా రాజ్యాంగ శాసనం 1789 వ సంవత్సరంలో అమలుకు వచ్చింది. మానవ హక్కులకు సంబంధించిన ప్రసక్తి ఆ రాజ్యాంగంలో లేనేలేదు. 1791లో మానవ హక్కులకు సంబంధించి ఒక ప్రత్యేక శాసనం తయారైంది. ఈ శాసనం అమెరికా రాజ్యాంగ చట్టం అంతర్భాగమైంది. ఇందు

వల్ల అమెరికా ప్రజలకు వాక్ స్వాతంత్ర్యం, మత స్వాతంత్ర్యం, ఆరాధనా స్వాతంత్ర్యం లభించింది. దేశీయ రక్షకభటదళం వారు వారంట్లు లేకుండా అమెరికా పౌరుల ఇళ్ళను సోదా చేయడానికి వీలులేకుండా పోయింది. 'జ్యూరీ' పద్ధతిద్వారానే న్యాయ విచారణ జరగాలని ఈ సవరణ నిబంధించింది.

ఈ విధంగా కాలానుగుణంగా, అప్పటి అవసరాలను బట్టి అమెరికా రాజ్యాంగం మార్పులను పొందుతూ వచ్చింది. 1868 వ సంవత్సరంలో రాజ్యాంగ శాసనానికి జరిగిన మార్పు ఫలితంగా అమెరికాలోని రంగుజాతులకు పౌర స్వాతంత్ర్యం లభించింది. తరువాత రెండేళ్ళకు ఈ రంగు జాతులకు వోటు హక్కునిస్తూ అమెరికా రాజ్యాంగం సవరింపబడింది. 1920 వ సంవత్సరంలో గాని అమెరికా రాజ్యాంగం స్త్రీలకు వోటు హక్కును ప్రసాదించలేదు. (భారత రాజ్యాంగం ఆరంభంలోనే అమెరికా, బ్రిటన్ రాజ్యాంగాలను పరిశీలించి ఈ స్వాతంత్ర్యాలన్నింటినీ ఒక్క సారే భారతీయ పౌరులందరికీ ప్రసాదించింది. అస్పృశ్యతను చట్టవిరుద్ధం చేసింది.)

మానవుల కనీస, ప్రాథమిక హక్కులను సమితి ప్రణాళికలో చేర్చడం అన్నది ఆర్థిక, సాంఘికసంఘం ఏర్పాటు చేసిన మానవ హక్కుల కమిషన్ బాధ్యత. ఈ కమిషన్ అంతర్జాతీయ మానవ హక్కుల శాసనాన్ని తయారుచేయాలి.

ప్రపంచరాజ్యాలు ప్రజాసామాన్యానికి ఇప్పుడు ఏ యే హక్కులను ఇస్తున్నవి? అదనంగా ఏ యే హక్కులను ప్రసాదిం

చడానికి సమ్మతిస్తవి? మొదలైన విషయాలపై ఆ యా ప్రభుత్వాల అభిప్రాయాలను తెలుసుకోవడం మానవ హక్కుల కమిషన్ కర్తవ్యం. మానవ హక్కులకు సంబంధించిన సమగ్ర విచారణ జరిపి ఒక ప్రణాళికను సిద్ధంచేసి ఆ ప్రణాళికను సమితి ప్రణాళికలో చేర్చవలసిందిగా సమితి సర్వసభ్య సంఘాన్ని కోరవలసి వుంటుంది. ఈ సవరణను సమితి సర్వసభ్యసంఘం ఆమోదిస్తే అప్పుడు సమితి కార్యాలయం ఈ సవరణను ధృవపరచవలసిందిగా సమితి రాజ్యాలన్నింటినీ కోరుతుంది.

ఈ విధంగా సమితి ప్రణాళిక సవరణ సాధ్యంగానప్పుడు మానవ హక్కుల ప్రణాళికను ఒక ఒడంబడిక రూపంలో తయారుచేసి వ్యష్టిగా సమితి రాజ్యాల అంగీకారాన్ని సాధించవచ్చు. ప్రతిదేశమూ ఈ ప్రణాళికను దేశ రాజ్యాంగంలో చేర్చాలని కూడా సమితి సర్వసభ్య సంఘం సమితి దేశాలకు సూచించనూవచ్చు.

ఈ విధంగా ఈ ప్రణాళికను ప్రపంచ రాజ్యాల ఆమోదాన్ని పొందడంతో మానవ హక్కుల కమిషన్ పని పూర్తిగాదు. ప్రతి ప్రభుత్వమూ ఈ ప్రణాళికను ఎంతవరకు అమలుచేస్తున్నదో కూడా చూచుకోవలసివుంటుంది. ఏ రాజ్యం ఈ ప్రణాళిక అంశములను ఎంతవరకు అమలు జరిపిందో సరాసరి ఆ ప్రభుత్వాలనడిగి తెల్సుకోవచ్చు. ఏప్రభుత్వమైనా ఈ ప్రణాళికకు విరుద్ధంగా ప్రవర్తించితే ఆ

విషయాన్ని తగిన ఆధారాలతో ఎవరైనా సరే మానవ హక్కుల సంఘానికి ఫిర్యాదు చేయవచ్చును.

ఏ దేశ ప్రభుత్వమైనా ఈ మానవ హక్కుల ప్రణాళికను భంగపరచి, ప్రజలను వారి రాజకీయాభిప్రాయాల ప్రకటనకు గాని, వారి మతము, వారి జాతి, వారి తెగ కారణంగా గాని, హింసించినా, విచారణ లేకుండా జెయిల్లో నిర్బంధించినా మానవ హక్కుల కమిషన్ జోక్యం కల్గించుకోవచ్చును. ఒక ప్రభుత్వం తీసుకున్న చర్యలవల్ల ఏర్పడిన పరిస్థితులు సంఘర్షణలకు దారితీయగలవని మానవ హక్కుల కమిషన్ భావిస్తే పరిస్థితిని విచారించి, ఆ పరిస్థితులను తొలగించేందుకు చర్యలు తీసుకోమని భద్రతామండలిని కోరవచ్చును. మానవ హక్కుల కమిషన్ నుండి ఇలాంటి సందేశం అందిన వెంటనే భద్రతామండలి సమావేశమై విచారణ ప్రారంభించాల్సివుంటుంది. మానవ హక్కుల కమిషన్ సాధించ వలసిన మరొక స్వాతంత్ర్యం — వాక్ స్వాతంత్ర్యం.

సమితి ప్రణాళికలో "ప్రాతిపదిక, ప్రాథమిక స్వాతంత్ర్యాలు" అని ప్రస్తావించబడింది. ప్రజలకు వీటిని సమకూర్చడానికి సమితి ప్రణాళికను ఆమోదించిన ప్రతిరాజ్యము అంగీకరించింది. ఈ ప్రాతిపదిక ప్రాథమిక స్వాతంత్ర్యాలకు సంబంధించినవే వాక్ స్వాతంత్ర్యము, ముద్రణా స్వాతంత్ర్యము, రేడియో ప్రసార స్వాతంత్ర్యం, పత్రికా విలేఖరులు స్వేచ్ఛగా సమాచారాన్ని సేకరించి ఎలాంటి సెన్సారు నిబంధనలకు లోనుగాకుండా తమ పత్రికలకు వార్తలను పంపే స్వాతంత్ర్యం.

ఇవన్నీకూడా "ప్రాతిపదిక, ప్రాథమిక స్వాతంత్ర్యాల"లో చేరివున్నవని శాన్‌ఫ్రాన్సిస్కోలో జరిగిన సభలో అమెరికా ప్రతినిధి వాదించాడు. ఈ వాదనకు ఎన్నిరాజ్యాలు అంగీకరిస్తవన్నది ప్రధాన విషయం. అంగీకరించగలవనే ఆశకంటే అంగీకరింపక పోవచ్చుననే అనుమానమే ఎక్కువగావుంది. అయినా నిర్విరామంగా కృషిచేసి సాధింపతగ్గ హక్కులివి.

ఈ కృషిలో మానవ హక్కుల కమిషన్‌కు సహాయపడేందుకు వార్తా స్వాతంత్ర్య సబ్‌కమిషన్ అంటూ వొకటి వుంది. ఇందులో పది పన్నెండుమంది సభ్యులు వుంటారు. వీరిలో ప్రముఖ ఎడిటర్లు, ప్రచురణ కర్తలు వుంటారు. యదార్థ విషయాలను వెల్లడించేందుకు వుంటున్న ప్రతిబంధకాలను తొలగించడం ఎలా అన్న విషయాన్ని వీరు విచారిస్తారు. అసలు ఈ ప్రతిబంధకాలను ఏ యే ప్రభుత్వాలు కల్పిస్తున్నవో కూడా ఈ సబ్‌కమిషన్ విచారిస్తూ వుంటుంది.

స్త్రీలకు పురుషులతోబాటు సమానమైన హక్కులు లభిస్తున్నవా లేదా అనే విషయాన్ని విచారించేందుకు, స్త్రీలకు సరియైన వేతనాలు లభిస్తున్నవా లేదా అనే విషయాన్ని విచారించేందుకు, యువకులతోబాటు యువతులకు కూడా సమానమైన విద్యా సౌకర్యాలు లభిస్తున్నవా లేదా అనే విషయాలన్నింటినీ విచారించేందుకు స్త్రీల స్థాయిసంఘం ఒకటి వుంది. స్త్రీల హక్కులను, స్వాతంత్ర్యాన్ని పరిమితం చేసే శాసనాలు ఏ యే దేశంలోవున్నవో విచారించి వాటిని

రద్దు చేయించడానికి, లేదా సవరించడానికి అవసరమైన చర్యలను తీసుకోవడం ఈ స్థాయి సంఘం పని.

ప్రపంచంలో ఏ రాజ్యంలో స్త్రీలకు వోటు హక్కు లేకుండా వుందో అక్కడల్లా ఆ హక్కు స్త్రీలకు సమకూర్చ వలసిందిగా ఈ కమిషన్ ఆర్థిక, సాంఘిక సంఘాన్ని కోరింది. స్త్రీలకు పురుషులతో బాటు సమాన హక్కులను లభింప చేయడానికి సమితి సర్వసభ్య సంఘంలో బ్రెజిల్ ప్రతినిధివర్గం ఎంతో కృషిచేసింది. సమితి సర్వసభ్య సంఘం సాధించిన అనేక మహత్కార్యాలు చిన్న రాజ్యాల కృషి ఫలితమే!

సాంఘికోపసంఘం అంటూ మరొక సంఘం వుంది. సామాజిక పరిస్థితులను చక్కచేయడం ఈ సాంఘిక సంఘం చేయవలసిన పని. నేరాలకు కారణాలేమిటి? ఆ కారణాలను తొలగించడానికి ఏం చేయాలి? కారాగార బద్ధులైన నేరస్థులను ఎలా చూడాలి? ప్రజలకు వసతిగల గృహాలను లభింపచేయడానికి ఏం చేయాలి? పనివారికి వృద్ధాప్యంలో పెన్షన్లు, ప్రమాదాలకు లోనైనప్పుడు భీమాపరిహారం చెల్లింపుకు ఎక్కడెక్కడ ఎలాంటి శాసనాలు చేయించాలి? ఈ ప్రశ్న లన్నింటినీ విచారించి వీటిని సాధించడానికి కృషి చేయవలసిన బాధ్యత ఈ ఆర్థిక, సాంఘిక సంఘానికి చెందిన సాంఘికోపసంఘానిది. ప్రజా సేకరణకు అంకితమైన అనేక అధికార సంస్థలున్నవి. ఈ సంస్థలకు సమితి సహాయక పునరుద్ధరణ నిధినుండి సహాయాన్ని లభింపచేయడం కూడా ఈ సంఘం నిర్వర్తించే విధులలో ఒకటి.

పాపల యోగక్షేమాలను విచారించేందుకు ఈ సాంఘికోపసంఘం ఒక సబ్ కమిషన్ ఏర్పాటు చేసింది. పిల్లలలో నేరప్రవృత్తి ఏర్పడకుండా అవసరమైన కట్టుదిట్టాలు చేయిస్తుంది. నేరాలుచేసేపిల్లలను సంస్కరించేందుకు, ప్రత్యేక పాఠశాలలను స్థాపించేందుకు సహాయ పడుతుంది. పేదవారి పిల్లలకు వుచితంగా విద్యాబోధనకు తగిన ఏర్పాట్లు చేయడానికి ప్రయత్నిస్తుంది.

క్రిందటి యుద్ధంలో ఎందరో తమయావత్తు ఆస్తిపాస్తులను కోల్పోయినారు. ఎట్టి ఆధారాలూ లేకుండా పోయినవి. వృత్తులు పోయినవారు ఎందరో వున్నారు. తమ సంగతి ఏమిటో విచారించుకోలేని తలితండ్రులు తమ పిల్లలను ఏంచేస్తారు? తగిన పోషణలేక లక్షలాది పసిపాపలు వ్యాధిగ్రస్తులై పోయినారు. వీరికి తింటానికి తిండికూడా లేదు. సమితికిచెందిన సహాయక పునరుద్ధరణ సంఘం కొంతకాలం వీరికి సహాయంచేస్తూ వచ్చింది. తరువాత ఆర్థిక, సాంఘిక సంఘం సిఫార్సులను అనుసరించి అంతర్జాతీయ పిల్లల అత్యవసర సహాయక నిధిని సమితి సర్వసభ్యసంఘం ఏర్పాటు చేసింది. ఎలాంటి ఆర్థిక స్తోమతులేని పిల్లలకు ఆహారాన్ని, బట్టను కొని పంచుతూ వుంటుంది. ఈ నిధి పాలకసంఘం వివిధ దేశాల్లో పిల్లలకు ప్రత్యేకంగా వైద్య, చికిత్సాలయాలను ఏర్పాటు చేస్తుంది. ఈ సహాయక నిధికి ఎవరైనా విరాళాలు పంపవచ్చును. సమితి ప్రధాన కార్యదర్శికి పంపితే ఆ విరాళాలు పిల్లల సహాయనిధికి జమ అవుతవి.

ఇవిగాక, రాకపోకల రవాణా కమీషనుల కమిటి వుంది. నౌకలు, విమానాలు, రైళ్లు మొదలైన వాటి రాకపోకలకు, రవాణాకు సంబంధించిన కొన్ని శాసనాలను ఈ కమిషను తయారుచేస్తుంది. ఇదే విధంగా రేడియో ప్రసారాలు 'తంతి రవాణా'లు మొదలైన వార్తాప్రచారానికి ఉపకరించే ఇతరవాటికి సంబంధించి కూడా ఈ కమిషన్ ప్రత్యేక శాసనాలు చేస్తుంది.

వివిధ దేశాల ప్రతినిధులను సమావేశపరచి విదేశ ప్రయాణాల నిర్బంధాలను, రహదారి పత్రాలను జారీ చేయడంలో గల నిర్బంధాలను సడలించే విషయాన్ని పరిశీలించాలని ఈ కమీషను ఆర్థిక, సాంఘిక సంఘానికి సూచించింది. అంతర్జాతీయ తపాలాసంఘం ద్వారా, అంతర్జాతీయ టెలికమ్యూనికేషన్సు సంఘం ద్వారా ఈ కమీషను ఈ పనులన్నింటినీ సాధిస్తుంది.

ఈ రోజుల్లో ప్రతి దేశంలోనూ రేడియో ప్రసార కేంద్రాలున్నాయి. ఈ దేశాలన్నీ ఒకే మీటరు మీద (ఫ్రీక్వెన్సీస్) ప్రసారం చేస్తుంటే ఏ దేశం ప్రసారమూ సరిగ్గా వినిపించదు. ఏ దేశం ఏ యే మీటర్లమీద (వేవ్ లెంగ్తు్స) ప్రసారం చేయాలో ముందుగా చర్చించుకొని ఒక నిర్ణయానికి వస్తారు. ఈ పనినంతా టెలికమ్యూనికేషన్సు సంఘం చేస్తుంది. (ఈ ఫ్రీక్వెన్సీ నిర్ణయించే వుపసంఘానికి ఆంధ్రుడు అధ్యక్షుడుగా ఎన్నికైనాడు.)

ఆర్థిక, సాంఘిక సంఘం అనుబంధ సంఘం మరొకటి వుంది. అది ఉద్యోగ ఆర్థిక కమీషన్. ప్రతి దేశంలోనూ పనిచేయ శక్తిగలవారు, పనిచేయడానికి సిద్ధంగా వున్నవారు ఎందరో వున్నారు. అలాంటి వారందరికీ పని దొరికేటట్లు ప్రతి దేశమూ చర్యలు తీసుకునేందుకు ఈ ఆర్థిక కమీషన్ ప్రోత్సహిస్తుంది. మరొక ఆర్థికమాంద్యం ఏర్పడితే మళ్ళీ కోట్లాది ప్రజలు పనిపాటలు లేకుండా పోతారు. ఆ ప్రమాదం ఏర్పడకుండా చూడ్డం ఈ ఆర్థిక కమీషన్ నిర్వర్తింపవలసిన ప్రధాన విధులలో ఒకటి. దారిద్ర్యంపై యుద్ధం ప్రకటించి ప్రపంచంలో 'లేమి' అనేది లేకుండా చేయడానికి ఏ యే చర్యలు తీసుకోవాలో ఈ కమీషన్ విచారిస్తుంది. ప్రజల జీవన ప్రమాణాన్ని వృద్ధిచేయడం ఉద్యోగ, ఆర్థిక కమీషన్ నిర్వహింపవలసిన బాధ్యతలలో అత్యంత ముఖ్యమైంది. చాలా వెనుకబడివున్న దేశాల విషయమై ఈ కమీషను ఎక్కువ శ్రద్ధవహిస్తుంది.

ఇవన్నీగాక ద్రవ్య సంఘం అనేది ఒకటి వుంది. ప్రజల వద్దనుంచి పన్నుల రూపేణ ధనాన్ని ఎలా వసూలుచేయాలి. అలా వసూలుచేసిన ధనాన్ని ప్రజలకు ఎక్కువ ప్రయోజనకరంగా వుండేటట్లు ఖర్చుచేయడం ఎలా అన్న సమస్యలను విచారించి ప్రపంచ దేశాలకు సిఫార్సులుచేయడం ఈ ద్రవ్య సంఘం (ఫిస్కల్ కమిషన్) నిర్వర్తించే పని. ప్రభుత్వాలు దూరదృష్టి, దూరాలోచన లేకుండా ప్రజలను పీల్చివేసే పన్నులను విధించడంవల్ల ప్రజల ఆర్థిక స్థితి ఎన్నటికీ చక్కబడే

అవకాశం వుండదు. దేశపరిస్థితుల అభివృద్ధికూడా ఆ దేశ ప్రభుత్వ పన్ను విధానం మీాదే ఎక్కువగా ఆధారపడి వుంటుంది.

వీటన్నింటికంటే ముఖ్యమైన మరొక సంఘం వుంది. అది గణాంక కమిషన్. ఇది కేవలం లెక్కలకు సంబంధించింది. ఈ కమిషన్ కార్యక్రమం మీాకు విసుగుపుట్టిస్తుంది. ఏ దేశంలో ఏయే వస్తువులు ఎంతెంత వుత్పత్తి అవుతున్నవి? అక్కడ ఏయే ధాన్యాలు ఎంతెంత పండుతవి? ఆ దేశంలో ప్రజలు స్వంతానికి ఏయే సరుకు ఎంతెంత వాడుతారు? ఈ లెక్కలన్నింటినీ సేకరించి, సంపుటీకరించడం ఈ కమిషన్ చేసేపని. (ఈ మధ్యనే భారత దేశంలో అంతర్జాతీయ గణాంక మహా సభ జరిగింది.)

మత్తు పదార్థాలకు సంబంధించి మరొక కమిషన్ వుంది. దీనికి కొన్ని ప్రత్యేక అధికారాలు వున్నవి. సమితి రాజ్యాలు చేసుకొన్న ప్రత్యేక ఒడంబడికల ద్వారా ఈ కమిషన్‌కు ఈ ప్రత్యేకాధికారాలు లభించినవి. నల్లమందు, గంజాయి మొదలైన మత్తు పదార్థాలను కంట్రోలు చేయించడానికి ఈ కమిషన్ ప్రయత్నిస్తుంది. చట్ట విరుద్ధంగా, నైతిక సూత్రాలకు విరుద్ధంగా మత్తు పదార్థాలను విక్రయించేవారిని పట్టివేయడానికి ఏయే ప్రభుత్వం ఏయే పనులు చేయవలసి వుండేదీ ఈ కమిషన్ సూచిస్తుంది.

ఈ కమీషన్లు అన్నింటిలోనూ పదిహేను ఇరవైమంది వరకూ సభ్యులు వుంటారు. వీరందరూ ఆ యా విషయాల్లో

ప్రత్యేక ప్రావీణ్యం గలవారు. ఈ వివిధ కమిషన్లకు ఏ యే దేశాలను ఎన్నుకోవాలో ఆర్థిక, సాంఘికసంఘం నిర్ణయిస్తుంది. ఈ కమిషన్లోని 18 దేశాలూ ఇన్ని కమిషన్లకు సభ్యులను ఎన్నుకుంటుంది. ఏ దేశం ఎన్నికైతే ఆ దేశం ఆ కమిషన్లలో ఎవరు తన ప్రతినిధిగా వుండాలో నిర్ణయించుకుంటుంది.

ఆర్థిక, సాంఘిక కమిషన్‌కు సంబంధించిన ఈ వివిధ కమిషన్లుగాక అనేక శాఖలుకూడా వున్నవి. ఎప్పుడవసరమైతే అప్పుడు అందుకు సంబంధించిన ప్రత్యేక శాఖను ఆర్థిక సాంఘిక కమిషన్ సమితి ప్రణాళికవల్ల సంక్రమించిన అధికారంతో ఏర్పాటు చేయవచ్చు. ప్రపంచ రాజ్యాలు అనేక వ్యవహారాలకు సంబంధించి ఎన్నో ఒడంబడికలు చేసుకున్నవి. ఈ ఒడంబడికల ఫలితంగా ఎన్నో అంతర్జాతీయ సంఘాలు ఏర్పడ్డవి.

అంతర్జాతీయ కార్మికసంఘం ఏర్పడి ఇప్పటికి ఎన్నో సంవత్సరాలైంది. ప్రపంచ రాజ్యాలు చేసుకున్న ఒడంబడికల ఫలితంగానే ఈ అంతర్జాతీయ కార్మికసంస్థ ఏర్పడింది. అమెరికా నానాజాతి సమితిలో చేరక పోయినప్పటికి ఈ కార్మిక సంస్థలో చేరింది. ఈ సంఘాలు, సంస్థలు కొన్ని ప్రత్యేక పనులు పెట్టుకొని వ్యవహరిస్తుంటవి.

ప్రపంచ ప్రజల ఆరోగ్యం. రైతులు తమ భూములను సాగుచేసే పద్ధతులు, విమానయాన మార్గాలు ఇవన్నీ ఈ ఆర్థిక, సాంఘిక సంఘాన్ని కలవరపెడుతూ వుంటవి. ఈ సమస్యలన్నింటినీ ఈ సంఘానికి చెందిన వివిధశాఖలు పరిష్క-

రిస్తూవుంటవి. ఇలాంటి అంతర్జాతీయ సంఘాలు మరెన్నింటినో స్థాపించేందుకు ఆలోచనలు జరుగుతున్నవి.

ఈ వివిధ సంస్థలు, సంఘాలు ఆర్థిక, సాంఘిక కమిషన్‌తో ప్రత్యేక ఒడంబడికలు చేసుకొని సమితి అధీన సంఘాలు కావచ్చును. ఆ విధంగా సమితి అధీన సంఘాలుగా మారిన సంఘాలకు సమితి ద్రవ్యసహాయంకూడా చేస్తుంది. ఇలాంటి ప్రత్యేక సంఘాలు ఎన్నో వున్నవి. ప్రతి ఒక్క సంఘానికి ప్రత్యేక నియమాలు, నిబంధనలు వుంటవి. వీటికి ఒక సర్వ సభ్యసంఘం, ఒక ప్రత్యేక కార్యాలయం, ఒకే ప్రధాన వుద్యోగి మొదలైనవన్నీ వుంటవి. ఈ ప్రత్యేకసంస్థలు కోట్లకు కోట్లు డాలర్లు వసూలుచేసి ప్రజల ఆర్థిక, ఆరోగ్య, వైజ్ఞానిక, విద్యా విషయిక, సాంఘిక పరిస్థితులను బాగుచేయడానికి ఖర్చుచేస్తూవుంటవి.

ఈ సంఘాలన్నీ దాదాపు సర్వ స్వతంత్రమైనవే. వీటిపై మరో సంఘం అజ్మాయిషీ వుండదు. ఈ సంఘాల్లో ఏ యే దేశాలకు సభ్యత్వం వుంటుందో ఆ యా దేశాలకు మాత్రమే ఈ సంఘ వ్యవహారాలపై అజ్మాయిషీ అధికారం వుంటుంది. సమితి సర్వసభ్యసంఘంకూడా వీటిపై అధికారం చలాయించదు. వీటికి అవసరమైనప్పుడు సహాయం చేస్తూవుంటుంది.

ఆర్థిక, సాంఘిక కమిషన్ తన పరంగావున్న ఈ వివిధ సంఘాల, సంస్థల పనులను సమన్వయం చేస్తూ, ఈ సంఘాలు పంపే నివేదికలను పరిశీలిస్తూ వీటిని అనుసరించి

ఎవరెవరు ఏ యే పనులు చేయవలసి వుంటుందో తీర్మానించి ఆ ప్రకారం చేయవలసిందిగా సిఫార్సులు చేస్తూ వుంటుంది.

ఆర్థిక, సాంఘిక కమిషన్ సేకరించిన యావత్తు భోగట్టాను విషయ ప్రధానంగా మార్చి అచ్చు వేయించి భద్రతామండలికిగాని, సమితి సర్వసభ్య సంఘానికిగాని పంపితే, ఆ కార్యక్రమం అమలు జరిగేటట్లు చూడవలసిన బాధ్యత ఈ క్రింది సంఘాలపైన వున్నది.

సైనికాధికారాలంటూ ఏమీ లేకపోయినా ఈ ఆర్థిక, సాంఘిక కమిషన్‌కుగల నైతికాధికారం అపరిమితం. కనుకనే, ఈ సంఘం చేసే ప్రతిపాదనలను ప్రతి ఒక్క దేశమూ గౌరవిస్తూ వుంటుంది. అసలు సమితి ప్రణాళికను ఆమోదించినప్పుడే ప్రతి దేశమూ ఆ ప్రణాళిక నిర్దేశించే వాటినన్నింటినీ అంగీకరించి అమలు చేయగలమని ప్రతి ప్రభుత్వమూ హామీ ఇచ్చి వుంది. సమితిలో చేరిన ప్రతిదేశమూ సమితి సర్వసభ్య సంఘంతోనూ, ఆర్థిక, సాంఘిక కమిషన్‌తోనూ సహకరింపగలదని సమితి ప్రణాళిక స్పష్టం చేసింది. ఈ సంఘాలు చేసే తీర్మానాలను అంగీకరించి అమలు జరపవలసిన నైతిక బాధ్యత ప్రతి దేశానికీ వుంది.

ఆర్థిక, సాంఘిక కమీషన్ ఏదో ఒకదేశాన్ని పేర్కొని ఆ దేశంపట్ల మిగతా రాజ్యాలు ఎలా ప్రవర్తించాలో నిర్ణయించే అధికారంతో వ్యవహరించలేదు. "స్పెయిన్‌కు ప్రపంచరాజ్యాలు ఉక్కు, ఇనుము మొదలైన సరుకును, ముడి పదార్థాలను సప్లయిచేయరాదు," అని ఈ సంఘం తీర్మానించ

లేవు. ఈ పని చేయవలసింది భద్రతామండలి. కాని "శాంతియుత కార్యక్రమాలకు మాత్రమే ఉక్కు, ఇనుము మొదలైనవాటిని వుపయోగించే దేశాలకే వాటిని విక్రయించాలి," అని ఆర్థిక, సాంఘిక సంఘం తీర్మానించవచ్చును.

ఈ విధంగా ఈ సంఘం సిఫార్సుచేస్తే ఈ సిఫార్సును కొన్ని రాజ్యాలు అలక్ష్యం చేయవచ్చు. తన సిఫార్సులను ఏ దేశం ఎంత వరకు అమలుచేసిందీ నివేదింపమని అన్ని దేశాలనూ ఈ కమీషన్ అడుగుతుంది. ఏ దేశాలు అమలు జరుపలేదో ఆ దేశాల ప్రవర్తనను ఈ సంఘం సమితి సర్వ సభ్య సంఘానికి ఆక్షేపణ తెలుపుతుంది.

ఈ విధంగా ఏ దేశ ప్రభుత్వమూ తనపై సమితి సర్వ సభ్య సంఘానికి ఒక సంఘం ఫిర్యాదుచేయడాన్ని సహించదు. కాబట్టే, ప్రతి దేశమూ అవకాశం వున్నంత వరకు ఆర్థిక, సాంఘిక సంఘ సిఫార్సులను అనుసరించి చర్యలను తీసుకుంటూనే వుంటుంది. అలా తీసుకోలేని పరిస్థితుల్లో అలా ఎందుకు చేయవలసివచ్చిందీ ఆర్థిక, సాంఘిక సంఘానికి సంజాయిషీ చెప్తూనే వుంటుంది.

ఇన్ని గురుతర బాధ్యతలను నిర్వహించవలసివుండటం వల్ల ఈ సంఘానికి క్షణం తీరిక వుండదు. ఈ సంఘమూ, దీని అనుబంధ సంఘాలూ వాటి పనులను శ్రద్ధగా, సక్రమంగా నిర్వహిస్తే ప్రపంచ ప్రజలు చీకూ చింతా లేకుండా కాలక్షేపం చేయగలరు. ప్రపంచ ప్రజలందరూ సుఖంగావుంటే యుద్ధాలకుగాని, వాటిని గురించిన ఆలోచనలకుగాని తావేలేదు.

అధ్యాయం ౬

# ధర్మకర్తృత్వసంఘం

## పరాధీన ప్రజల సంరక్షక కర్త

ప్రపంచ జనాభాలో దాదాపు నాల్గవవంతు ప్రజలు పరాధీనులై వుంటున్నారు. ఈ దేశాలు అనేక దశాబ్దాలుగా వలసలుగా వుంటున్నవి. ప్రజలు అస్వతంత్రులు. ఇతర రాజ్యాలు ఈ దేశాలను పాలిస్తూవున్నవి.

మొదటి ప్రపంచ యుద్ధానికి ముందు జర్మనీ, టర్కీల పరంగా ఎన్నో దేశాలు వలసలుగా వుంటున్నవి. ఆ యుద్ధం ముగిసిన తరువాత విజయంపొందిన మిత్రరాజ్యాలు కొన్ని ఈవలసలను నానాజాతి సమితిద్వారా స్వాధీన పరుచుకున్నవి. రెండవ ప్రపంచ యుద్ధంలో జపాన్, ఇటలీ వలసలు కొన్ని మిత్రరాజ్యాలకు సంక్రమించినవి. ఈ వలసలను ఏమి చెయ్యాలి అన్నది ఒక పెద్ద సమస్య. ఈ సమస్యను పరిష్కరించేందుకు ఐక్యరాజ్య సమితి ధర్మకర్తృత్వ సంఘాన్ని ఏర్పాటుచేసింది.

ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరం జర్మనీ, టర్కీల వలసలను ఏమి చేయాలి అన్న ప్రశ్న ఉదయించింది. నానాజాతి సమితి అప్పుడు "మాండేట్స్" అనే కొత్తరకం దేశాలను సృష్టించింది. మిత్రరాజ్యాలు కొన్ని నానాజాతి సమితి తరఫున యీ వలసలను పాలిస్తూ వాటి సంరక్షణ బాధ్యతను వహించాలని నిర్ణయింపబడింది. ఆ నిర్ణయాన్ని అనుసరించే

పాలస్తీనాపై, ఇంగ్లండ్, సిరియాపై ఫ్రాన్సు ప్రాజాపత్యం వహించినవి. ఆఫ్రికాలోని జర్మనీ వలసలను బ్రిటన్, ఫ్రాన్సులు పంచుకున్నవి. పసిఫిక్ మహాసముద్రంలోని న్యూగినీ ఆస్ట్రేలియాకు, ఇతర జర్మను వలసలు జపాన్‌కు సంక్రమించినవి. ఈ ఏర్పాటును న్యాయసమ్మతం చేయడానికి నానాజాతి సమితి కొన్ని సూత్రాలను తయారు చేసింది. నానాజాతి సమితి ఆదేశాలను అనుసరించి ఈ ప్రాజాపత్య రాజ్యాలు వలస దేశాలను పాలిస్తూ వుండాలనే సిద్ధాంతం తయారైంది.

కాని, ఈ ఏర్పాటు అంత తృప్తికరంగా జరగలేదు. ఈ వలసలపై ప్రాజాపత్యం వహించిన రాజ్యాలు సమితి విధించిన షరతులను, ఏర్పాటుచేసిన నిబంధనలను ఎంత వరకు పాటిస్తున్నవో విచారించేందుకు నానాజాతి సమితి ఒక పరిశీలక సంఘాన్ని నియమించింది. జపాన్ పరంగా వున్న వలసలలో పరిస్థితులను పరిశీలించేందుకు ఈ సంఘం వెళ్ళింది. కాని, జపాన్ ప్రభుత్వం ఈ సంఘాన్ని ఆ వలస దేశాల్లో అడుగు పెట్టనివ్వలేదు. జపాన్ యీవిధంగా ప్రవర్తించడానికి కారణం లేకపోలేదు. సమితి నిబంధనలకు విరుద్ధంగా జపాన్ యీ వలసలను సైనిక కేంద్రాలుగా తయారుచేసింది. యీ రహస్యం బయట పడిపోతుందేమోనని జపాను సమితి పరిశీలక సంఘాన్ని అక్కడ అడుగు పెట్టనివ్వలేదు.

ఇక బ్రిటన్, ఫ్రాన్సులు వాటి పరంగావున్న వలసలను స్వంత ఆస్తులుగా చూస్తూవచ్చినవి. ప్రథమ ప్రపంచ సంగ్రామం నుంచి రక్షిత రాజ్యాలుగానే వుంటూవచ్చిన దేశాలు ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరం కూడా అలాగే వుండిపోవలసి వచ్చింది. అయితే, నానాజాతి సమితి ఏర్పరచిన పద్ధతికి, ఐక్యరాజ్య సమితి ఏర్పరచిన పద్ధతికి కొంత తేడా వుంది. ఆ వెనుకటి విధానంకంటె ఇప్పటి విధానం తృప్తికరంగా వుండవచ్చును.

ఐక్యరాజ్యసమితి ఏర్పాటు చేసిన ధర్మకర్తృత్వ సంఘానికి వెనుకటి రక్షిత రాజ్యాలపైనే గాక, ద్వితీయ సంగ్రామానంతరం మిత్రరాజ్యాల పరమైన ఇటలీ, జపాన్ వలసలపై కూడా అధికారం వుంది. ఈ వలస దేశాలకు ధర్మకర్తగా వ్యవహరించే దేశం ధర్మకర్తృత్వ సంఘంతో ఒక ప్రత్యేక ఒడంబడిక చేసుకుంటుంది. ఆ ఒడంబడికద్వారా ఈ ప్రాజాపత్య రాజ్యాలపై ధర్మకర్తృత్వ సంఘానికి అధికారం సంక్రమిస్తుంది. ధర్మకర్తృత్వంవహించే దేశాలు ఈ రక్షిత రాజ్యాల విషయంలో ఎలా వ్యవహరించాలో ఈ ఒడంబడిక సూచిస్తుంది. ప్రతి ఒక్క వలసకూ ఒక ప్రత్యేక ఒడంబడిక వుంటుంది.

ప్రాజాపత్యంక్రింద వుంటున్న దేశాల్లోని ప్రజల అభిమతం తెలుసుకోవడం గురించి మాత్రం ఈ ఒడంబడికల్లో ఏమీ లేదు. ధర్మకర్తృత్వం వహించిన రాజ్యాల విధానాలపైనా, పరిపాలనా పద్ధతులపైనా స్థానికప్రజలు తమ అభిప్రాయాలను

ప్రకటిస్తూనే వుంటారు. కాని ధర్మకర్తృత్వం వహించిన దేశం వీటిని వినిపించుకోదు.

ఈ ధర్మకర్తృత్వం క్రిందవుంటూవున్న దేశాల్లో రెండురకాలు వున్నవి. యుద్ధనిర్వహణ, సైనికవ్యూహం దృష్ట్యా కొన్ని ప్రాంతాలకు భౌగోళిక ప్రాధాన్యం విశేషంగా వుంటుంది. ఈ ప్రాంతాలు మొదటితరగతికి చెందినవి. ఈ ప్రాంతాల్లో అవసరం ఏర్పడితే యుద్ధనౌకలను, యుద్ధ విమానాలను, సైనిక దళాలను వుంచవచ్చు. అందుకు తగిన రేవులు, విమానాశ్రయాలు ఈ దేశాల్లో వుంటవి. అయితే, ప్రస్తుతం ధర్మకర్తృత్వం క్రిందవున్న దేశాల్లో ఈ విధంగా వుపయోగపడే దేశాలు చాలా తక్కువ.

ఇలాంటి దేశాలకు సంబంధించిన ధర్మకర్తృత్వ ఒడంబడికలను భద్రతామండలి ఆమోదించవలసి వుంటుంది. ఈ ఒడంబడిక షరతులు మండలికి తృప్తికరంగా లేకపోతే ధర్మకర్తృత్వం వహిస్తానంటూ యీ ఒడింబడికను తయారు చేసిన రాజ్యాన్ని ఒడంబడికను ఫలానా విధంగా సవరించమని భద్రతామండలి కోరవచ్చును.

సైనికదృష్ట్యా ప్రధానం కానటువంటి వలసలకు సంబంధించిన దేశాల ఒడంబడికలను సమితి సర్వసభ్య సంఘం ఆమోదించాలి. ధర్మకర్తృత్వ దేశాలు పంపిన అనేక ఒడంబడికలను సర్వసభ్య సంఘం పాలితరాజ్యాలకు అనుకూలంగా మార్చి వేసింది.

ఈ ధర్మకర్తృత్వ పద్ధతిని అమలుజరపడంలో పెద్ద గొడవలుగాని, డొంకతిరుగుడు మార్గాలుగాని ఏమీ లేవు. పాలిత రాజ్యాలపై ధర్మకర్తృత్వం ఒకే దేశంగా గాని, లేక కొన్ని దేశాలు జాయింటుగాగాని, లేక ధర్మకర్తృత్వసంఘమే స్వయంగాగాని వహించాలని సమితి సర్వసభ్యసంఘమే నిర్ణయిస్తుంది. ధర్మకర్తగా వ్యవహరించే దేశంగాని, దేశాలుగాని వాటి పరిపాలనా పద్ధతులను పరీక్షించే అధికారం ధర్మకర్తృత్వ సంఘానికి వున్నదని అంగీకరించాలి. ధర్మకర్తృత్వ సంఘం ఇచ్చే సలహాలను పాలిస్తామని హామీ ఇవ్వాలి.

ధర్మకర్తృత్వ సంఘంలో ఏ యే దేశాలకు సభ్యత్వం వుంటుంది? ధర్మకర్తలుగా వ్యవహరించే రాజ్యాలన్నిటికీ ఇందులో సభ్యత్వం వుంటుంది. ధర్మకర్తగా వ్యవహరించక పోయినా అగ్రరాజ్యాలు అయిదింటిలో ప్రతి ఒక్క రాజ్యానికి ఇందులో సభ్యత్వంవుంది. ఈ దేశాలుగాక ధర్మకర్తలుగావుండే దేశాలు ఎన్నో, ధర్మకర్తృత్వ బాధ్యతలు లేని దేశాలు అన్నీకూడా ఈ సంఘ సభ్యత్వానికి ఎన్నిక అవుతవి. అంటే ఈ రెండు తరగతుల రాజ్యాలకూ ఈ సంఘంలో సరిసమానబలం వుంటుంది.

ఐక్యరాజ్య సమితి అవతరణానంతరం ఏర్పడ్డ ప్రప్రథమ ధర్మకర్తృత్వ సంఘంలో ఈ రాజ్యాలకు సభ్యత్వంవుంది: ఆస్ట్రేలియా, బెల్జియం, ఫ్రాన్సు, న్యూజిలాండ్, బ్రిటన్. ఈ అయిదురాజ్యాలూ ధర్మకర్తలుగా వ్యవహరిస్తున్నవే. ధర్మకర్తలుగావుండని దేశాలు: బ్రిటన్, ఫ్రాన్సులుగాక, మిగతా

మూడు అగ్రరాజ్యాలు: అమెరికా, రష్యా, చైనా. ఎన్నికైన దేశాలు. ఇరాక్, మెక్సికో.

ఇది చాలామంచి పథకం. ధర్మకర్తలుగావుండే దేశాలకు మాత్రమే ఈ సంఘంలో సభ్యత్వంవుంటే, ఇదంతా దొంగలు దొంగలుచేరి వూళ్ళు పంచుకున్నట్లు వుంటుంది. ఈ రాజ్యాలు లాలూచీపడి ఒకదాని అక్రమాలను మరొకటి సమర్థిస్తూ, కప్పిపుచ్చుతూ వస్తవి. ధర్మకర్తలంతాచేరి ధర్మకర్తృత్వం క్రిందవున్న ప్రజలనువదలి స్వప్రయోజనాలకు ఈ వలసలను వుపయోగించుకో వచ్చును. ఇలాంటి అక్రమాలకు ఇప్పటి ధర్మకర్తృత్వ సంఘంలో అవకాశంలేదు.

ఈ సంఘంలో ఎన్ని దేశాలకు సభ్యత్వంవుంటె అన్ని దేశాల ప్రతినిధులుమాత్రమే ధర్మకర్తృత్వ సంఘంగా వ్యవహరిస్తారు. ఒక్క దేశానికి ఒక్క వోటు మాత్రమే వుంటుంది. ఎంత ముఖ్య విషయంమీద తీర్మానం చేయా లన్నా మామూలు మెజారిటీవుంటే చాలు. ఇక్కడ అగ్ర రాజ్యాల వీటో అధికారం పనిచేయదు.

సంఘ సభ్యులంతాచేరి సంఘాధ్యక్షుణ్ణి ఎన్నుకుంటారు. సంఘ నిబంధనలను, నియమావళిని సభ్యులే నిర్ణయించు కుంటారు. సభ్యుల్లో మెజారిటీ సభ్యులు కోరినప్పుడల్లా ఈ సంఘం సమావేశం అవుతూ వుండవలసిందే.

ధర్మకర్తలుగా వ్యవహరించే రాజ్యాలకు ఈ సంఘం ఒక ప్రశ్నావళిని పంపుతుంది. "క్రిందటి సంవత్సరం మీ పరంగావున్న వలసదేశాలలో ఎన్ని పాఠశాలనుల

ఏర్పాటుచేశారు ? స్థానిక స్వపరిపాలనాధికారం గల సంస్థలను ఎన్నింటిని స్థాపించారు ? ఈ సంస్థలకు ప్రజలు ప్రతినిధులను ఎన్నుకునేందుకు మీరు కల్పించిన సౌకర్యాలేమిటి ? స్వపరిపాలనలో ప్రజలు అనుభవం పొందడానికి మీ రిచ్చిన అవకాశాలు ఏమిటి ?" ధర్మకర్తృత్వ సంఘం అడిగే ఈ ప్రశ్నలన్నింటికీ ధర్మకర్తదేశాలు సమాధానాలు పంపాలి. ప్రతి సంవత్సరం తన పరంగావున్న దేశాల్లో తను ఏంచేసిందీ వివరిస్తూ ధర్మకర్తదేశం ఈ సంఘానికి ఒక నివేదిక పంపాలి.

ధర్మకర్తృత్వ సంఘం వీటన్నింటినీ పరిశీలించి, సమగ్రంగా చర్చించి తన రిమార్కులతో భద్రతా మండలికి గాని, సమితి సర్వసభ్య సంఘానికిగాని పంపుతుంది.

వలసదేశాల్లోని పరిస్థితులను తెలుసుకునేందుకు ఈ సంఘం ధర్మకర్త రాజ్యాలు పంపే నివేదికలపైనే ఆధారపడి వుండదు. వలసదేశాల్లో ఏ దేశానికైనా ధర్మకర్తృత్వ సంఘం ఒక విచారణ కమిషన్‌ను పంపవచ్చును. ఈ కమిషన్‌ను ఏ దేశమైనా బహిష్కరించినా, ఈ కమిషన్ పై ఆంక్ష విధించినా ధర్మకర్తృత్వ సంఘం వెంటనే ఆ దేశంపై భద్రతా మండలికిగాని, సమితి సర్వసభ్య సంఘానికి గాని ఫిర్యాదు చేస్తుంది.

అసలు అంతవరకు వెళ్ళే అవసరంకూడా లేదు. పాలిత దేశాల ప్రజలు పాలక రాజ్యాలపైన సరాసరి ధర్మకర్తృత్వ సంఘానికి మహజర్లు పంపవచ్చును. ధర్మకర్తృత్వ ఒడంబడికలో ఈ షరతును చేర్చడం ధర్మకర్తలుగా వ్యవహరిస్తున్న

ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, దక్షిణాఫ్రికా ప్రభుత్వాలకు ఏంతమాత్రం రుచించలేదు. ఈ దేశాల ప్రజలకు మహజర్లను పంపే హక్కు మాత్రమే వుండాలిగాని, ఫిర్యాదుచేసే అధికారం వుండరాదని ఈ మూడు రాజ్యాల ప్రతినిధులు వాదించారు. కాని, అమెరికా, రష్యా ప్రతినిధులు మాత్రం వలస రాజ్యాల ప్రజలకు మహజర్లను పంపేహక్కుతో బాటు ఫిర్యాదులుచేసే హక్కుకూడా వుండాలని పట్టుబట్టినవి.

ఏదేశ ప్రజలైనా ఈ విధంగా ఫిర్యాదులు జరిపితే ధర్మకర్తృత్వ సంఘం వెంటనే అందుకు కారకులైన ధర్మకర్తలను సంజాయిషీ అడిగి, అందుపై ఏంచేయవలసిందీ భద్రతా మండలికీ, సమితి సర్వసభ్య సమావేశానికీ సిఫార్సు చేయవచ్చును. అసలు ఒడంబడికలోనే కొన్ని నిబంధనలు వుంటవి.

ప్రతి పాలకరాజ్యమూ తన అధీనంలోవున్న దేశాల్లో ప్రజలనుండి పన్నులరూపంలో సాలుకు ఎంతెంత వసూలు చేస్తున్నదీ, రహదారుల నిర్మాణానికి, పాఠశాలల స్థాపనకు, వైద్య సౌకర్యాలను, చికిత్సా సదుపాయాలను కల్పించడానికి ఎంతెంత ఖర్చుచేస్తున్నదీ ధర్మకర్తృత్వ సంఘానికి సమర్పించే వార్షిక నివేదికలో వివరించాలి. నేరాలు ఎక్కువగా వున్నవా? తక్కువగా వున్నవా? ఏయే నేరాలక్రింద ఎంతమందిని ఏ విధంగా శిక్షించారు అన్న వివరాలను కూడా తెలియ చేయాలి. ఈ విధంగా ప్రతి సంవత్సరం ధర్మకర్తృత్వ సంఘానికి నివేదికలను పంపగలమని ఈ రాజ్యాలన్నీ ధర్మకర్తృత్వ ఒడంబడికపై సంతకం చేసినప్పుడే వాగ్దానం చేసినవి.

అంతేగాదు; ఈ వలసలలో ఏ విధానాన్ని అనుసరించేదీ కూడా ముందుగానే స్పష్టంచేస్తవి. ఏ లక్ష్యాలతో వీటిని పాలించేదీ వివరిస్తవి. "పాలిత రాజ్యాలనుండి ఏ దేశమైనా ముడి పదార్థాలను దిగుమతి చేసుకోవడానికి మాకు అభ్యంతరం లేదు. ఏ దేశమైనా దాని సరుకును ఈ వలసలకు ఎగుమతిచేసి అమ్ముకోవచ్చును. ఏ ఒక్క దేశమూ ఈ వలసలపై పూర్తి హక్కు భుక్తాలు కల్గి వుండదు. అంటే అన్ని దేశాలకూ సమానమైన హక్కులు వుంటవి" అని ధర్మకర్తృత్వం వహించే రోజునే ఈ దేశాలు ప్రకటించినవి.

ధర్మకర్త రాజ్యాలు ఈ వలసలను స్థానిక ప్రజల అభివృద్ధి, అభ్యుదయం దృష్ట్యా పరిపాలించాలనే షరతుకూడా ఈ ఒడంబడికలో వుంది. ఈ ప్రజలను స్వపరిపాలనాధికారం స్వీకరించి వారి వ్యవహారాలను వారు చక్కబెట్టుకునేందుకు ధర్మకర్త దేశాలు తయారు చేయాలి. ఈ ప్రజలకు, ప్రపంచంలోని ఇతరప్రాంతాల ప్రజలకు ఏ యే హక్కులు అయితే వున్నవో అవన్నీ వుండాలని సమితి ప్రణాళికే స్పష్టం చేస్తున్నది.

ఇన్ని కట్టుదిట్టాలున్నా పాలిత దేశాల ప్రజల స్థితి బాగుపడాలంటే పాలక రాజ్యాలు ఎంతో ఔదార్యంతో, సుహృద్భావంతో ప్రవర్తించాలి. ధర్మకర్త రాజ్యాలు తల్చుకుంటే వలసప్రజల స్థితిని ఎంతో బాగు చేయవచ్చు. పాఠశాలలను, వైద్యశాలలను, యంత్రాగారాలను స్థాపించవచ్చును. నిరక్షరాస్యతను, అనారోగ్యాన్ని నిర్మూలించి

ప్రజల జీవన ప్రమాణాన్ని వృద్ధిచేయవచ్చు. స్థానిక సంస్థలను ఏర్పాటుచేసి ప్రజలకు స్వపరిపాలనలో శిక్షణను ఇవ్వవచ్చును. ధర్మకర్తృత్వ రాజ్యాలు ఈ పనులను చేయకపోతే భద్రతామండలి, సమితి సర్వసభ్య సంఘం, ధర్మకర్తృత్వ సంఘం ఎప్పటికప్పుడు ఈ రాజ్యాలకు తీవ్ర అధిక్షేపణాలను తెలుపుతూ వుంటవి.

అధ్యాయం ౮

# అంతర్జాతీయ న్యాయస్థానం

## కోర్టులలో ప్రపంచరాజ్యాల నేర విచారణ

మన పౌర జీవితాన్ని తీర్చి దిద్దే శాసనాలన్నింటినీ మన రాష్ట్రీయ, కేంద్ర శాసన సభలు తయారు చేస్తవి. ఈ శాసన సభలకు ప్రజలు తమ ప్రతినిధులను ఎన్నుకుంటారు. అనేక శాసనాలు ప్రజలు ఏవిధంగా ప్రవర్తించాలో సూచించవు గాని, ఏవిధంగా ప్రవర్తింపరాదో స్పష్టం చేస్తవి. ఒకరి ఆస్తిని మరొకరు దోచుకోవడం నేరం. ఒకరిని హత్యచేయడం ఏ పరిస్థితులలోనూ సమర్థనీయం గాదు. హంతకులను ఉరి తీయాలని అనేక దేశాల శాసనాలు నిర్దేశిస్తున్నవి.

శాసనాలను ధిక్కరించినవారిని ఎలా శిక్షించాలో కూడా ఆ శాసనాలు సూచిస్తవి. న్యాయస్థానాలు, పోలీసులు ఏ పరిస్థితులలో ఏం చేయాలో ఈ శాసనాలు సూచిస్తవి.

కొన్ని దేశాలమధ్య ప్రత్యేక ఒడంబడికలు వున్నవి. ఈ ఒడంబడికలు ఆయా దేశాలమధ్య సంబంధాలు ఎలా వుండాలో వివరిస్తవి. వీటిని అంతర్జాతీయ శాసనాలంటారు. అయితే, ఈ శాసనాలు సవ్యంగా అమలు జరుగుతూ వున్నవో లేవో విచారించేందుకు, అమలు జరిపేందుకు, అంతర్జాతీయ రక్షక భట దళంగాని, కారాగారాలుగాని లేవు. 1945 వరకూ కూడా అంతర్జాతీయ శాసనాలను భంగించినవారిని శిక్షింప గలవారుగాని, శిక్షించేటందుకు పద్ధతులుగాని లేవు.

ఈ అంతర్జాతీయ శాసనాలు ఎలా తయారవుతవి ? దేశీయ శాసనాలను తయారు చేయడానికి ప్రతి దేశంలోనూ చట్టసభ లున్నవి. ఇదివరలో అంతర్జాతీయ చట్టసభ అనేది ఏమీ లేదు. ఆ కాలంలో అంతర్జాతీయ శాసనాలు మూడు విధాలుగా తయారవుతూ వుండేవి. మొదటి పద్ధతి వివిధ దేశాలు ప్రత్యేక ఒడంబడికలు చేసుకోవడం ద్వారా ఆ దేశాల సంబంధాలను నిర్ణయించడం. ఒక దేశం మరొక దేశంనుంచి ఏటా నలభై లక్షల టన్నుల కాఫీగింజలు కొనడానికి ఆ రెండు దేశాలూ ఒడంబడిక చేసుకుంటవి. మొదటి దేశం కాఫీగింజలు కొంటూ తను రెండవ దేశానికి ఎగుమతి చేసే మోటారుకార్లపై ఎక్కువగా ఎగుమతి పన్నులను విధింపనని హామీ ఇస్తుంది. ఈ ఒడంబడికను ఆ రెండు దేశాల ప్రభుత్వాలు అంగీకరించి, ఆ దేశాల శాసనసభలు ఆమోదించి ధృవపరచగానే ఒడంబడిక శాసనమైపోతుంది.

ప్రపంచంలోని అన్ని రాజ్యాలూ ఈ విధమైన పరస్పర సహాయక ఒడంబడికలను కుదుర్చుకున్నవి. ఏ రెండు దేశాల మధ్య సంబంధాలైనా ఈ విధమైన ఒడంబడికల ద్వారానే నిర్ణయమవుతవి. ఈ ఒడంబడికలు అన్నీ అంతర్జాతీయ శాసనాలైనవి.

వీటంత ముఖ్యంకానటువంటి అంతర్జాతీయ శాసనాలు ఇంకా రెండు రకాలు వున్నవి. ఆచారం, సంప్రదాయం బట్టి కూడా శాసనాలు తయారవుతవి. కొన్ని రాజ్యాలు కొన్ని కొన్ని పనులను ఒక పద్ధతిలో చేస్తూవుంటవి. క్రమంగా ఆ కార్యాచరణ పద్ధతి శాసన మవుతుంది. ఒక దేశానికి చెందిన నౌక కొన్ని సరుకులు తీసుకొని వెళ్తూవుంటే సముద్ర మధ్యంలో కొందరు దారిదోపిడి ముఠాలవారు అటకాయించి ఈ నౌకను దోచివేయడానికి ప్రయత్నిస్తారు. ఆ ప్రయత్నం విఫలమై వీరంతా నౌకాదళాధికారులకు చిక్కిపోతారు. వీరి నందర్నీ ఆ నౌకా ఉద్యోగులు తమ దేశం తీసుకుపోయి తమ శాసనాలను అనుసరించి శిక్షించవచ్చును. బందిపోటు దారులు ఏ దేశంవారు, ఏ జాతికి చెందినవారు అనే ప్రశ్న రానేరాదు.

ఇది ప్రపంచంలోని అన్ని రాజ్యాలు అంగీకరించిన శిక్షాస్మృతి. దొంగతనం చేసిన వార్ని, చేయడానికి ప్రయత్నించిన వార్ని శిక్షించాలన్న నిర్ణయం లోకజ్ఞానాన్ని బట్టి జరిగిందే. అంతర్జాతీయ శాసనాలు అనేకం లోకజ్ఞానంతో ప్రజలు ఏర్పాటు చేసుకున్న సంప్రదాయాలే.

ఈ విధంగా తయారయ్యే శాసనాలు గాక, వివిధ రాజ్యాల మధ్య సంబంధాలు ఎలా వుండాలి అనే విషయం మీద ప్రపంచ ప్రఖ్యాత న్యాయశాస్త్ర పారంగతులు సమగ్రంగా చర్చించి కొన్ని సూత్రాలను నిర్వచించారు. ఇవన్నీ గ్రంథస్తమై ప్రపంచరాజ్యాల మధ్య ఏర్పడిన ఒడంబడికల అన్వయంపై ఏర్పడే అనుమానాల పరిష్కారానికి వుపయోగపడ గలవు.

సమితి సభ్యత్వంగల రాజ్యాలన్నీ అవి చేసుకొన్న ఒడంబడిక ప్రతులను సమితికి సమర్పించాలని ప్రణాళిక నిబంధించింది. ఈ ఒడంబడిక లన్నింటినీ సమితి అచ్చొత్తించి అవసరానికి సిద్ధంగా వుంచుతుంది. ఒడంబడిక ప్రతులను ఎవరు కావాలన్నా సమితి కార్యాలయం పంపుతుంది. ప్రపంచంలోని పెద్ద పెద్ద గ్రంథాలయాలన్నింటిలోనూ ఈ ఒడంబడిక ప్రతులు వుంటవి.

కొన్ని దేశాలు రహస్య ఒడంబడికలు చేసుకుంటవి. ఇవి సామాన్యంగా బయటికి రావు. రిచ్లూ ఫ్రాన్సు ప్రధాన మంత్రిగా వున్నప్పుడు ఒక తమాషా జరిగింది. స్పెయిన్ ఇంగ్లండ్‌తో యుద్ధం చేయవలసివస్తే, ఫ్రాన్సు స్పెయిన్‌కు సహాయం చేయగలదని ఒక ఒడంబడిక చేసుకున్నారు. అలాగే ఇంగ్లండ్ స్పెయిన్‌తో యుద్ధం చేయవలసి వస్తే ఇంగ్లండ్‌కు ఫ్రాన్సు సహాయం చేయగలదని రిచ్లూ హామీ ఇచ్చాడు మరొక ఒడంబడిక ద్వారా. ఈ విధంగా పరస్పర విరుద్ధ ఒడంబడికలను కుదుర్చుకొని ఫ్రాన్సు అటు స్పెయిన్

నుంచి, ఇటు ఇంగ్లండ్ నుంచి కూడా ఎన్నో ప్రత్యేక సదుపాయాలను పొందింది. మొన్న మొన్నటి వరకూ ప్రపంచ రాజ్యాలు ఇలాంటి రహస్య ఒప్పందాలను చేసుకుంటూనే వున్నవి.

అయితే, అంతర్జాతీయ న్యాయస్థానం ఇలాంటి అవివేకమైన ఒడంబడికలలో చిక్కుకోదు. ఈ రహస్య ఒప్పందాలను ఈ న్యాయస్థానం అసలు పరిగణించనే పరిగణించదు. ఏ దేశమైనా సరే మరో దేశంతోగాని, మరి కొన్ని దేశాలతోగాని కుదుర్చుకున్న ఒడంబడిక ప్రతులను సమితికి పంపకపోతే అంతర్జాతీయ న్యాయస్థానం అట్టి ఒడంబడికలను లెక్కచెయ్యదు. ఈ విషయం సమితి ప్రణాళికే స్పష్టంచేస్తున్నది.

ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరం నానాజాతి సమితి ఈ అంతర్జాతీయ న్యాయస్థానాన్ని ఏర్పాటు చేసింది. నానాజాతి సమితి ఏర్పాటుచేసిన సంస్థల్లో ప్రపంచానికి ప్రయోజనకరంగా పనిచేస్తూవచ్చిన సంస్థ ఇదొక్కటే. గత పాతిక సంవత్సరాల్లోనూ ఈ న్యాయస్థానం దాదాపు 60 దావాలను విచారించింది. ఈ కేసుల్లో అంతర్జాతీయ న్యాయస్థానం ఇచ్చిన తీర్పులను అందుకు సంబంధించిన కక్షిదారులందరూ శిరసా వహించారుకూడా. ఒక్క అమెరికా మాత్రమే ఈ న్యాయస్థానంలో చేరకుండా వుండిపోయింది.

ఐక్యరాజ్య సమితి ఏర్పాటైన తరువాత ఈ అంతర్జాతీయ న్యాయస్థానం సమితి అంతర్భాగమై పోయింది. నానాజాతి

సమతి ఏర్పరచిన న్యాయస్థానానికీ, ఇప్పటి న్యాయస్థానానికీ తేడా ఏమీలేదు. న్యాయస్థానం పని సాఫీగా జరగడానికి వీలుగా నిబంధనలలో కొద్ది మార్పులుమాత్రం జరిగినవి.

సమితి ప్రణాళికను అంగీకరించి సమితిలో చేరిన ప్రతి దేశమూ ఈ అంతర్జాతీయ న్యాయస్థానాధికారాన్ని విధిగా అంగీకరించాలి. వెనుకటి అంతర్జాతీయ న్యాయస్థానంలో వివిధ దేశాలకు సభ్యత్వం వుండేది. ఇప్పుడు దేశాలకుగాక ఆ దేశాల ప్రతినిధులకే ఈ న్యాయస్థానంలో స్థానంవుంది. నానాజాతి సమితి న్యాయస్థానంలో ఏయే దేశాలకు స్థానం వుండాలో నిర్ణయిస్తే అప్పుడు ఆ దేశాలు న్యాయమూర్తులను నియమిస్తవి. ఇప్పుడు న్యాయమూర్తుల నియామకం ఆ విధంగా జరగదు. ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సంఘమే ఈ న్యాయమూర్తులను ఎన్నుకుంటుంది. సమితి సభ్యత్వం గల ప్రతిదేశం సమితి సర్వసభ్య సంఘానికి నలుగురు అభ్యర్థులను సూచిస్తుంది. ఆ నలుగురు ఆదేశీయులే కానవసరం లేదు. ఇద్దరు మాత్రం ఆదేశీయులుగా వుంటారు. మిగతా ఇద్దరూ విధిగా ఇతర దేశాల ప్రతినిధులై వుండాలి.

సామాన్యంగా ప్రతిదేశమూ తన ప్రతినిధిని ఒకరిని, ముగ్గురు ఇతర దేశాల ప్రతినిధులను సూచించడం జరుగుతుంది. ఈ విధంగా వివిధ దేశాలనుంచివచ్చే సూచనలను అన్నింటినీ భద్రతా మండలి పరిశీలిస్తుంది. ఈ ప్రతినిధులలో భద్రతా మండలి వోట్లు ఎక్కువవచ్చినవారు తిరిగి సమితి సర్వసభ్య సంఘంలో కూడా హెచ్చువోట్లను సంపాదించుకొన్న

తరువాత అంతర్జాతీయ న్యాయస్థానానికి ఎన్నిక అవుతారు. భద్రతామండలి, సర్వసభ్య సంఘం ఒకే ప్రతినిధిని ఎన్నుకో గలిగే వరకూ ప్రయత్నం జరుగుతూనే వుంటుంది. ఈ న్యాయ స్థానంలో 15 గురు న్యాయమూర్తు లుంటారు. వీరిలో ప్రతి మూడు సంవత్సరాలకూ ఒకసారి అయిదుగురు న్యాయ మూర్తులు ఎన్నిక అవుతూ వుంటారు. ఈ 15 మందిలో ఏ ఇద్దరూ ఒకదేశానికి చెందినవారు కారు.

ఈ న్యాయాధిపతులు ఏ దేశానికి చెందినవారు అన్నది అసలు ప్రధాన విషయం కానే కాదు. ఏ దేశానికి చెందిన వాడైనా ఆ న్యాయాధికారి స్వతంత్రంగా వ్యవహరించగల శక్తి, సామర్థ్యం కలవాడు కావాలి. ఫలానా దావాలో ఫలానా విధంగా తీర్పు ఇమ్మని ఏ దేశమూ తన ప్రతినిధిని ఆదేశించడానికి లేదు. అంతేగాదు. సమితి సర్వసభ్య సంఘం గాని, భద్రతామండలి గాని ఒకసారి న్యాయమూర్తులను ఎన్నుకున్న తరువాత వారి పదవీకాలం పూర్తి అయ్యేవరకూ వారిని భర్తఫ్ చేసే అధికారం ఆ సంఘాలకే లేదు.

ఒకసారి ఎన్నికైన న్యాయాధికారులు 9 సంవత్సరాలు ఆ పదవిలో వుంటారు. ఆ పదవీకాలం పూర్తికాగానే వారు తిరిగి ఎన్నికలకు నిలబడనూవచ్చు. ఈ న్యాయాధిపతులు ఎలాంటివారై వుండాలి? ఈ పదవులకు ఎన్నికకాగల వారికి వుండవలసిన అర్హతలేమిటి? మొదలైన విషయాలన్నీ ఈ న్యాయస్థాన నిబంధనలలోనే వివరింపబడి వున్నవి.

ఒక న్యాయాధికారి జబ్బు పడి న్యాయస్థాన కార్య క్రమాన్ని నిర్వహింపలేక పోవచ్చును. అయినా అట్టివ్యక్తి తన పదవికి రాజీనామా నివ్వకపోవచ్చును. అలాంటి పరిస్థితుల్లో మిగతా 14 మంది న్యాయమూర్తులూ చేరి ఈ వ్యక్తిని పదవినుండి తొలగిస్తూ తీర్మానం చేయవచ్చు. ఆవిధమైనతీర్మానం జరగ్గానే ఆ వ్యక్తి ఉద్యోగం రద్దయిపోతుంది. అలాగే ఏ న్యాయాధిపతి అయినా తన దేశప్రభుత్వం చెప్పినట్లు చేస్తే అట్టి అధికారినికూడా మిగతా న్యాయాధిపతు లందరూ చేరి బర్తరఫ్ చేయవచ్చును.

ఈ న్యాయాధికారులకు సమితి సర్వసభ్య సంఘమే జీతాలు చెల్లిస్తుంది. ఒక్కొక్క న్యాయాధికారికి సంవత్స రానికి 21,000 డాలర్లను చెల్లిస్తుంది. ఒకసారి నిర్ణయించిన తరువాత మధ్యకాలంలో ఈ జీతాలను తగ్గించడానికి వీల్లేదు.

ఈ న్యాయస్థానం రెండు దేశాలకు చెందిన వ్యక్తుల మధ్య ఏర్పడే తగాయిదాలను విచారించదు. రెండు దేశాలకు మధ్య ఏర్పడిన తగాయిదాలనే విచారిస్తుంది. అయితే ఈ విధమైన తగాయిదా ఏర్పడినట్లు యీ రెండు దేశాల్లో ఏదో ఒక దేశం న్యాయస్థానానికి ఫిర్యాదు చేయాలి.

సమితిలో చేరినా, చేరకపోయినాకూడా ఒక దేశం మరో దేశంపై ఈ న్యాయస్థానానికి ఫిర్యాదు చేయవచ్చును. అలా ఫిర్యాదు చేయడానికిముందు ఆ దేశం అంతర్జాతీయ న్యాయ స్థాన చట్టాన్ని ఆమోదించవలసి వుంటుంది. అయితే, ఇలాంటి

దేశాల విషయంలో భద్రతామండలి, సమితి సర్వసభ్య సంఘం ప్రత్యేక నిబంధనలను తయారు చేయవలసి వుంటుంది.

జనరల్ ఫ్రాంకో పాలనలోవున్న స్పెయిన్‌కు సమితి సభ్యత్వం నిరాకరింప బడింది. అయినా, స్పెయిన్ మరో దేశంపై అంతర్జాతీయ న్యాయస్థానం నియమ నిబంధనలను "అంగీకరించి" ఫిర్యాదు చెయవచ్చును. ఫ్రాంకో స్పెయిన్ అంతర్జాతీయ న్యాయస్థానంలో చేరినందువల్ల ఆ న్యాయస్థానానికి స్పెయిన్ వల్ల ఏర్పడే ప్రమాదం ఏమీ లేదు.

అసలు ఈ న్యాయస్థాన శాసనాన్ని ఆమోదించని దేశాలుకూడా తమ తగాయిదాలను అంతర్జాతీయ న్యాయస్థానానికి నివేదింపవచ్చును. అయితే, న్యాయస్థానం తీర్పులకు కట్టుబడి వుండగలమనిమాత్రం ముందుగా హామీ ఇవ్వాలి. ఈ ఒక్క విషయంలో, ఈ ప్రత్యేక సందర్భంలో సమితి ప్రణాళికను ఆమోదించినట్లు ముందుగా వ్రాసి ఇవ్వాలి.

ఏ తగాయిదాలునూ అంతర్జాతీయ న్యాయస్థానం దాని కది జోక్యం కల్పించుకోలేదు. కక్షిదారులు కోరితేగాని ఏ కేసులోనూ ప్రమేయం పెట్టుకునే అధికారం ఈ న్యాయస్థానానికి లేదు.

రెండు దేశాల మధ్య తగాయిదా ఏర్పడితే అందులో ఒక దేశంవాదిగా రెండవదేశంపై ఫిర్యాదు చేస్తూ న్యాయస్థానం రిజిస్ట్రారుకు ఒక నివేదిక పంపుతుంది. ఈయన వెంటనే ఈ విషయాన్ని ప్రతివాదికీ, సమితి రాజ్యాలకూ తెలియజేస్తాడు. ఏ దేశాన్ని అయినా కోర్టుకు హాజరు కావలసిందని సమన్సు

పంపే అధికారం న్యాయస్థానానికి లేదు. ఏ దేశాన్ని అయినా కోర్టులో హాజరు పరచే అధికారం ఎవ్వరికీ లేదు.

అయితే, న్యాయస్థానాధికారానికి సంబంధించి న్యాయస్థాన చట్టంలో 36 వ క్లాజు ఒకటి వుంది, ఈ క్లాజును ఏ దేశమైనా దానికి ఇష్టమైనప్పుడే అంగీకరింపవచ్చును. ఒకసారి ఆ నిబంధనను అంగీకరిస్తే ఇక కోర్టు అధికారంనుంచి విముక్తిలేదు. కోర్టు సమన్సు పంపినప్పుడల్లా హాజరవుతూ, కోర్టు తీర్పును అనుసరించి నడుచుకుంటూ వుండవలసిందే.

అమెరికాతోసహా అనేక రాజ్యాలు ఈ నిబంధనను అంగీకరించినవి. న్యాయస్థానానికి చేరిన ప్రతిఒక్క ఫిర్యాదునూ విధిగా విచారించాలనే నిర్బంధం ఏమీ లేదు. "ఈ వివాదం మేము విచారించవలసింది కాదు.," అని న్యాయాధిపతులు ఏ తగాయిదాను గురించి అయినా అభిప్రాయం ప్రకటిస్తే, "కాదు. మీరు విచారించి తీరవలసిందే," అని ఎవ్వరూ శాసించలేరు. అలాగే ఏ ఫిర్యాదుపైనైనా ఆ ఫిర్యాదు స్వభావాన్నిగురించికూడా అంతర్జాతీయ న్యాయస్థానం తన అభిప్రాయాన్ని తెలుపవచ్చు. "ఈ ఫిర్యాదులో పస ఏమీ లేదు. ఇందులో పెద్దగా విచారించవలసిందికూడా ఏమీ లేదు," అని తీర్పు ఇస్తే, అంతటితో ఆ ఫిర్యాదులో అంతర్జాతీయ న్యాయస్థానం జోక్యం అయిపోతుంది.

రెండు దేశాలు కుదుర్చుకున్న ఒడంబడికలు వున్నవి. అందులో ఒకదేశం ఈ ఒడంబడిక షరతులకు విరుద్ధంగా వ్యవహారం చేయవచ్చును. అలాగే అంతర్జాతీయంగా అంగీక

రింపజడిన సంప్రదాయాలను తిరస్కరించి ఒక దేశం ప్రవర్తించవచ్చు. అందువల్ల కొన్ని దేశాలకు ఈ దేశంతో పేచీ రావచ్చు. ఈ సందర్భాలన్నిటినీ వీటితో సంబంధంగల రాజ్యాలు అంతర్జాతీయ న్యాయస్థానానికి ఫిర్యాదుచేయవచ్చు.

ఈ విధమైన ఫిర్యాదులు అందగానే ఈ ఫిర్యాదుల్లో పేర్కొన్నట్లు ఆ యా సంఘటనలు జరిగినవా లేదా? అలా జరిగివుంటే అవి అంతర్జాతీయ న్యాయసూత్రాలకు విరుద్ధంగావున్నవా? అన్న విషయాలను అంతర్జాతీయ న్యాయస్థానం ముందు విచారిస్తుంది.

వెనీజులాలోని నూనె గనులను ఈక్వెడార్ దేశానికి చెందిన కంపెనీ ఒకటి కొన్నది. ఈ నూనెగనులను వెనీజులా అక్రమంగా దోచివేసిందని ఈక్వెడార్ అంతర్జాతీయ న్యాయస్థానానికి ఫిర్యాదుచేస్తుంది. ఈ కంపెనీ 40 లక్షలడాలర్లకు కొన్న నూనెగనులను తాను ఆక్రమించినట్లు వెనీజులా అంగీకరించనూ వచ్చు. ఈ పరిస్థితులలో అంతర్జాతీయ న్యాయస్థానం చేసేపని ఒక్కటే. వెనీజులా ప్రవర్తన ఏదైనా ఒక అంతర్జాతీయ శాసనానికి విరుద్ధమా? వెనీజులా ఈ విధంగా ప్రవర్తించి ఏదైనా ఒక ఒడంబడికను భంగపరిచిందా? అన్న విషయాన్ని ముందు విచారిస్తుంది.

తన దేశంలోని నూనె నూతులను స్వాధీనం చేసుకునే హక్కు వెనీజులా ప్రభుత్వానికి వున్నట్లు అంతర్జాతీయ న్యాయస్థానం అంగీకరిస్తుంది. అయితే, ఆ విధంగా మరొక

దేశపు కంపెనీ కొన్నటువంటి నూతులను ఆక్రమించుకున్నందుకు ఆ కంపెనీకి వెనీజులా ప్రభుత్వం పరిహారం చెల్లించాలని తీర్పు ఇస్తుంది. ఈ పరిహారం మొత్తం ఎంత అనే విషయాన్ని నిర్ధారించేందుకు అంతర్జాతీయ న్యాయస్థానం కొందరు ప్రవీణులను నియమిస్తుంది. ఈ ప్రవీణుల సూచనలను అనుసరించి వెనీజులా ఈక్వేడార్ కంపెనీకి 40 లక్షల డాలర్లు గాక, పదిలక్షల డాలర్లు మాత్రమే పరిహారం క్రింద చెల్లించాలని ప్రకటిస్తుంది. వెనీజులా చెల్లించే ఈ మొత్తాన్ని ఈక్వేడార్ ప్రభుత్వం తీసుకొని ఆ కంపెనీకి చెల్లిస్తుంది.

కొన్ని సందర్భాల్లో ప్రతివాదిగా చేర్చబడిన దేశం ఒక ప్రత్యేక ఒడంబడికను ధిక్కరించినట్లు అంగీకరిస్తూ, ఆ ఒడంబడిక చాలా అక్రమమైనదని, వాది తన బలాన్ని వుపయోగించి ఈ ఒడంబడికకు తన ఆమోదాన్ని సాధించినట్లు వాదింపవచ్చు. ఈ అక్రమ ఒడంబడికను మార్చాలని అంతర్జాతీయ న్యాయస్థానం ఎదుట వాదింపవచ్చు. కాని, ఒడంబడికల సవరణలతో ఈ న్యాయస్థానానికి ఏమీ సంబంధం లేదు.

ఒడంబడిక స్వరూప స్వభావాలు ఎలాంటివైనా ఆ ఒడంబడికలను చేసుకున్న దేశాలు ఒడంబడిక షరతులను సత్యంగా, న్యాయంగా పాటిస్తున్నవా లేదా అన్నంతవరకే ఈ అంతర్జాతీయ న్యాయస్థానం విచారించవలసిన విషయం. ఒడంబడికల సవరణ విషయాన్ని సమితి సర్వసభ్య సంఘానికిగాని, భద్రతామండలికి గాని నివేదించాల్సి వుంటుంది.

ఈ న్యాయస్థాన నిబంధనలను, నియమాలను న్యాయమూర్తులే అంతర్జాతీయ న్యాయస్థాన శాసనాన్ని అనుసరించి తయారు చేస్తారు. న్యాయస్థానంలోని 15 గురు న్యాయమూర్తులూ తమలో ఒకర్ని న్యాయస్థాన అధ్యక్షుడుగానూ, మరొకర్ని రిజస్ట్రారుగానూ ఎన్నుకుంటారు.

ఈ న్యాయమూర్తులు పదిహేనుమందిలోనూ సామాన్యంగా ఇద్దరు ముగ్గురు ఎప్పుడూ సెలవులో వుంటారు. 11 మంది మాత్రం సంవత్సరం పొడుగునా హాజరులో వుంటారు. ఒకేసారి రెండు మూడు ఫిర్యాదులను విచారించవలసివస్తే ముగ్గురు నలుగురు న్యాయమూర్తులుచేరి ఒక కోర్టుగా ఏర్పడి ఫిర్యాదులను విచారిస్తారు. న్యాయాధిపతులు అందరూచేరి పూర్తి న్యాయస్థానంగా తన ఫిర్యాదును విచారణకు తీసుకునేవరకు వేచివుండే ఓపికలేని దేశం ఇలాంటి ఏర్పాటును కోరవచ్చును. అప్పుడు మొత్తంగా న్యాయాధిపతులు ఇచ్చిన తీర్పుకు ఎంత విలువ, అధికారం వుంటుందో ఈ ముగ్గురు నలుగురు న్యాయమూర్తులుగల కోర్టు ఇచ్చే తీర్పుకు అంత విలువ, అంత అధికారం వుంటుంది. తీరా తీర్పు ఇచ్చిన తరువాత అందరూచేరి విచారించాలని వాది తిరిగి అభ్యర్థించడానికి అవకాశం ఏమాత్రం లేదు.

ఫ్రాన్సుకూ—పోలెండ్‌కూ ఏదో ఒక విషయంమీద తగాయిదా వచ్చిందనుకోండి. ఈ తగాయిదా అంతర్జాతీయ న్యాయస్థానంలో విచారణకు రావచ్చు. ఈ న్యాయస్థానంలో ఫ్రెంచి ప్రతినిధి ఒక న్యాయాధికారిగా వుంటాడు. కాని,

పోలెండ్ ప్రతినిధి న్యాయస్థానంలో వుండకపోవచ్చును. అప్పుడు పోలెండ్ కూడా ఈ కేసు విచారణ పూర్తి అయ్యే వరకూ ఒక ప్రతినిధిని న్యాయాధిపతిగా వ్యవహరించేందుకు పంపవచ్చు. ఈ విచారణ జరిగినంతకాలం మిగతా న్యాయాధిపతులకు ఏ హక్కులు, అధికారాలు వున్నవో పోలెండ్ తరఫున వచ్చిన న్యాయాధిపతికీ అవేహక్కులు, అధికారాలు వుంటవి. ఈ విచారణ పూర్తికాగానే ఆయన ఉద్యోగకాలం తీరిపోతుంది.

ఇక్కడ విచారణ సామాన్యంగా ఆంగ్లభాషలోగాని, ఫ్రెంచిభాషలోగాని జరుగుతూ వుంటుంది. ఇతర భాషల్లో వాదించేవారుగాని, సాక్ష్యం ఇచ్చేవారుగాని తమ వాదనను ఇంగ్లీషులోకిగాని, ఫ్రెంచిలోకిగాని అనువదించేందుకు వారే మనుష్యులనుకూడా తెచ్చుకోవాల్సి వుంటుంది.

ఏ దేశమైనా ఈ న్యాయస్థానికి ఒక ఫిర్యాదును చేయదలిస్తే, ఆదేశం ఈ పని చేయడానికి ఒక ఏజెంటును నియమిస్తుంది. అతనే కేసు వాదించేందుకు ప్లీడర్లను, వాదనలను బలపరిచేందుకు సాక్షులను, అనువాదకులను, ఇతర సహాయోద్యోగులను తీసుకొని కోర్టుకు హాజరవుతాడు.

కొన్ని ప్రత్యేక కేసులను విచారించే సందర్భంలో అందుకు సంబంధించిన విషయాల్లో ప్రావీణ్యంగలవారిని ఎవరినయినా న్యాయస్థానం విచారణాధికారిగా నియమించుకోవచ్చు. అట్టి అధికారులకు తీర్పు ఇవ్వడంలో ఏవిధమైన అధికారమూ వుండదు. ఇలాంటివారిని అసెసర్లు అంటారు.

కేసు విషయమై న్యాయాధికారులు తమలో తాము చర్చలు జరుపుకుంటూ వుంటే, ఆ చర్చల్లో ఏరు పాల్గొనవచ్చును.

ఏ విషయంలోనైనా న్యాయాధిపతులకు సందేహం ఏర్పడితే, ఆ సందేహాలను నివృత్తి చేసుకునేందుకు వారు ఎవరినైనా పిలువవచ్చును. ఒక కేసుపై తీర్పు ఇవ్వడానికి ఎవరి సాక్ష్యమైనా వుపయోగపడుతుందని కోర్టువారు అభిప్రాయ పడితే అట్టివారిని సాక్షులుగా సమను చేయవచ్చును. కాని, ఆ సమనులను తిరస్కరించేవారిని ఈ న్యాయస్థానం ఏమీ చేయలేదు.

వెనీజులా నూనెగనుల విషయంలో తగాయిదావచ్చినప్పుడు అందుకు సంబంధించి ఏ వివరాలు కావాలన్నా ఈ కోర్టువారు వెనీజులా ప్రభుత్వాన్ని అడగవలసిందేగాని, తగాయిదాకు కారణమైన ఆ నూనెగనులనుచూచి విషయాలను తెల్సుకు వచ్చేందుకని అక్కడికి ఒక కమిషన్‌ను పంపే అధికారం కోర్టుకు లేదు. ఏ దేశంలోని వ్యక్తినైనా సాక్షిగా విచారించాలనుకుంటే కోర్టువారు ఆ దేశపు ప్రభుత్వాన్ని మాత్రం ఆ వ్యక్తిని పంపమని అడుగగలరు. అంతే.

అయితే, ఇది అంతర్జాతీయ న్యాయస్థాన నిబంధనలలో గాని, శాసనంలోగాని లోపంగాదు. ఏ దేశం మరో దేశంపై ఫిర్యాదుచేసినా కోర్టువారు ముందు ఇరుపక్షాల వాదనలను వింటారు. ఎవరిని ఏ ప్రశ్నలు అడగాలో అడిగి అందుకు సమాధానాలను తెల్సుకొని ఎవరివాదం సరియైందీ తెల్సుకుని, ఎవరు నిజం చెప్తున్నదీ, ఎవరు బొంకుతున్నదీ గ్రహించి

తీర్పు ఇవ్వాలి. ఈ తీర్పు ఇవ్వడంలో పన్నెండుమంది న్యాయ మూర్తుల్లోనూ ఆరుగురు ఒకరకంగానూ, ఆరుగురు మరో రకంగానూ అభిప్రాయ పడవచ్చు. అప్పుడు అధ్యక్షుడుగా వుంటున్న న్యాయమూర్తి తన కాస్టింగ్ వోటుతో తీర్పు ఎలా వుండాలో నిర్ణయిస్తారు.

ఈ విధంగా తీర్పుపై నిర్ణయం జరిగిన తరువాత ఆ నిర్ణయాన్ని సహేతుకంగా తీర్పురూపంలో తయారుచేస్తారు. ఈ పనిని ఏ ఒక్క న్యాయమూర్తో చేసినా అందుకు అనుకూలంగావున్న న్యాయమూర్తులు అందరిపక్షాన, అందరి పేరా ప్రకటించడం జరుగుతుంది. తరువాత ఈ తీర్పు లన్నింటినీ గ్రంథస్తం చేసి అంతర్జాతీయ న్యాయశాస్త్రంలో కృషిచేసేవారికి ఉపయోగపడే విధంగా తయారుచేస్తారు.

తీర్పు చెప్పడంతో న్యాయస్థానం పని తీరుతుంది. దాన్ని అమలు జరిపారా, లేదా అన్న విషయం ఈ న్యాయస్థానా నికి సంబంధించిందిగాదు. ఏ దేశం అమలు జరపక పోయినా ఆ దేశాన్ని ఈ న్యాయస్థానం ఏమీ చేయలేదు. కాని, సమితి ప్రణాళికను ఆమోదించిన దేశాలన్నీకూడా వాటికి సంబంధించినంతవరకు ఈ అంతర్జాతీయ న్యాయస్థానాల తీర్పును పాటిస్తామని హామీ ఇచ్చినవి. ఒక తీర్పును కక్షి దారులలో ఒకరు గౌరవించకపోతే, రెండవవారు ఇలా జరిగిందని భద్రతామండలికి ఒక అవసర సందేశం పంప వచ్చును.

భద్రతామండలిగాని, సమితికి చెందిన మరేసంస్థగాని ఒక నిర్ణయానికి రాకలిగినంత సులభంగా ఆ నిర్ణయాన్ని అమలు జరపలేదు. ఆ నిర్ణయాన్ని అమలు జరిపేటందుకు సైనిక బలాన్ని ప్రయోగించే అవకాశం లేదు.

ఇన్ని మినహాయింపులు, ఇన్నిలోపాలు వున్నప్పటకీ, ఈ అంతర్జాతీయ న్యాయస్థానం ఇచ్చిన తీర్పులను ఏ దేశమూ ఇంతవరకు తిరస్కరించినట్లు లేదు.

తన నిర్ణయాలను, తీర్పులను అమలు జరిపే అధికారం ఈ న్యాయస్థానానికి లేకపోయినప్పటికీ అన్ని రాజ్యాలు ఈ తీర్పులను అంగీకరించి అమలుజరపడానికి గల కారణాలు ఏమిటి? అంతర్జాతీయ న్యాయస్థానం తీర్పులను నిర్లక్ష్యించిన దేశం చాలా చిక్కులపాలవుతుంది' మిగతా అన్ని దేశాలూ చేరి "మీతో ఏ ఒడంబడిక చేసుకుంటేమాత్రం ప్రయోజనం ఏముంది? మీరు ఆ ఒడంబడికలను గౌరవించరు," అని ఆ దేశ ప్రభుత్వానికి హెచ్చరిక చేయగలవు. ఇన్ని దేశాల మధ్య ఆ ఒక్క దేశం ఒంటరిగా వుండిపోవలసి వస్తుంది. ఈ యుగంలో ఏకాకిగా జీవితం గడపడం వ్యక్తులకుగాని, జాతులకు గాని సాధ్యంగాదు.

ఐక్యరాజ్య సమితి ఏర్పాటు చేసిన ప్రపంచ న్యాయస్థానం ఎలాంటి తగాయిదానైనా పరిష్కరించగల శక్తి కలిగి వుంది. ప్రపంచరాజ్యాలన్నీ తమ తగాయిదాలను ఈ ప్రపంచ కోర్టుద్వారా పరిష్కరించుకోవడానికి సమ్మతిస్తే అన్ని తగాయిదాలూ న్యాయంగా పరిష్కారం కాగలవు. ప్రపంచ

రాజ్యాలు ఎన్ని ఒడంబడికలు చేసుకుంటే ఈ న్యాయస్థానానికి అంతపని వుంటుంది. ఈ న్యాయస్థానం ప్రాధాన్యం ఈ ఒడంబడికల ప్రాధాన్యాన్ని బట్టి వుంటుంది.

కొన్ని దేశాలపై ధర్మకర్తృత్వం వహించిన రాజ్యాలు ఇరవై సంవత్సరాలలో ఆ దేశాలకు స్వపరిపాలనాధికారాన్ని ప్రసాదిస్తామని సమితి సర్వసభ్య సంఘానికి సమర్పించిన ఒడంబడికలో స్పష్టం చేసినవి. ఈ గడువు పూర్తి అయిన తర్వాతకూడా ఈ రాజ్యాలు ధర్మకర్తృత్వం వహించిన దేశాలకు స్వపరిపాలన అధికారాన్నివ్వకపోతే, అప్పుడు ఆ దేశాలు ఈ న్యాయస్థానానికి ఫిర్యాదు చేయవచ్చు.

ఈ విధమైన ఒడంబడికలు ఎన్నో వున్నవి. ఇందుకు సంబంధించిన ఏ ఒక్క పార్టీ సవ్యంగా ప్రవర్తించక పోయినా ఆ విషయం అంతర్జాతీయ న్యాయస్థానం విచారణకు రాగలదు.

1945 వ సంవత్సరంలో ఒక వినూత్న సంఘటన జరిగింది. అమెరికా, రష్యా, ఫ్రాన్సు, ఇంగ్లండ్‌లు ఒక మిలిటరీ ట్రిబ్యునల్‌ను స్థాపించడానికి ఒక ఒడంబడిక చేసుకున్నవి. సర్వసాధారణంగా అంతర్జాతీయ ఒడంబడికలు ఏ దేశం ఏ పని చేయాలి, ఏ పని చేయరాదు అన్న విషయాలకు మాత్రమే పరిమితమై వుంటవి. కాని, ఈ నాలుగు రాజ్యాలూ చేసుకున్న ఒడంబడిక ప్రత్యేకంగా కొందరు వ్యక్తులను పేర్కొన్నది. దురాక్రమణకు యుద్ధాన్ని ప్రారం

భించినా, అలాంటి యుద్ధాన్ని ప్రారంభించడానికి సన్నాహాలు చేసినా అందుకు బాధ్యులైన వ్యక్తిగాని, వ్యక్తులుగాని శిక్షార్హులు అనీ, అంతర్జాతీయ ఒడంబడికలను భంగపరచి యుద్ధాలను ప్రారంభించినవారు శిక్షింపబడాలనీ ఈ ఒడంబడిక శాసించింది.

యుద్ధకాలంలో ప్రజలను అకారణంగా హింసించి, వారి రాజకీయాభిప్రాయాలను, మతాన్ని, శరీరచ్ఛాయను, జాతిని పురస్కరించుకొని చిత్రవధ చేసినవారిని విచారించి శిక్షించాలనికూడా ఈ ఒడంబడికే నిర్దేశించింది.

ఈ పనులను నిర్వహించేందుకు, ఈ విచారణలను జరిపి నేరస్థులను శిక్షించేందుకు ఈ మిలిటరీ ట్రిబ్యునల్ ఏర్పడింది. ఈ ట్రిబ్యునల్ అక్షరాజ్యాన జపాన్, జర్మనీ, ఇటలీలలోని యుద్ధనేరస్థులను విచారించి శిక్షించేందుకు తాత్కాలిక న్యాయస్థానాలు ఏర్పడ్డవి. ఈ న్యాయస్థానాలు జరిపిన విచారణలనే న్యూరెంబర్గ్ విచారణలు అన్నారు. ఈ విచారణలు న్యూరెంబర్గ్‌లో జరగడంవల్ల వాటిని న్యూరెంబర్గ్ విచారణలు అన్నారు.

ప్రత్యేకంగా కొన్నిరకాల నేరాలనుపేర్కొని ఆ విధమైన నేరాలు చేసినట్లు ఏ దేశీయులపైన ఋజువైనా, వారిని శిక్షించేందుకు ఒక అంతర్జాతీయ న్యాయస్థానం అంటూ ఏర్పడ్డం ఇదే మొదలు.

అధ్యాయం ౮

# సమితి కార్యాలయం

## ప్రపంచ మహాసంస్థ నిర్వాహకులు

ఐక్యరాజ్య సమితి కార్యాలయంలో అడుగుపెట్టితే టైప్ రైటింగ్ మిషిన్ల మోతతో చెవులు గింగుర్లెత్తి పోతవి. ఒక అధికారి ఉత్తరాలు చెప్తుంటే, షార్టుహాండులో వ్రాసుకునే వారు వ్రాస్తుంటే, వ్రాసుకొని టైపుకొట్టేవాళ్ళు టైపు కొడుతూ వుంటారు.

సమితి సమావేశాలకు హాజరైతే అక్కడా దాదాపు వంద, రెండువందలమంది సమితి వుద్యోగాలు తీరికలేకుండా పనిచేస్తూ వుంటారు. వివిధ దేశాల ప్రతినిధులు వుపన్యాసాలు చేస్తూవుంటారు. ఆ ప్రసంగాలను షార్టుహాండ్ తీసుకునే గుమాస్తాలు తీసుకుంటూ వుంటారు. వుపన్యాసాలను ఇతర భాషల్లోకి అనువదించేవారు అనువదిస్తూ వుంటారు.

ఇవన్నీచూస్తే సమితి కార్యాలయం ఎలా పనిచేస్తూ వుండేదీ తెలిసిపోతుంది. ఈ వేలాది వుద్యోగులు ఈ మహా సంస్థ కృషి సఫలంకావాలని తమ జీవితాన్నంతా ధారపోసి నిర్విరామంగా కృషిచేస్తూ వుంటారు.

వీరందరిపైనా పెత్తందారు సమితి ప్రధాన కార్యదర్శి. ఈయనను సెక్రెటరీ జనరల్ అంటారు. ఈయన సమర్థుడూ, తెలివైనవాడూ కాకపోతే ఈసంస్థ ఎందుకూ కొరగానిదై పోతుంది.

ఈ పదవికి తగినవాడు, అర్హుడు ఎక్కడ దొరుకుతాడా అని భద్రతామండలి యావత్ప్రపంచాన్ని గాలిస్తుందంటే నమ్మండి! ఇంత అన్వేషణచేసి మండలి పేర్కొనే వ్యక్తి అయిదు అగ్రరాజ్యాలకూ, మండలిలో సభ్యత్వంగల రెండు చిన్నరాజ్యాలకూ సమ్మతంగా వుండాలి. ఈ విధంగా ఎన్నికైన వ్యక్తిని మండలి సమితి సర్వసభ్య సంఘానికి సూచిస్తుంది. సర్వసభ్యసంఘం ఆమోదాన్నికూడా పొందినప్పుడే ఆవ్యక్తిని సెక్రెటరీ జనరల్‌గా నియమించడం జరుగుతుంది. భద్రతా మండలి అంగీకరించిన వ్యక్తిని సమితి అంగీకరించకపోతే, సమితి అంగీకారాన్ని పొందగల మరొక వ్యక్తిని మండలి ఎన్నుకోవలసి వుంటుంది.

ఒకసారి ఎన్నికైన వ్యక్తి ఆ పదవిలో అయిదేళ్ళు వుంటాడు. ఒకసారి ఎన్నికైన వ్యక్తి ఆ అయిదేళ్ళు పూర్తి అయిన తరువాత తిరిగి ఎన్నిక అయ్యేందుకు ఎలాంటి అభ్యంతరమూ వుండదు. ఈయనకు సంవత్సరానికి ఇరవై వేల డాలర్లు జీతంగాను, మరో ఇరవై వేల డాలర్లు అలవెన్సుగాను సమితి ఇస్తుంది. ఈ ఆదాయంపై ఏ దేశానికీ ఈయన పన్ను చెల్లింప నవసరం లేదు.

ఈ ప్రధానమైన వుద్యోగానికి ఎన్నికైన ప్రథముడు ట్రిగ్-వా లీ. తిరిగి రెండవదఫాకూడా ఈయన్నే సెక్రిటరీ జనరల్‌గా ఎన్నుకున్నారు. ట్రిగ్-వా లీ నార్వే దేశస్థుడు. ఇతని తండ్రి వడ్రంగి. మంచి ప్రతిభావంతుడు; సమర్థుడు. నార్వే కార్మికోద్యమంలో చాలా ప్రముఖ భూమికను వహిం

చినవాడు. ద్వితీయ సంగ్రామకాలంలో నాజీలు నార్వేను ఆక్రమించినప్పుడు నాజీలను తీవ్రంగా ప్రతిఘటించాడు. న్యాయశాస్త్రంలో పెద్ద పండితుడు. సమితి సెక్రెటరీ జనరల్ పదవికి అన్నివిధాలా అర్హుడు.

ఐక్యరాజ్య సమితి ప్రధాన పాలనాధికారిగా ఈయన సమితి కార్యక్రమ సక్రమ నిర్వహణకు బాధ్యత వహిస్తాడు. భద్రతామండలి ఫలానా తేదీన ఫలానా ప్రదేశంలో రహస్యంగా సమావేశం కావాలని సమితి ప్రధాన కార్యదర్శి సూచింపవచ్చు. మండలి సభ్యులకు ఎవ్వరికీ ఈ సూచన రుచింపక పోవచ్చు. అయినా ఆవిధంగా సమావేశంకావడం కంటే వారు చేయకల్గింది ఏమీలేదు.

భద్రతామండలి, సమితి సర్వసభ్యసంఘం సమావేశం కావడానికి ముందు ఆ సమావేశాలు ఏ యే విషయాలు చర్చించ వలసిందీ వివరిస్తూ ఒక కార్యక్రమాన్ని తయారు చేస్తాడు. ఈ జాబితాను తయారు చేయడంలో ఈయన సమితి సర్వసభ్యసంఘం, భద్రతామండలి విధించిన నిబంధనలను అనుసరించినప్పటికీ ఈ సంఘాలు సమావేశమైన తరువాత అత్యధిక సంఖ్యాకులుకోరితే ఈ కార్యక్రమాన్ని మార్చి వేయవచ్చు.

ఈయన భద్రతామండలి, సమితి సర్వసభ్యసంఘం, ఆర్థిక, సాంఘికసంఘం, ధర్మకర్తృత్వసంఘం సమావేశాలకు హాజరు గావచ్చును. వీటిలో రెండు మూడు సంఘాలు ఒకే సమయంలో సమావేశం కావచ్చును. అప్పుడు ఏ సమావేశం

ముఖ్యం అని ఆయన భావిస్తే దానికి ఆయనే హాజరవుతాడు. మిగతా సమావేశాలకు తన ప్రతినిధులను పంపవచ్చు. సమావేశాలు సమాప్తంకాగానే ఆయన తన ప్రతినిధులను కలుసుకొని ఏ సమావేశంలో ఏం జరిగిందీ తెలుసుకుంటాడు. సమితి సంఘాలన్నీకూడా ఏ సంఘం ఏం చేస్తున్నదీ తెల్సుకుంటూ వుండటం చాలా అవసరం. అది సెక్రెటరీ జనరల్ ద్వారానే సాధ్యం. ఈయనకు తెలియకుండా సమితి వ్యవహారం ఒక్కటి జరగదు. ఏ రహస్యమైనా ఈయనకు తెలియ వలసిందే.

ఈయన ఈవివిధ సంఘాల సమావేశాలకు కేవలం ప్రేక్షకుడుగానూ, పరిశీలకుడుగానూ మాత్రమే హాజరవుతూ వుండడు. అవసరం అని అనుకుంటే ఆయన ఏ సమావేశంలో అయినా పాల్గొని చర్చలోవున్న విషయంమీద ఉపన్యాసం చేయవచ్చు.

ఒకదేశం మరొకదేశంపై యుద్ధం ప్రారంభించడానికి రహస్యంగా తయారవుతూ వుండవచ్చును. కొన్ని వలస దేశాల్లోని ప్రజలు పాలక రాజ్యాల నిరంకుశ విధానంతో విసిగిపోయి పాలకవర్గాన్ని పడదోయడానికి, దేశవ్యాప్త విప్లవం సాగించడానికి సన్నద్ధమౌతూ వుండవచ్చును. ఈ విధమైన విపత్కర పరిస్థితులు ప్రపంచంలో ఇంకా అనేక చోట్ల ఏర్పడుతూ వుండవచ్చును. ప్రపంచంలో ఏ మూల ఏమి జరుగుతూ వున్నదో, ప్రపంచ శాంతికి భంగంకలిగే

సంఘటనలు ఏమి జరుగుతూ వున్నదో తెలుసుకునేటందుకు సెక్రెటరీ జనరల్‌కు అనేక మార్గాలు వున్నవి.

ప్రపంచం నాలుగు చెరగులనుంచీ ఆయనకు రోజూ వుత్తరాలు వస్తూవుంటవి. పరిస్థితి మరీ విషమంగా వున్నప్పుడు టెలిగ్రాములుకూడా రాగలవు. కొందరు స్వయంగా వెళ్ళి ఆయనను కలుసుకొని విషయాలు వివరిస్తారు. ఇన్నివిధాల వచ్చే ఈ సమాచారంలో సత్యం ఎంతవుంది, అతిశయోక్తి ఏమైనా వున్నదా? అని ఆయన స్వయంగా విచారించి తెలుసుకోవాలి.

ఈ విధంగా అన్నీ విచారించిన మీదట ఎక్కడైనా ప్రమాద భరిత పరిస్థితి ఏర్పడినట్లు ఆయన భావించితే వెంటనే భద్రతామండలి సమావేశానికి వెళ్ళి పరిస్థితిని వివరిస్తాడు. తన అధీనంలో ఇందుకు సంబంధించిన సాక్ష్యాలు, ఆధారాలు ఏమైనా వుంటే, వాటిని అన్నింటినీ భద్రతామండలి సభ్యులకు నివేదిస్తాడు. వాటి ప్రతులను సభ్యులు అందరికీ అందజేస్తాడు. భద్రతామండలి తనకు ఈ గొడవతో ఏమీ సంబంధం లేదని చెప్పడానికి లేదు. తరువాత ఏ నిర్ణయం చేసినా ముందు సెక్రెటరీ జనరల్ వాదనను విని తీరాలి.

ప్రతి సంవత్సరం ఆఖరున ఈయన సమితి సర్వసభ్య సమావేశానికి ఒక నివేదికను సమర్పిస్తాడు. సమితికి చెందిన వివిధ సంఘాలు, కమిషన్లు, ఉపసంఘాలు ఏ యే పనులను నిర్వహించిందీ, ఏ యే సమస్యలను విచారించి వాటి పరిష్కా-రానికి ఏ యే చర్యలు తీసుకున్నదీ ఈ నివేదికలో

ఆయన వివరిస్తాడు. ఈ సంఘాలు, కమిషన్లు అన్నింటిపైనా సమితి సర్వసభ్య సంఘానికి అధికారం వుంది. ఆ అధికారాన్ని పురస్కరించుకొని సర్వసభ్యసంఘం ఏ కమిషన్ ఏమి చేయాలని ఆదేశించవచ్చునో, ఈ సంఘం ఏమి చేయవలసి వుంటుందని సూచించవచ్చునో ఈ కార్యదర్శి తన నివేదికలో వివరిస్తాడు.

సమితి ప్రతినిధులు అందరూ సెక్రెటరీ జనరల్ అభిప్రాయాలకు, ప్రతిపాదనలకు ఎక్కువ ప్రాధాన్యం ఇస్తారు. సమితి వ్యవహారాలను గురించి ఆయనకు తెలిసినన్ని విషయాలు ఏ ఒక్కరికీ తెలియవు. సెక్రెటరీ జనరల్ తయారు చేసిన వార్షిక నివేదికలను సమితికార్యాలయం అచ్చు వేయించి అడిగిన వారందరికీ అందజేస్తూ వుంటుంది.

సమితిలో ఉద్యోగులు మూడునాలుగు వేలమంది వుంటారు. వీరి జీతాలు, వీరి నియామకానికి సంబంధించిన నిబంధనలు మొదలైన వాటినన్నింటినీ సమితి నిర్ణయిస్తుంది. వాటిని అనుసరించి సెక్రటరీ జనరల్ ఈ ఉద్యోగులను అందరినీ నియమిస్తాడు.

సమితిలో సభ్యత్వంగల అన్ని దేశాలనుంచీ ఈ ఉద్యోగులను ఎన్నుకోవాలి. ఆ దృష్టితోనే సెక్రెటరీ జనరల్ అవకాశం వున్నంతవరకు ఈ ఉద్యోగులను నియమిస్తాడు. అయితే, ఉద్యోగులను ఎన్నుకునే సందర్భంలో ఏ ఉద్యోగి ఏ దేశస్థుడని గాక, ఏ పనికి ఎలాంటివాడు సమర్థుడు అన్న విషయాన్నే ఈయన ప్రధానంగా గమనించవలసి వుంటుంది

ఒక్క సంవత్సరంలో ఈయన దాదాపు నలభై దేశాలకు చెందిన వారిని సమితి ఉద్యోగులుగా నియమించాడు.

ఈ సమితిలో ఉద్యోగం చేయడానికి వచ్చినవారందరూ తమ తమ దేశాలకొరకు, వాటి పక్షాన పనిచేయడానికి రావడం లేదు. ఏ దేశపు పౌరుడు ఆ దేశాన్ని ప్రేమించడం, ఆ దేశంపట్ల భక్తి కలిగి వుండటం మంచిదే. కాని, సమితిలో చేరిన తరువాత అన్ని దేశాలపట్లా న్యాయంగా, ధర్మంగా వ్యవహరించాలి. అన్ని దేశాల అభివృద్ధిని, ప్రపంచ ప్రజల అభ్యుదయాన్ని ఆకాంక్షిస్తూ అందుకు కృషి చేస్తున్న ఐక్య రాజ్య సమితిలో ఆ సమితి లక్ష్యాల సాధనకు కృషి చేసే టందుకు ఈ ఉద్యోగాలను స్వీకరించామనే అందరూ భావించాలి. వీరు ఎవ్వరూ ఒక దేశ ప్రభుత్వ ఆదేశాలను గాని, ఒక రాజకీయ పక్ష వుత్తరువులనుగాని అనుసరించి వ్యవహారం చేయడానికి వీల్లేదు.

ఈ సమితి సిబ్బందిలో కొందరు ఎక్కడెక్కడో పని చేస్తూంటారు. ఎక్కువమంది న్యూయార్కులోని సమితి కార్యాలయంలోనే వుండి పని చేస్తున్నారు. వీరిలో ఎవ్వరూ తమ జీతాలపై ఏ ప్రభుత్వానికీ ఆదాయపు పన్ను అంటూ చెల్లించరు. సెక్రెటరీ జనరల్ వుత్తరువులను పాలిస్తూ, వారు అందుకు సంబంధించిన పనులు చేస్తూ వున్నంతకాలం వారిని ఏ దేశపు పోలీసులూ అరెస్టు చేయడానికి లేదు.

ఈ మూడు నాలుగువేలమంది వారి వారి దేశీయ దుస్తులు ధరించి న్యూయార్క్ నగరంలో తిరుగుతూవుంటే

వీరిని చూస్తున్న అమెరికను ప్రజాసామాన్యంలో తమమధ్యనే ఒక ప్రపంచ సంస్థ వుంటున్నదనే భావం కలుగుతుంది. అమెరికాప్రజల్లో ఆ భావం కలిగినందువల్ల అమెరికా ప్రభుత్వం ఈ మహాసంస్థలో విశేషశ్రద్ధ తీసుకునేందుకు వీలుకలుగుతున్నది.

సమితి సెక్రెటరీ జనరల్‌కు సహాయపడేందుకు 9 మంది సహాయకార్యదర్శులు వుంటారు. ఈ 9 మందిలోనూ ఒక సహాయకార్యదర్శి సమితి పరిపాలనా వ్యవహారాలను చూస్తూ వుంటాడు. సెక్రెటరీ జనరల్ ఒక పని జరగాలని సూచిస్తే, ఆ పని జరిగేటట్లు చూడటం ఈ సహాయకార్యదర్శి బాధ్యత. ఈయనను ఎగ్జిక్యూటివ్ అసిస్టెంట్ సెక్రెటరీ జనరల్ అంటారు.

ఈ అసిస్టెంట్ సెక్రెటరీస్ జనరల్ 9 మందీగాక, సమితి కార్యాలయానికి చేరివున్న చిన్న పోలీసు సిబ్బందికి ఒక అధిపతి వుంటాడు. ఇతన్ని "ఆర్డర్ ఆఫ్ ది డే ఆఫీసర్" అంటారు.

సహాయ కార్యదర్శులు 9 మందినీ సెక్రెటరీ జనరల్ స్వయంగా ఎన్నుకుంటాడు. వీరందరూ ఉద్దండులే. ఒక్కొక్కడు ఒక్కొక్క రాజ్యాన్ని పాలించగల సమర్థుడు. భద్రతామండలి కార్యక్రమ నిర్వహణలో తనకు తోడుగా వుండేందుకు ట్రిగ్-వా లీ సోవియట్ రష్యాకు చెందిన అర్కాడే సొబొలీవ్‌ను ఎన్నుకున్నాడు. ఇతను చాలా తెలివైనవాడు; గొప్ప సమర్థుడు. ఈ వుద్యోగానికి రావడానికి ముందు ఈయన రష్యాలో ప్రభుత్వ కమిస్సార్‌గా వుంటూవచ్చాడు. సమితిలో

వుద్యోగం స్వీకరించడానికి రష్యా ప్రభుత్వం ఈయనను అను మతించింది.

వలసశాఖా వ్యవహారాలను చూచేందుకు చైనా ప్రభుత్వం మిస్టర్ హూను పంపింది. సమాచారశాఖ వ్యవహారా లను చూచేందుకు సెక్రెటరీ జనరల్ బెంజమిన్ కొహెన్‌ను నియమించాడు. ఈయన చిలీలో ఒక ప్రఖ్యాత పత్రికా సంపాదకుడు. ఈ విధంగానే మరి కొన్ని ముఖ్యపనులను చూచేందుకు సెక్రెటరీ జనరల్ బ్రిటన్, అమెరికాలకు చెందిన ప్రముఖ రాజ్యాంగ తంత్రజ్ఞులను ఎన్నుకున్నాడు. కాని, ఆ ప్రభుత్వాలు వారిని సమితి వుద్యోగాలకు పంపడానికి సమ్మ తించలేదు. ట్రిగ్-వా లీ సహాయకార్యదర్శులను ఎన్నుకున్నా ఆ యా ప్రభుత్వాలు సమ్మతిస్తేగాని వారు ఆ వుద్యోగాలను అంగీకరించడానికి లేదు.

సమితి సర్వసభ్య సంఘంగాని, ఆర్థిక, సాంఘిక సంఘం గాని, మరి ఏ ఇతర సంఘంగాని మరో వారం పదిరోజులలో సమావేశం కాబోతున్నదీ అంటే సమితి సిబ్బంది రాత్రిం బవళ్ళు విధీవిరామం లేకుండా పనిచేసి ఆ సమావేశాలు ప్రారంభమయ్యేనాటికి ఏ యే వివరాలు కావలసివుంటవో అన్నీ తయారుచేసి సిద్ధంగా వుంచుతుంది. సమావేశాలు ప్రారంభమై సాగుతున్న రోజులలో ఇంత సిబ్బందికీ క్షణం తీరిక వుండదు. చర్చకు వచ్చిన ప్రతి తీర్మానాన్నీ, పరిశీలనకు వచ్చిన ప్రతి పథకాన్నీ, వీటిపై ప్రతినిధులు చేసిన ప్రసంగాలను తర్జుమాలుచేసి సైక్లో స్టయిలుచేసి ప్రతినిధులు

అందరికీ అందజేస్తూ వుంటారు. తీర్మానాలు, పథకాలు ఒక్కొక సందర్భంలో దాదాపు టైపుకొట్టిన పేజీలు యాభై దాకా వుంటవి. ఇంతపనీ సకాలానికి పూర్తి కాకపోతే ఒకటి రెండు రోజులు ఆ సమావేశాలు వాయిదాపడటం కూడా జరగవచ్చు.

సమితి సర్వసభ్యసంఘంగాని, మరొక సంఘంగాని కొన్ని తీర్మానాలను ఆమోదించి, కొన్ని పథకాలను తయారు చేసి, ప్రత్యేక విషయాలపై కొన్ని సిఫార్సులుచేసి వాటిని సమితి రాజ్యా లన్నింటికీ అందచేయమని సూచింపవచ్చును. సమితి పరిగణించిన అయిదు భాషల్లోకీ వీటిని తర్జుమాచేసి, అచ్చువేయించి, సమితి రాజ్యాలన్నింటికీ అందచేసే బాధ్యత ఎవరిది? సమితి కార్యాలయానిదే. అంటే, ఆ కార్యాలయం లోని సిబ్బందే ఈ బాధ్యతను నిర్వహించాలి.

సమితి వుద్యోగులు చేయవలసిన పనులు, చేసేపనులు ఇవేగాదు. సమితి సర్వసభ్యసంఘం సమావేశ మౌతూ వుంటుందనుకోండి. ఏదో ఒక ప్రతిపాదనపై చర్చ జరుగుతూ వుంటుంది. మధ్యలో ఒక దేశపు ప్రతినిధి లేచి "ఇదంతా 1902 వ సంవత్సరంలో శాన్ రాఫెల్ లో ఇరవై రాజ్యాలు సమావేశమై చేసుకున్న ఒడంబడికకు విరుద్ధం" అని చెప్పి కూర్చుంటాడు. సమావేశంలో పాల్గొంటున్న ప్రతినిధులలో అనేకమందికి ఇలాంటి ఒడంబడిక ఒకటి వున్న దనే సంగతే తెలియదు. కొందరికి తెల్సినా ఆ ఒడంబడికలో ఏముందో గుర్తుండదు. ఈ విషయం వెల్లడించిన ప్రతినిధివద్ద

ఒడంబడిక ప్రతి వుండదు. పైగా ఆ ఒడంబడిక 1907 లో జరిగివుంటే సరిగ్గా గుర్తులేక ఆయన 1902 లో జరిగిందని చెప్పి వుండవచ్చు.

సమితి సిబ్బంది వెంటనే సమితి గ్రంథాలయానికి వెళ్ళి ఈ ఒడంబడికకోసం అన్నీ గాలించి, చివరికి ఒడంబడిక ప్రతిని సాధించి, ఒడంబడికను అయిదు భాషల్లోకి తర్జుమా చేసి, అయిదారు వందల కాపీలను అచ్చువేయించి, అప్పటి కప్పుడు సమితి ప్రతినిధులకూ, అధికారులకూ అందజేస్తుంది. సమితి మర్నాడు సమావేశమైనప్పుడు సభ్యులు ఈ విషయం మీద ఎక్కువ జాగ్రత్తగా చర్చలు జరుపగలుగుతారు.

ఈ విధమైన పనులు నిర్వహించేందుకు ముప్పై నలభై మంది పరిశోధకులు వుంటారు. శోధించి విషయాన్ని సేకరించడమే వీరిపని.

సమితి సర్వసభ్యసంఘంగాని, సాంఘిక ఆర్థిక, సంఘం గాని సమావేశం ముగించివేసే ముందు వచ్చే సమావేశం నాటికి ఏ వేవి తయారుకావలసిందీ నిర్ణయించగలవు. ఈ సిబ్బంది ఆ నిర్ణయాలను అనుసరించి విషయాలను సేకరించి అన్నీ సిద్ధంగా వుంచుతుంది. "తప్పుదారులు పట్టి, చేయరాని నేరాలు చేస్తున్న పిల్లలను బాగుచేసి, సంస్కరించి, సన్మార్గాను వర్తనులనుగా చేయడానికి ఏ యే దేశాలు ఏ యే పనులు ఇప్పుడు చేస్తున్నవి? ఇంకముందు ఏమి చర్యలు తీసుకోదలచినవి? ఇందుకు సంబంధించిన వివరాలన్నింటినీ సేకరించి వచ్చే సమావేశం నాటికి సిద్ధంగా వుంచమ"ని ఆర్థిక,

సాంఘిక సంఘం ఆదేశించవచ్చు. సమితి సిబ్బంది ఇందుకు సంబంధించి ఒక సమగ్ర ప్రశ్నావళిని తయారుచేసి ప్రపంచ రాజ్యాలన్నింటికీ పంపి సమాధానాలను సేకరించి, వాటి నన్నింటినీ ఒకక్రమంలో సంపుటీకరించి సిద్ధంగా వుంచుతుంది.

ఇది అంత సులభమైన పనిగాదు. ఎంతో ప్రయాసతో కూడుకునివున్న పని. అయినా సమితి సిబ్బంది ఈ వివరా లన్నింటిని సేకరించి, సమితి సంఘాలు అవసరమైన చర్యలు తీసుకునేందుకు సహాయపడితే లక్షలాది కుటుంబాల్లో అద్భుత మైన మార్పులు కలగవచ్చు.

సమితి సభ్యులలో ఎవరెవరు ఏయే పద్దుక్రింద ఎంతెంత చెల్లింపవలసి వుండేదీ సమితి సర్వసభ్యసంఘం నిర్ణయిస్తుంది. ఆ ప్రకారంగా డబ్బు వసూలు చేయవలసిన శాశ్వత సమితి కార్యాలయానిది. సమితి స్థాపింపబడిన మొదటి సంవత్సరంలో దాదాపు రెండుకోట్ల డాలర్లను వసూలు చేసింది. సమితి నిర్వహింపవలసిన బ్రహ్మాండమైన కార్య క్రమంతో పోల్చి చూస్తే. ఈ మొత్తం ఏమూలాలకి అని అని పిస్తుంది. ఎంతమందికో జీతాలు చెల్లించాలి. ప్రపంచంలో ఎన్ని ప్రాంతాల్లోనో స్థలాలు కొనవలసి వుంటుంది. కొన్ని ప్రాంతాల్లో సమితి సంస్థల ఉపయోగానికి ప్రత్యేక భవనాలను కట్టించవలసి వుంటుంది.

1946 ఏప్రియల్ 18 వ తేదీన వెనుకటి నానాజాతి సమితి అంతర్థానమైంది. ఈ సంస్థ తాలూకు యావదాస్తి ఐక్య రాజ్యసమితికి సంక్రమించింది. అమూల్యగ్రంథాలూ, అవు

రూపమైన పత్రాలూ, ఎంతో వుపయోగకరమైన సామాగ్రి, గాక 114 లక్షల డాలర్లు ఖరీదుచేసే భవనాలు ఈ సమితికి దక్కినవి. నానాజాతి సమితినుంచి ఐక్యరాజ్య సమితికి వచ్చిన పత్రాల్లో దాదాపు 4,500 ఒడంబడిక లున్నవి. వీటన్నింటినీ సరిచేసి, అచ్చువేయించి, అందరికీ ఉపయోగ పడేటట్లు వివిధ భాషల్లోకి తర్జుమాచేయించి వుంచుతుంది ఐక్యరాజ్య సమితి. ఈ అచ్చు పనులను పూర్తి చేసేందుకు సమితికే ఒక ముద్రణాలయం వుంది.

కొన్ని సందర్భాల్లో సమితి కార్యాలయమే అనేక కార్యక్రమాలను ప్రారంభిస్తుంది. సమితి పరిశోధక శాఖకు చెందిన సాంఘిక విషయాల సంస్థ ప్రపంచ శాస్త్రజ్ఞులందరూ సమావేశం కావడానికి ఒక బ్రహ్మాండమైన పథకాన్ని తయారు చేసింది. శాస్త్ర పరిశోధనా కేంద్రాన్ని ఒక దానిని సమితి స్థాపించాలని, అక్కడ క్షయ, కాన్సర్, కుష్ఠు మొదలైన వ్యాధులను గురించి పరిశోధనలు జరిపి, వాటి నిర్మూలనకు ఏది ప్రయోజన కరమైన మార్గమో నిర్ణయించేందుకు పరిశోధనలు జరిపించాలని ఈ పథకం సూచించింది. ఇదే విధంగా వ్యావసాయిక, వైజ్ఞానిక, ఆరోగ్య సమస్యలపై పరిశోధనలను సాగించేందుకు ప్రత్యేక పరిశోధనా కేంద్రాలువుండాలనికూడా సాంఘిక వ్యవహారాలసంస్థ కోరింది.

ప్రపంచంలోని అనేక దేశాల శాస్త్రజ్ఞులు అమెరికా ప్రభుత్వ ఆహ్వానాన్ని అంగీకరించి, అమెరికాలో రెండు మూడు సంవత్సరాలు పరిశోధనలు జరిపి, ఆటంబాంబును

తయారుచేశారు. ఇదేవిధంగా ప్రపంచ శాస్త్రజ్ఞులు సమితి అధ్వర్యాన పరిశోధనలు జరిపి విషవ్యాధులను నిర్మూలించడానికి, భూసారాన్ని వృద్ధిచేయడానికి ఉపయోగపడే ఔషధాలను, ఎరువులను తయారు చేయవచ్చు.

సాంఘిక వ్యవహారాలశాఖ ఇంతకు మించి చేయకలిగింది ఏమీ లేదు. ఈ పథకాన్ని ఆర్థిక, సాంఘికసంఘం, సమితి సర్వసభ్యసంఘం ఆమోదించి, పథకాన్ని అమలు జరపడానికి కావలసిన ధనాన్ని మంజూరు చేయవలసి వుంటుంది.

సమితి అధ్వర్యాన ఒక సమాచార శాఖ వుంది. మీరు ఎప్పుడు ఏ విషయంగురించి తెలుసుకోవాలన్నా ఈ శాఖా కార్యాలయానికి వ్రాస్తే చాలు. ఆ విషయంమీద ఇదివరకు ఏమి జరిగిందీ, సమితి అందుగురించి ఇప్పుడు ఏమి చేస్తున్నదీ తెలుసుకోవచ్చును. సమితికి చెందిన వివిధ సంఘాలు, కమిషన్లు, ఇతర శాఖలు ఏ యే పనులను నిర్వహిస్తున్నదీ ఈ సంఘానికి తెలుసు. ఈ సమాచారశాఖ ఈ వివరాలన్నింటినీ పొందుపరచి ఎప్పటి కప్పుడు కరపత్రాలను ప్రచురిస్తూ వుంటుంది.

సమితి యాజమాన్యాన వార్తలను ప్రసారంచేసే రేడియో కేంద్రంకూడా ఒకటి వుంది. ఈ రేడియో కేంద్రం ప్రసారంచేసే వార్తలను అనేక దేశాల రేడియో కేంద్రాలు ఆ యా భాషల్లో తిరిగి ప్రసారంచేస్తూ వుండటంకూడా కద్దు.

ఐక్యరాజ్య సమితి ప్రచురణశాఖ వారం వారం ఒక వార్తా పత్రాన్ని (బులెటిన్) ప్రచురిస్తుంది. సంవత్సరం

ఆఖరున, ఆ సంవత్సరంలో జరిగిన పనులన్నింటినీ వివరిస్తూ ఒక వార్షిక సంచికనుకూడా ప్రచురిస్తుంది. ఈ ప్రచురణలన్నీ అందరికీ అందుబాటులో వుండేటట్లు చాలా చౌకగా వాటి ధరలను నిర్ణయిస్తారు. సమితి శాఖలలో ఏ శాఖకు మీరు జాబు వ్రాయదల్చుకున్నా చిరునామా ఒక్కటే. ఆ శాఖ పేరు వ్రాసి పోస్టు బాక్సు నెం. 1000, న్యూయార్కు 1, న్యూయార్కు అంటే అందుతుంది.

సెక్రెటరీ జనరల్‌కు మీ రే విషయంగురించి అయినా జాబు వ్రాయవచ్చును. ఆయన ఆంతరంగిక కార్యదర్శులు ఆ లేఖను చూచి ఆలేఖకు ఏ శాఖ సరియైన సమాధానం ఇవ్వగలదో ఆ శాఖకు పంపుతారు.

న్యూయార్కులో వున్నవారు స్వయంగా వెళ్ళి తమకు కావాల్సిన సమాచారాన్ని తెలుసుకోవచ్చును. ముందుగా ప్రజాసమాచార శాఖకు జాబువ్రాసి గాని, టెలిఫోనుచేసి గాని మీకు ఏ విషయం కావాలో చెప్పాలి. వారు ఆ విషయాలు మీకు ఎవరిద్వారా తెలియగలవో చెప్తారు. అప్పుడు ఆ శాఖకు ఫలానా విషయం తెలుసుకునేందుకు ఫలానా టైముకు వస్తామని టెలిఫోను చేయాలి. మీరు వెళ్ళేసరికి వారు అంతా సిద్ధంచేసి వుంచుతారు. సమితి కార్యాలయంలో దాదాపు 1599 టెలిఫోన్లు వున్నవి. సమితి కార్యాలయం ప్రతిరోజు కొన్నివేల ప్రశ్నలకు సమాధానాలు చెప్తూ వుంటుంది.

బహిరంగంగా జరిగే సమితి సమావేశాలు వేటికైనా మీరు ప్రేక్షకులుగా హాజరు కావచ్చును. ఏ సమావేశానికి హాజరు కాదల్చుకుంటే అందుకు సంబంధించిన శాఖవద్దకు వెళ్ళి ప్రేక్షకుల టికెట్లు తీసుకోవాలి. ఇందుకు ఫీజు ఏమీ చెల్లించ నవసరంలేదు. విద్యార్థులను తీసుకుని కొందరు అధ్యాపకులు ఈ సమావేశాలకు హాజరు కావాలనుకుంటారు. వీరు ముందుగా లేక్ సక్సెస్‌లోని విద్యావిషయక సంఘం కార్యాలయంతో ఏర్పాటు చేసుకోవాలి.

ఈ సమావేశాలకు మనం హాజరు కావడానికి వీల్లేదని ఎవ్వరూ చెప్పలేరు. ఒక్క రహస్యంగా జరిగే సమావేశాలను వదిలివేస్తే మిగతా సమావేశా లన్నంటికీ హాజరయ్యే హక్కు మనందరికీ వుంది. సమితి, సమితిసంఘాలు ఏం చేస్తున్నవో ప్రపంచ ప్రజలు అందరూ తెలుసుకోనడం అవసరం అని సమితి వుద్యోగులు అందరికి తెలుసు. సమితి మన అందరికీ చెందిన సంస్థ కాబట్టి, ఆ సమితి వ్యవహారాలను తెలుసుకునే హక్కు, అధికారం మనందరికీ వుంది.

సమితికి చెందిన వివిధశాఖలు, సంఘాలు చేసే నిర్ణయాలు మన జీవిత విధానాన్నే పూర్తిగా మార్చివేయగలవు. బాంబులనుంచి, యుద్ధ ఫలితంగా ఏర్పడే కరువు కాటకాల నుంచి సమితి మిమ్మల్ని కాపాడవచ్చు; కాపాడలేక పోవచ్చు. కాని, ఈ సమితి ఏ యే పనులు చేయాలని మీరు అభిప్రాయపడుతున్నారో సమితి ఉద్యోగులకు తెలియజెప్పడం మీ విధి.

## మూడవ భాగం

# విపత్కర పరిస్థితులలో సమితి ఏమి చేస్తుంది?



### అధ్యాయం - ౯

అర్జెంటినా నుంచి బొలీవియా గోధుమలు తెప్పించుకుంటుంది. బొలీవియాలో అర్జెంటినా తగరం కొంటుంది. కొన్నాళ్లు ఇలా జరిగింది. ఇంతలో బొలీవియా తన తగరాన్నంతా మరొక దేశానికి అమ్ముతూ ఈ లావా దేవీలకు సంబంధించి ఒక ఒడంబడిక కుదుర్చుకుంటుంది. అర్జెంటినా ఈ విషయం గ్రహించి బొలీవియాకు గోధుమలను అమ్మడం మాని వేస్తుంది. బొలీవియా ప్రజలు తిండికి కటకటలాడిపోతారు. అర్జెంటినా చర్యకు ప్రతీకారం ఏమిటా అని బొలీవియా ప్రభుత్వం విచారిస్తుంది. "మీరు మాకు గోధుమ సప్లయిచేయకపోతే మేము మీకు రబ్బరు సప్లయిచేయం," అని అర్జెంటినా ప్రభుత్వానికి బొలీవియా ప్రభుత్వం స్పష్టం చేస్తుంది. బొలీవియా బెదిరింపులకు అర్జెంటినా లొంగివస్తుందా? ఎప్పటికీ లొంగిరాదు. "మీరు మాకు రబ్బరు ఇవ్వకపోతే మేము మీకు మాంసం పంపం," అని సమాధానం చెప్తుంది. ఈ విధమైన పరస్పర బెదిరింపులకు హద్దు వుండదు.

బొలీవియా, అర్జెంటినాల్లో ఏ దేశం ఒడంబడికను భంగ పరచినా రెండవ దేశం అంతర్జాతీయ న్యాయస్థానానికి ఫిర్యాదు చేయవచ్చును. లేదూ సమితి ఆర్థిక, సాంఘిక సంఘానికి ఈ వ్యవహారాన్నంతా నివేదించి పరిష్కార మార్గాన్ని సూచింపమని కోరవచ్చును. తీరా ఆర్థిక, సాంఘిక సంఘం విచారణ ప్రారంభించేసరికి ఈ తగాయిదా కేవలం అర్జెంటినా, బొలీవియాలకు మాత్రమే పరిమితమై లేదనీ, ఇంకా ఏడెనిమిది దేశాలు ఇందులో చిక్కున్నాయనీ బయట పడు తుంది. ఈ సమస్యా పరిష్కారం ఒక తీర్మానంవల్ల గాదనీ, ఇందుకు ఒక పథకం కావాలనీ ఆర్థిక సాంఘిక సంఘం గ్రహిస్తుంది. ఆ విధంగా ఒక పథకాన్ని తయారుచేసి ఈ ఏడెనిమిది రాజ్యాలకూ పంపడానికి తీర్మానిస్తుంది. ఈ రాజ్యాలు ఈ తీర్మానాన్ని అంగీకరించి ఆ పథకాన్ని ఆమో దిస్తే తిరిగి అన్ని దేశాలకూ గోధుమ, తగరం, రబ్బరు అన్నీ ఏ పేచీలూ లేకుండా లభిస్తవి.

ఈ సమస్య ఈ విధంగా పరిష్కారం కానప్పుడు ఏమి చేయడం? అర్జెంటినా అన్ని వుపాయాలను ప్రయోగించి చూస్తుంది. ఫలితం వుండదు. అప్పుడు వెంటనే బొలీవియాపై భద్రతామండలికి ఫిర్యాదు చేస్తుంది. తన ప్రతినిధిని ఒకరిని పంపి మండలికి విషయాన్ని వివరిస్తుంది. భద్రతామండలి సావధానంగా విని యిందుకు సంబంధించిన యావత్తు వివరా లనూ తెలుసుకుంటుంది. ఫిర్యాదుచేసిన అర్జెంటినా సమితిలో చేరి వుండక్కర్లేదు. అయితే, ఈ తగాయిదాను, శాంతియుత

మార్గాలను అనుసరించే పరిష్కరించుకుంటానని మాత్రం అర్జెంటీనా ముందుగా భద్రతామండలికి హామీ ఇవ్వాలి.

సమితి దేశం ఏదైనా ఒక తగాయిదాపై ఆ దేశానికి సంబంధించింది కాకపోయి నప్పటికీ భద్రతామండలికి ఫిర్యాదు చేయవచ్చును. ఈ తగాయిదాను భద్రతామండలికి నివేదించడం అవసరమని ఆ దేశం భావించితే చాలు.

అసలు ఒక దేశం నివేదించేవరకూ కూడా భద్రతా మండలి ఆగ నవసరం లేదు. ప్రపంచంలో ఎక్కడైనా సరే శాంతికి భంగం కలిగించే పరిస్థితులు ఏర్పడుతున్నట్లు తెలియ వస్తే, వెంటనే ఒక ప్రవీణుల సంఘాన్ని నియమించి సమా చారాన్ని సేకరించుకు రమ్మని అక్కడికి పంపవచ్చును.

స్పెయిన్‌ను పాలిస్తున్న ఫ్రాంకో ఫాసిస్టు ప్రభుత్వం గురించి ఏమి చేయాలి అనే విషయంమీద భద్రతామండలి ఒక నిర్ణయానికి రాలేకపోయింది. సమగ్రవిచారణ జరిపి, నిజస్థితిని తెలుసుకొని నివేదింపవలసిందిగా భద్రతామండలి ఒక వుపసంఘాన్ని నియమించింది. ఈ వుపసంఘం న్యూయార్క్ వదిలివెళ్ళలేదు. ఫ్రాంకో స్పెయిన్‌ను గురించి ఎవరు ఏ విషయం తెలియజేసినా ఆ విషయాన్ని విచారించ గలమని మాత్రం ప్రకటించింది. అంతే. ఎక్కడెక్కడినుంచో ఈ వుపసంఘానికి లెఖ్ఖలేనన్ని నివేదికలు, విజ్ఞాపనలు, పత్రాలు వచ్చిపడినవి. అమెరికా ప్రభుత్వమే ఎన్నో రహస్య పత్రాలను పంపింది. వెనుక ఫ్రాంకో హిట్లరుకు వ్రాసిన లేఖల

ప్రతులను కూడా అమెరికా విదేశాంగశాఖ ఈ కమిటీకి పంపింది. రిపబ్లికన్ స్పెయిన్ కాందిశీకుల నాయకుడు స్వయంగా ఈ కమిటీని కలుసుకొని తనకు తెలిసిన విషయాలను వివరించాడు.

ఫ్రాంకో ప్రభుత్వం స్వయంగా ఈ విచారణలో పాల్గొనలేదు. కాని, స్పెయిన్‌లోని ఫ్రాంకో అభిమాన పత్రికలు కమిటీ అధీనంలో వున్న విషయాలన్నీ అబద్ధాలేనని నిరూపించడానికి ప్రయత్నించినవి. భద్రతామండలి నియమించిన ఈ కమిటీ ఈ వార్తాపత్రికల వాదనను కూడా పరిశీలించింది.

విచారణ అంతా పూర్తి అయిన తరువాత వుపసంఘం వారు భద్రతామండలికి తమ నివేదికను సమర్పించారు. భద్రతామండలి కమిటీ నివేదికను చర్చించిందిగాని, కమిటీ సిఫార్సులను మాత్రం అంగీకరించలేదు. ఫ్రాంకో స్పెయిన్ విషయంలో ఏం చేయాలో వివరిస్తూ భద్రతామండలే స్వయంగా కొన్ని సిఫార్సులు చేసింది.

సాయుధ సంఘర్షణలు ప్రారంభం అయ్యేవరకూ భద్రతామండలి ఏ పరిస్థితిలోనూ ప్రమేయం పెట్టుకొనడానికి వీల్లేదు అనే నిబంధన ఎక్కడా లేదు. అట్టి సంఘర్షణకు దారితీయగల పరిస్థితి ఏర్పడిందని తెలుసుకున్నప్పుడే మండలి జోక్యం కల్గించుకో వచ్చును.

ఒక ముస్లిం రాజ్యం వుంది. అక్కడ నూనె గనులను త్రవ్వడానికి మరొక దేశంనుంచి కొంతమంది క్రైస్తవులు ఆ దేశం వెళ్లారు. పని ప్రారంభించేసరికి స్థానిక ముస్లిం ప్రజలు

ఉద్రిక్తులై ఈ క్రైస్తవులపై అత్యాచారాలు చేయ నారం భిస్తారు. ఈ ప్రజలను అదుపులో వుంచడానికి ఆ ముస్లిం ప్రభుత్వం ఏ విధమైన చర్యలూ తీసుకోదు.

రాజకీయ నాయకులు సభలు జరిపి "ఇకమీదట ఏ క్రైస్తవుడైనా మా దేశంవచ్చి మా సంపదను దోచుకోడానికి ప్రయత్నిస్తే అతన్ని ప్రాణాలతో పోనివ్వం" అని ఉపన్యాసాలు చేస్తారు. ఈ ప్రసంగాలను ప్రజలు హర్షిస్తారు. "క్రైస్తవుడుకన్పిస్తే నరికివేస్తాం"అంటూ నినాదాలు చేస్తారు.

ఇంత జరుగుతున్నా ప్రభుత్వం ఏమీ పట్టించుకోదు. దీన్నే "ఒక అసాధారణ పరిస్థితి"గా అభివర్ణిస్తారు. యదార్థానికి ఇది రెండు దేశాలమధ్య ఏర్పడిన తగాయిదా కాదు. ఈ అసాధారణపరిస్థితి అంతర్జాతీయ తగాయిదాగా పరిణమించనూ లేదు. ఆ విధంగా పరిణమించే ప్రమాదం మాత్రం లేకపోలేదు.

ఉద్రిక్తులైన ప్రజలు ఈ విదేశీ ఇంజనీర్లలో ఇద్దరు ముగ్గురిని హత్య చేశారనుకోండి. అప్పుడు ఈ ఇంజనీర్లు ఏ దేశానికి చెందినవారో ఆ దేశం ప్రభుత్వం ఈ విధంగా ఆ ముస్లిం ప్రభుత్వానికి ఒక శ్రీముఖం పంపుతుంది. "ఈ హత్యలను నివారించేందుకు మీరు ఏ విధమైన చర్యలూ తీసుకోనలేదు. ఈ విధంగా జరుగబోతున్నదని మీకు తెలుసు. అయినా మీరు నిమ్మకు నీరెత్తినట్లు పలక్కుండా కూర్చున్నారు. ఈ ఉద్యోగుల హత్యకు పరిహారంగా మీరు 20 లక్షల రూపాయలను చెల్లించాలి. ఇక ముందు ఇలా జరగకుండా అవసర

మైన కట్టుదిట్టాలు చేయాలి. మీరు ఏమీ చేయకపోతే 'మా సైన్యాన్ని పంపి ఈ వ్యవహారాన్నంతా మేమే పరిష్కరిస్తాం."

ఎక్కడైనా ఒక అసాధారణ పరిస్థితి ఏర్పడిందీ అంటే అది క్రమంగా ఎలాంటి విషమ, విషాద సంఘటనలకు దారి తీస్తుందో ఇందువల్ల స్పష్టం అవడం లేదూ ?

కనుకనే భద్రతామండలి అసాధారణ పరిస్థితి ఏర్పడినట్లు తెలియరాగానే ఆ పరిస్థితిని అదుపులో వుంచి, ఆ విధమైన పరిస్థితి ఏర్పడ్డానికి గల కారణాలను విచారించి వాటిని తొలగించడానికి ప్రయత్నిస్తుంది.

సమితి ప్రణాళికను ఆమోదించిన అన్ని రాజ్యాలూ తమ తగాయిదాలను శాంతియుత మార్గాలను అనుసరించి పరిష్కరించుకోగలమని వాగ్దానం చేసినవి. అయితే, కొన్ని దేశాలు 'గోటితో గిల్లివేస్తే పొయేదాన్ని గొడ్డలితో సంహరించాల్సిన' అవసరం ఏర్పడేవరకూ కావాలని ఉపేక్షించి ఊరుకుంటవి. ఏదైనా ఒక పరిస్థితి ఏర్పడినప్పుడు వెంటనే తొలగించడానికి ప్రయత్నించక అది ఎలా విషమిస్తుందా, పక్కరాజ్యంపై యుద్ధం ప్రారంభించడానికి ఈ పరిస్థితి ఎప్పుడు అనుకూలిస్తుందా అని కొన్ని ప్రభుత్వాలు కాచుకు కూర్చుంటవి.

ఇలాంటి ప్రమాదం వుందని సమితి ప్రణాళికను తయారు చేసిన రాజ్యాంగ తంత్రజ్ఞులు గుర్తించక పోలేదు. కనుకనే ఇలాంటి పరిస్థితి ఏర్పడగానే ఈ తగాయిదాను పరిష్కరించు

కొనడానికి తక్షణం ప్రయత్నించాలని భద్రతామండలి కక్షిదారులిద్దర్నీ ఆదేశించవచ్చును.

సమితిలో చేరని దేశాలనుకూడా భద్రతామండలి ఈ విధంగానే ఆదేశించవచ్చు. ఇది ప్రపంచ సంస్థ. సమితి ప్రణాళిక సమితిలో సభ్యత్వంగల దేశాలపై ఈ సంస్థకు ఎలాంటి అధికారం ఇస్తుందో సభ్యత్వంలేని దేశాలపైకూడా అలాంటి అధికారాల్నే ఇస్తుంది. ఈ గ్రంథాంతాన వున్న ప్రణాళిక పూర్తిపాఠాన్ని మీరు శ్రద్ధగా పరిశీలిస్తే ఈ విషయాలన్నీ బోధపడగలవు.

రెండు దేశాలు తగాయిదాబడి కీచులాడుకోవడం ప్రారంభిస్తే, ఈ తగాయిదాను పరిష్కరించి ఆ దేశాలమధ్య స్నేహ సంబంధాలను ఏర్పాటు చేయడానికి భద్రతామండలి రెండు మార్గాలను అనుసరిస్తుంది. ముందు ఈ రెండు దేశాలకూ "మనం అందరం ఒక్కటేగదా. అందరం మిత్రులమే. కాబట్టి, మీ తగాయిదాను మైత్రీపూర్వకంగానే పరిష్కరించుకోవడం మంచిది. అలా పరిష్కరించుకోడానికి మీరు సమ్మతించకపోతే..." అని చెప్తుంది.

ఏ తగాయిదానైనా సాత్వికమార్గాన పరిష్కరించుకోవడానికి ఎన్నో పద్ధతులు వున్నవి. ఈ రెండు దేశాలూ తగాయిదా అంశాన్ని పరిశీలించి సమాధాన మార్గాన్ని అన్వేషించేందుకు సంప్రతింపులు జరిపే నిమిత్తం కొందర్ని ప్రతినిధులను నియమించవచ్చును. ఇరుపక్షాలూ కొంత త్యాగం చేస్తేగాని తగాయిదా పరిష్కారం అయ్యే అవకాశం లేదని

స్పష్టమైనప్పుడు ఐచ్ఛికంగానే ఆ దేశాలు అట్టి త్యాగాన్ని చేస్తే తిరిగి స్నేహసంబంధాలను ఏర్పరచుకోవడం సులభం.

రాజీ సంప్రతింపుల వల్లగాని, విచారణ ద్వారాగాని, సమాధాన మార్గానగాని తగాయిదా పరిష్కారం కానప్పుడు కక్షిదారులు వుభయులూ కలిసి ఒక పరిష్కర్తను ఎన్నుకొని ఆ పరిష్కర్త తీర్పుకు కట్టుబడి వుంటామని ప్రకటించుకోవడం.

దక్షిణ అమెరికా రిపబ్లిక్‌లు పరాగ్వే. బొలీవియాలు ఒక స్వల్ప విషయంమీద మూడు సంవత్సరాలు యుద్ధం చేసినవి. ఎటూ తేలలేదు. అమెరికన్ రిపబ్లిక్‌ల అధ్యక్షులు ఆరుగురు ఒక పరిష్కర్త సంఘంగా ఏర్పడి ఈ తగాయిదాను పరిష్కరించడం మంచిదని రెండు రాజ్యాలూ అభిప్రాయ పడ్డవి. ఈ సంఘం తీర్పుకు కట్టుబడి వుంటామని రెండు ప్రభుత్వాలూ ప్రకటించినవి. ఈ పరిష్కర్తలు ఆరుగురులోనూ అమెరికా అధ్యక్షుడు రూజ్‌వెల్ట్ ఒకడు. వీరు తగాయిదాను ఆమూలాగ్రం పరిశీలించారు. "చాకో" భూభాగం ఏ దేశానికి చెందాలి అన్నదే అసలు తగాయిదా విషయం. ఇందులో ఎక్కువ భాగాన్ని వీరు పరాగ్వేకే ఇచ్చారు. అయితే, ఆ ప్రాంతంలోని ఒకనదిని చేరేందుకు బొలీవియాకు 'చాకో' మీదుగా దారి వుండాలన్నారు. బొలీవియాకు కావాల్సింది ఇంతే. ఆ నదిని చేరడానికి దారి సంపాదించాలనే ఉద్దేశ్యంతో 'చాకో' నంతటిని ఆక్రమించడానికి పరాగ్వేతో మూడు సంవత్సరాలు యుద్ధం చేసింది. పరిష్కర్తలు అసలు విషయాన్ని తెలుసుకొని ఇచ్చిన తీర్పు రెండు రాజ్యాలకూ సమ్మతమైంది.

1935 లో రూజ్‌వెల్టు ప్రభృతులు ఈ తీర్పు ఇచ్చారు. అప్పటినుంచీ ఈ రెండు దేశాలూ ఎంతో సఖ్యంగా వుంటున్నవి.

పరిష్కర్తృత్వంద్వారా కూడా పరిష్కారం కానప్పుడు తగాయిదాను ప్రపంచ న్యాయస్థానానికి నివేదింపవచ్చును.

1945 వ సంవత్సరంలో అమెరికా రిపబ్లిక్‌లు అన్నీ మెక్సిలో చేరి ఒక ఒడంబడికను కుదుర్చుకున్నవి. ఈ ఒడంబడికనే 'చాపిల్టిపిక్'ఒడంబడిక అన్నారు. అమెరికన్ రిపబ్లిక్‌లు ఇరవై వొక్కటిలో ఏ ఒక రిపబ్లిక్ అయినా తుంటరి చర్యలు ప్రారంభిస్తే మిగతా రిపబ్లిక్‌ల ప్రతినిధులు అందరూ సమావేశమై ఈ వ్యవహారాన్ని విచారించుకోవాలని అప్పుడు నిర్ణయించుకొన్నారు. ఈ ఇరవై రిపబ్లిక్‌ల ప్రతినిధులూ సమావేశమై ముందు కర్తవ్యాన్ని నిర్ణయించుకుంటారు. బల ప్రయోగంతో పనిలేని ఏ పరిష్కార మార్గాన్ని అయినా వారు అనుసరించవచ్చును. ఇది సమితి ప్రణాళికలోని 33 వ నిబంధనకు అనుగుణంగానే వుంటుంది.

ఒక్కొక్కసారి కక్షిదారులు తమ తగాయిదాను పరిష్కరించుకోడానికి ఏ మార్గాన్ని అనుసరించాలనే విషయం మీదనే సమాధానానికి రాలేకుండా పోతారు. ఒక పార్టీ తగాయిదాను ప్రపంచ న్యాయస్థానానికి నివేదించాలంటుంది; రెండవ పార్టీ పరిష్కర్తృత్వ సంఘానికి అప్పగించాలంటుంది.

భద్రతామండలి రెండు దేశాల మధ్య ఏర్పడ్డ తగాయిదా యుద్ధానికి దారితీయగలదని అభిప్రాయపడితే, ఆ రెండు

దేశాలూ తగాయిదా పరిష్కారానికి ఏ యే మార్గాలు అనుస రించాలో సూచిస్తుంది. అంతేగాదు; ఆ మార్గాన్ని అనుస రించి తగాయిదాను పరిష్కరించుకొనకపోతే పరిస్థితులు విష మించినప్పుడు స్వయంగా జోక్యం కలిగించుకోవలసి వస్తుందని కూడా భద్రతామండలి ఈ దేశాలను హెచ్చరిస్తుంది. అప్పుడు పశ్చాత్తాపపడి ప్రయోజనంలేదని కూడా సలహా ఇస్తుంది. ఈ రాజ్యాలు ఈ మంచిమాటను చెవిని పెట్టక పోతే భద్రతామండలి ఈ తగాయిదా విచారణను స్వయంగా పూనుకోవచ్చును. అన్నీ విచారించి ఈ రెండు దేశాలూ ఈ విధంగా నడుచుకోవాలని చెప్పగలదు.

అయితే, భద్రతామండలి చెప్పగలదేగాని ఆ విధంగా ఆ దేశాలచేత చేయించలేదు. "మీ తగాయిదాను పరిష్కరించు కునేందుకు మీ రిద్దరూ మరొకరివద్దకు వెళ్లండి," అని సలహా ఇవ్వడానికిబదులు, భద్రతామండలి స్వయంగానే విచారించి న్యాయస్థానంలాగా తీర్పు ఇవ్వవచ్చును.

అసలు తగాయిదాపడ్డ దేశాల్లో ఒక దేశం మరో దేశానికి తమ తగాయిదాను భద్రతామండలికి నివేదిద్దామని సూచింప వచ్చును. రెండు దేశాలూ చేరి భద్రతామండలి తీర్పును అభ్యర్థింప వచ్చును.

కొన్ని సందర్భాల్లో పరిష్కారానికి లొంగని తగాయిదాలకు మూలం ఎప్పుడో ఆ దేశాలు చేసుకున్న ఒడంబడిక అయివుంటుంది. అప్పుడు ఈ తగాయిదాను సమితి సర్వసభ్యసంఘం విచారింపవచ్చును.

దక్షిణ అమెరికా రాజ్యాల్లో ఒక రాజ్యంలో ఒకవ్యక్తి ప్రభుత్వాన్ని కూలదోసి ప్రభుత్వాధికారాన్ని హస్తగతం చేసుకొని నియంతగా వ్యవహరిస్తూ వుంటాడు. ఆయన తన దేశంలోని నూనెను ఒక ధరకు ఇంగ్లండ్‌కు విక్రయించడానికి సమ్మతిస్తాడు. ఆ ప్రకారం ఈ రెండుపక్షాలూ ఒక ఒడంబడికను కుదుర్చుకుంటవి. కొన్నాళ్ళు వ్యవహారం జరుగుతుంది. ఇంతలో నియంతృత్వంపై ప్రజలు తిరుగుబాటుచేసి నియంతను తొలగించి ప్రజాస్వామిక సూత్రాలపై ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకుంటవి. ఈ కొత్త ప్రభుత్వం వెనుకటి ఒడంబడికను పరిశీలిస్తుంది. ఇంగ్లండ్ అతిచౌక ధరకు తన నూనెను కాజేస్తున్నదని ఈ ప్రభుత్వం భావిస్తుంది. కాని, ఇంగ్లండ్ కంపెనీ వెనుకటి నియంతకు చాలాడబ్బు ఇస్తూ వచ్చింది. ఇదంతా చూస్తే నూనెకు సరియైనధర చెల్లించినట్లవుతుంది. అయినా ఈ క్రొత్తప్రభుత్వం ఈ ఒడంబడికను త్రోసిరాజంటుంది. ఈ రెండు దేశాల సంబంధాలూ విషమిస్తవి. అప్పుడు ఈ రెండుదేశాలూ ఈ ఒడంబడికను సవరించుకొనడానికి ప్రయత్నించాలి. ఈ విషయాన్ని సమితి సర్వసభ్య సంఘం విచారించి ఒడంబడిక సవరణ అవసరం అని తీర్మానించ వచ్చును. ఇందుకు అంగీకరింపవలసిన నైతిక బాధ్యత అగ్రరాజ్యంపై వుంది.

అలాగాక ఇందులో ఒకదేశం ఒడంబడిక సవరణను సాధించడానికి యుద్ధానికి దిగితే అప్పుడు భద్రతా మండలి జోక్యం కలిగించుకుంటుంది. అంతా విచారించి ఉభయులూ

సంప్రతింపులద్వారా ఒడంబడికను సవరించుకోవడం మంచిదని చెప్పవచ్చును.

1930 లో జర్మనీలో ఏర్పడ్డ ప్రజాస్వామిక ప్రభుత్వం వర్సేల్సు సంధిని సవరించ వలసిందిగా మిత్రరాజ్యాలను ప్రార్థించింది. ఎవ్వరూ పట్టించుకోలేదు. బ్రిటన్ అమెరికాల్లోని సామాన్య ప్రజలు జర్మనీ సూచన సబబైనదని అంగీకరించారు. కాని మార్చేందుకు ఏ ప్రయత్నమూ జరగలేదు. ఇంతలో హిట్లర్ వచ్చాడు. వర్సేల్సు సంధి అక్రమమైనదని, దాన్ని రద్దు చేయిస్తానని జర్మన్ ప్రజలు ఆయనకు బ్రహ్మరథం పట్టారు. హిట్లర్ జర్మనీ నియంత అయి ఆ దేశాన్ని యుద్ధానికి తయారుచేశాడు. అలాగాక, వర్సేల్సు సంధిని సవరించివుంటే హిట్లరే రాకపోను ; రెండవ యుద్ధమే లేకుండా పోయేది.

### అధ్యాయం ౧౦

## బల ప్రయోగంలో ప్రథమ చర్య

ఇటలీ నియంత ముస్సోలీని ఇథియోపియాను కబళించడానికి నిశ్చయించుకున్నాడు. అందుకుగాను ముందు తన ఇటాలియన్ సైన్యాన్ని సన్నద్ధం చేశాడు. ఇథియోపియాను దూషిస్తూ, ఇథియోపియా ఏవో చర్యలు జరుపుతున్నదని ఊహించుకొని, ఆ చర్యలను ఖండిస్తూ తన పత్రికలలో వ్యాసాలు ప్రచురింపజేశాడు. ఇథియోపియా భరతంపట్టాలని

ఇటాలియన్ ప్రజలు అందరూ కత్తులు నూరేటట్లు చేశాడు. వాగ్యుద్ధం ప్రారంభమైంది.

వాగ్యుద్ధం వాస్తవిక యుద్ధంగా తయారైంది. ఆఫ్రికాలో ఇటలీ వలస ఒకటి వుంది. ఈ వలస సోమలిలాండ్. సోమలి లాండ్-ఇథియోపియా సరిహద్దున 1934 డిసెంబరులో ఇరు పక్షాల సేనలకు స్వల్ప సంఘర్షణ జరిగింది. ఈ సంఘర్షణకు కారకులు ఎవరో విచారించమని నానాజాతిసమితి కొందరు న్యాయమూర్తులను నియమించింది. వీరు విచారించనూ లేదు; తప్పు ఎవరిదో నిర్ణయించనూ లేదు. ఇథియోపియన్లే తన వలసరాజ్యం సోమలిలాండ్ పై దురాక్రమణ జరిపారని ముస్సోలీని పొలికేక పెట్టాడు.

ఈ దురాక్రమణను ప్రతిఘటించడానికి అంటూ సైనికులను, విమానాలను, బాంబులను, టాంకులను, ఫిరంగులను, విషవాయు ప్రయోగ పరికరాలను ఇథియోపియాకు ఉరికించాడు. ఈ నావలన్నీ సూయజ్ కాలువలోనుంచి పోవాలి. సూయజ్ పై యాజమాన్యం బ్రిటిష్ ప్రభుత్వానిది. ఇటలీనుంచి ఆఫ్రికాకు పోతున్న నావలు ఏ సరుకు చేరవేస్తున్నవో బ్రిటిష్ ప్రభుత్వానికి తెలుసును. బ్రిటిష్ పత్రికలు వున్న సంగతులను వున్నట్లు ప్రకటించినవి.

ముస్సోలీని ఇథియోపియా ఆక్రమణకు ఈ సైన్యాన్ని, టాంకులను, ఫిరంగులను పంపుతున్నాడని యావత్ప్రపంచానికీ తెలుసును. ప్రపంచం ఈ విషయాలను తెలుసుకుంటూనే

వుంది. ఇటాలియన్ సేనలు ఇథియోపియాను ఆక్రమించి వేసినవి.

యుద్ధం ప్రారంభం అయ్యేవరకూ ఎవరిమీదా నానాజాతి సమితి ఏ చర్యా తీసుకోలేదు. యుద్ధం ప్రారంభమైన తరువాత కూడా ఆ యుద్ధాన్ని ఆపుచేయడానికి సైనిక చర్యలను జరపలేదు.

ఆనాడు ముస్సోలీని అబిసీనియాను ఆక్రమించిన విధంగా ఈనాడు ఎవరైనా ఒక దేశాన్ని కబళించడానికి సమాయత్తం అవుతూవుంటేనే భద్రతామండలి ఈ అన్యాయాన్ని ముందే ఆపు చేసేందుకు చర్యలు తీసుకోవచ్చు. యుద్ధం ప్రారంభం అయ్యేవరకూ భద్రతామండలి చూస్తూ కూర్చోదు. ఆ రోజుల్లో భద్రతామండలివంటి సంస్థ వుంటే ముస్సోలీని ఇథియోపియాపై దుమ్మెత్తిపోస్తూ వాగ్యుద్ధాన్ని ప్రారంభించి నప్పుడే ముస్సోలీనికి అతని స్థానాన్ని చూపించి వుండేవి.

ఇటలీ నియంత అప్పట్లో తప్పు అంతా అబిసీనియాదే నన్నట్లు ప్రచారంచేశాడు. ఇథియోపియా ఇటలీని అదిరిస్తున్న దనీ, బెదరిస్తున్నదనీ ముస్సోలీని వాదించాడు. ఇందులో నమ్మతగింది ఏమీలేదని అందరికీ తెలుసును. భద్రతామండలి ఇలాంటి పరిస్థితుల్లో ఏం చేస్తుంది? ముందు తప్పు ఎవరిదో నిర్ణయిస్తుంది. వెంటనే కార్యాచరణకు గడంగవచ్చు. తన శాంతి స్వరూపాన్ని కడగావుంచి మహాప్రళయ శక్తి స్వరూపంలో ప్రత్యక్షం కావచ్చును. "ఇక ఎవరు ఏం చేస్తారో

కానివ్వండి" అన్న ధోరణిలో అన్ని అవాంతరాలను ఎదుర్కొనడానికి సిద్ధం కావచ్చును.

భద్రతామండలి ఈ విధమైన వైఖరిని మరి రెండు సందర్భాల్లోకూడా అనుసరింప వచ్చును.

1934 డిసెంబరులో ఇథియోపియా సరిహద్దున సంఘర్షణ ప్రారంభమైన రోజుల్లో భద్రతామండలి వుండివుంటే ఏంచేసి వుండేదో చూద్దాం. "శాంతికి భంగకరమైన పరిస్థితి ఏర్పడిందా" అన్న విషయాన్ని ముందు విచారించి వుండేది. ఇథియోపియా—ఇటాలియన్ సోమలిలాండ్ సరిహద్దున ప్రారంభమైన సంఘర్షణ శాంతికి భంగం కలిగించేదే అన్న విషయంలో ఎవరికీ ఏలాంటి సందేహమూ వుండ నవసరంలేదు.

అబిసీనియాను ఆక్రమించడానికి ఇటాలియన్ నౌకలు సేనలను, టాంకులను, బాంబులను చేరవేస్తున్నవంటే ఇది దురాక్రమణచర్య అవునా, కాదా అన్న విషయాన్ని మండలి విచారిస్తుంది. 'దురాక్రమణ' అంటే అర్థం ఏమిటి? 'తగాయిదా ప్రారంభం' అని అర్థం చెప్పుకోవాలి.

తగాయిదా రెండు విధాలుగా ప్రారంభం కావచ్చును. ఒకదేశం నిర్హేతుకంగా మరోదేశంపై యుద్ధం ప్రారంభిస్తే ఆచర్య దురాక్రమణ అవుతుంది. లేదా ఒకదేశం మరో దేశాన్ని రెచ్చగొట్టినా అదీ దురాక్రమణ క్రిందకే వస్తుంది. కొన్ని పరిస్థితులలో ఏది దురాక్రమణ అని నిర్ణయించే అధికారం సమితి ప్రణాళిక భద్రతామండలికే ఇస్తున్నది.

ప్రపంచంలో ఎక్కడైనా ప్రమాదం గోచరిస్తే ఆ ప్రమాదాన్ని ఎదుర్కొనడానికి భద్రతామండలి ఎవరికోసరమూ ఆగనవసరం లేదు. రెండు దేశాలమధ్య ఏర్పడ్డ తగాయిదాను అంతర్జాతీయ న్యాయస్థానంగానీ, ఆర్థిక, సాంఘిక సంఘంగానీ, సమితి సర్వసభ్య సంఘంగాని విచారిస్తూ వుంటే ఈలోపున ఆ రెండు దేశాల సంబంధాలూ విషమించి శాంతికి భంగం కలిగి ప్రమాదం ఏర్పడితే భద్రతామండలి వెంటనే జోక్యం కల్గించుకోవచ్చు. సమితి ఇతర సంస్థలు ఏవో ప్రయత్నాలు చేస్తున్నవిగదా అని ఆగనవసరం లేదు.

భద్రతామండలి జోక్యం కల్గించుకొనడానికి వీలులేని 'యుద్ధం' ఒకటి వుంది. ఒక దేశంలో రెండు వర్గాలు తగాయిదా పడి దౌర్జన్య చర్యలకు దిగవచ్చు. క్రమంగా అది అంతర్యుద్ధం కావచ్చు. అలాంటి యుద్ధాల్లో భద్రతామండలి జోక్యం కల్గించుకునేందుకు సమితి ప్రణాళిక అవకాశం ఇవ్వడం లేదు. ఈ మాదిరి అంతర్యుద్ధాలు దాదాపు ప్రపంచంలోని అన్ని దేశాల్లోనూ జరుగుతూనే వచ్చినవి. కొన్ని అంతర్యుద్ధాలు ఆ యా దేశాలకు మాత్రం పరిమితమై వుంటవి. మరి కొన్ని ఇతర ప్రాంతాలకుకూడా విస్తరింపవచ్చును. అలాంటి పరిస్థితులలో ఏ అంతర్యుద్ధమైనా ఇతర దేశాలకు విస్తరించే అవకాశం వుందా అని భద్రతామండలి విచారించి ఒక నిర్ణయానికి రావలసి వుంటుంది.

"ఏదైనా ఒక దేశం శాంతికి భంగం కల్గించబోతున్నదా? శాంతిని భగ్నం చేస్తున్నదా? దురాక్రమణ చర్యలు జరుపు

తున్నదా ?'' ఈ విధమైన సమస్యలను పరిష్కరింపవలసి వచ్చినప్పుడు భద్రతామండలి ఎంతో గురుతరమైన బాధ్యతను నిర్వహింపవలసి వుంటుంది. పైన పేర్కొన్న మాదిరి పరిస్థితులు ఏర్పడలేదని భద్రతామండలి అభిప్రాయపడినప్పుడు, ఆ పరిస్థితిని ఎదుర్కొనేందుకు, ఆ సమస్యను పరిష్కరించేందుకు సాత్వికపద్ధతులను, శాంతియుత మార్గాలను అనుసరింపవలసివుంటుంది. అలాగాక, పైన వివరించిన మాదిరి పరిస్థితి ఏర్పడిందని భద్రతామండలి నిర్ణయిస్తే ఆ వ్యవహారాన్ని పరిష్కరించడానికి సైనిక చర్యలు తీసుకోవచ్చును. ఈ విధమైన నిర్ణయం ఎంత ప్రధానమైందో గ్రహించడానికి ఒక్క సంగతి తెలుసుకుంటే చాలు. భద్రతామండలి ఈ నిర్ణయం చేయవలసి వచ్చినప్పుడు, ఏ అగ్రరాజ్యమైనా అట్టి రాజ్యానికి ఈ పరిస్థితితో ప్రత్యక్ష సంబంధం వున్నప్పటికీ, వీటో ప్రయోగింపవచ్చును.

ఒక ''తగాయిదా శాంతిని భగ్నం చేసేదే'' అని భద్రతా మండలి తీర్మానిస్తే ఆ తగాయిదా పరిష్కారానికిముందు ఏ చర్య తీసుకోవాలోకూడా నిర్ణయించాల్సి వుంటుంది. ఒక మార్గాన్ని సూచించి కక్షిదారులు ఆ మార్గాన్ని అనుసరించాలని ఆదేశింపవచ్చును. అలాగానిపక్షంలో భద్రతామండలే స్వయంగా చర్యలు తీసుకోవచ్చును.

తగాయిదా పొడచూపిన వెంటనే కొద్దిచర్యలుతీసుకుంటే ఎంతో ప్రయోజనం వుంటుంది. రెండు దేశాల సరిహద్దున సైనిక సంఘర్షణలు ప్రారంభమైనప్పుడు భద్రతామండలి ఆ

రెండు దేశాలకూ ఈ విధంగా సూచించవచ్చును. "మీ సంఘర్షణనుగురించి మేము సమగ్రంగా విచారించే పర్యంతం మీరిద్దరూ మీ మీ సేనలను సరిహద్దుకు మూడుమైళ్ళ దూరాన వుంచాలి; సరిహద్దులనున్న సేనలను తక్షణం వుపసంహరించాలి."

ఒక దేశానికి చెందిన పౌరులను మరొక దేశ ప్రభుత్వం నిర్బంధించి వారిని కాల్చివేయడానికి నిర్ణయించవచ్చు. వారు తమ దేశ వ్యవహారాల్లో ఏదో జోక్యం కల్గించుకున్నారని వాదింపవచ్చును. అప్పుడు మొదటి దేశం తన పౌరుల ప్రాణాలను రక్షించడానికి రెండవదేశంపై యుద్ధాన్ని ప్రారంభింపవచ్చును. లేదా వెంటనే ఈ పౌరులను విడుదల చేయకపోతే యుద్ధం చేయవలసి వస్తుందని బెదిరింపవచ్చును. అట్టి పరిస్థితిలో భద్రతామండలి మొదటి దేశానికి ఈ విధంగా సలహా ఇవ్వవచ్చును. "మేము ఈ వ్యవహారాన్ని పూర్తిగా విచారించేవరకూ మీరు ఆ పౌరులను కాల్చివేయరాదు. మీ నిర్ణయాన్ని అమలు జరుపకుండా ఆగండి."

ఎప్పటికప్పుడు భద్రతామండలి సభ్యులు 11 మందీ అప్పుడప్పుడు ఏర్పడుతున్న రకరకాల సమస్యలను పరిష్కరించడానికి పరిస్థితులకు తగినట్లుగా ఆలోచనలు చేస్తూ వుంటారు.

ప్రతి సమస్యాపరిష్కారానికీ భద్రతామండలి చేసే ప్రతిపాదనలను అందుకు సంబంధించిన దేశాలు వళ్లు దగ్గర పెట్టుకొని విచారించుకోవలసి వుంటుంది. ఏ దేశం ఈ ప్రతి

పాదనలను నిర్లక్ష్యంచేసినా భద్రతామండలి బలప్రయోగానికి దిగి అందరూ చూస్తూ వుండగానే ఈ పరిస్థితిని పరిష్కరించి వేస్తుంది.

ఒక దేశం మరొక దేశంపై యుద్ధం ప్రారంభించింది. ఫిరంగులుపేలుస్తూ, విమాన దాడులు జరిపి విశేషమైన నష్టాన్ని కల్గిస్తూ వుంటుంది. దురాక్రమణకు గురియైన దేశం భద్రతామండలి జోక్యం కల్గించుకునేవరకూ ప్రతిఘటన చర్యలు తీసుకోకూడదని ఎక్కడా లేదు. ఆత్మరక్షణకు ఎదురు సైనికచర్యలను ప్రారంభింపవచ్చు. ఇతర దేశాల సహాయాన్ని పొంది దురాక్రమణదారుని ప్రతిఘటించడానికి ఏచర్యలనైనా తీసుకోవచ్చును.

సైనిక చర్యలు ప్రారంభమైనప్పుడే అట్టి చర్యలకు గురియైన దేశం ఎదురు సైనిక చర్యలను జరపవచ్చునుగాని, ఆర్థిక, వాణిజ్యరంగాల్లో ఒక దేశం మరో దేశంపై "యుద్ధ చర్యలను" సాగించినా అందుకు గురియైన రాజ్యం సైనిక చర్యలు తీసుకునేందుకు వీల్లేదు.

భద్రతామండలి ప్రత్యక్ష చర్యలకు దిగిందీ అంటే, మండలి జనసంహారానికి పూనుకున్నదని అర్థంగాదు. సైనిక బలప్రయోగానికి ముందు అంత శక్తివంతమైన ప్రయోగం మరొకటి ఏదైనావున్నదా అని విచారించే ఆఖరు మార్గాన్ని అనుసరిస్తుంది. ఇతర ప్రయోగాలన్నీ నిష్ప్రయోజనం అయి నప్పుడే భద్రతామండలి సైనికశక్తిని ప్రయోగిస్తుంది.

ఒక దేశం దురాక్రమణ జరిపినట్లు భద్రతామండలి భావిస్తే ఆ దేశంతో సమితి దేశాలు ఏవీ రాజకీయ సంబంధాలను పెట్టుకోరాదని మండలి తీర్మానంచేయవచ్చును. ఇది కేవలం సాత్విక మార్గం కాదు. భద్రతామండలి ఈ విధమైన నిర్ణయంచేసిందీ అంటే, ఇందువల్ల దురాక్రమణ జరిపిన ప్రభుత్వాన్నిగాక, ఒకజాతిని మొత్తంగా శిక్షించిందన్నమాట.

ఒక దేశంతోవున్న రాజకీయ సంబంధాలను త్రెంచి వేసుకొని ఆ దేశంతో తెగతెంపులు చేసుకోనడమూ అంటే, ముందు ఆ దేశంలోవున్న రాయబారిని పిలిపించివేయడం జరుగుతుంది. మన దేశంలోవున్న ఆ దేశపు రాయబారిని ఇంటికి పొమ్మని చెప్పేస్తాం. అప్పుడు ఆ దేశానికి మనతో ఏ ఒడంబడిక చేసుకోడానికీ అర్హతవుండదు. అంతేగాదు. ముందెన్నడో చేసుకొన్న ఒడంబడికను మనం రద్దు చేసివేస్తే "మీరు అలా చేశారెందు"కని అడిగే అర్హతగాని, హక్కుగాని ఆ దేశానికి వుండదు. ఏదేశంనుంచీ ఆ దేశానికి పైసా సహాయం లభించదు. ఇదివరలో కొన్న సరకు ఖరీదు ఇంతవరకూ చెల్లించి వుండకపోతే ఇప్పుడు ఎగవేసినా ఆ దేశం ఆక్షేపించలేదు.

ఈ విధంగా ఇతర ప్రపంచంతో ఏ సంబంధమూలేక ఈ దేశం ఎంతోకాలం మనలేదు. ఆ దేశం పడే అవస్థలకు అంతువుండదు. ఈ విధమైన సహాయ నిరాకరణవల్ల అట్టే ప్రయోజనంలేదని అనుకుంటే, భద్రతామండలి దురాక్రమణ జరిపిన దేశంపై ఆంక్షలను ప్రయోగింపవచ్చును.

ఆంక్షలను ప్రయోగించడం అంటే ఏమిటి? దురాక్రమణ జరిపిన దేశంనుంచి ఇతర రాజ్యాలు ఏసరుకూ కొనగూడదు; ఆ దేశానికి ఏసరుకూ అమ్మకూడదు. కొన్ని సమయాల్లో ఏవిధమైన సరుకును అమ్మరాదో కూడా నిర్ణయిస్తుంది. యుద్ధ చర్యలను కొనసాగించేందుకు వుపయోగపడే గాసొలిన్, తుపాకులు, అల్యూమినియం, ఇనుము, ఉక్కు మొదలైన వాటిని విక్రయించరాదని ఖచ్చితంగా చెప్ప వచ్చును. ఇలాగాకపోతే, దురాక్రమణ జరిపిన దేశాలతో ఎలాంటి వ్యాపారమూ చేయరాదని బండగా చెప్పవచ్చు. రాకపోకల సౌకర్యాలన్నింటిని రద్దుచేసి ధిగ్బంధనం ప్రయోగింపవచ్చును. ఈ విధంగా చేసివేస్తే దురాక్రమణ జరిపిన దేశం ఎంతో కాలం యుద్ధం చేయలేదు. నిలువ చేసుకున్న సామాగ్రి క్రమంగా హరించిపోతుంది. కొన్నాళ్లు యుద్ధం చేసేసరికి, ఇక యుద్ధం చేయగల శక్తి ఆ దేశానికి లేకుండా పోవచ్చును.

ఈ మార్గాన తగాయిదా పరిష్కారం కాగల అవకాశం లేదని భద్రతామండలి అభిప్రాయపడితే ఇతర చర్యలు తీసుకోవచ్చును.

ఇంతటి శక్తి, అధికారం నానాజాతి సమితికి లేక పోయింది. ఇటలీపై ఆంక్షలు ప్రయోగించాలనే తీర్మానాన్నే ఆ సమితి చేయలేకపోయింది. యుద్ధావసర వస్తువుల సప్లయిని నిషేధింపలేకపోయింది.

ఈ లోపాలన్నింటినీ తొలగించి ఐక్యరాజ్య సమితిని, భద్రతామండలిని నానాజాతి సమితికంటే ఎక్కువ సమర్థంగానూ, శక్తివంతంగానూ చేయడం జరిగింది.

అధ్యాయం ౧౧

## బలప్రయోగం అవసరమైతే

యుద్ధాన్ని నివారించగల శక్తి, సాధనసంపత్తి గల ప్రపంచ సంస్థ ఒకటి ఏర్పడ్డం ఇదే మొదలు. ఇలాంటి సంస్థ ఇదివరకు ఎన్నడూ ఏర్పడివుండలేదు. ఈ సంస్థ పరంగా యుద్ధనౌకలు, బాంబరు విమానాలు, ఫిరంగులు, టాంకులు వున్నవని తెలుసుకున్న ఏ దేశమూ అంత సులభంగా, అంత అనాలోచితంగా దురాక్రమణకు దిగదు. సైనిక చర్యలను ప్రారంభించడానికి ముందు ప్రతి దేశమూ ఎన్నో విషయాలను విచారించుకోవాలి. వళ్లు దగ్గిరపెట్టుకొని ప్రవర్తించాల్సి వుంటుంది.

సమితి సైన్యాన్ని దురాక్రమణకు దిగిన అల్పరాజ్యాల పైనా, మిత్రరాజ్యాలపై శత్రుత్వంకట్టిన జర్మనీ, జపాన్ దేశాలపైనా మాత్రమే ప్రయోగించడానికి వీలుందిగాని, అగ్రరాజ్యాలపై ప్రయోగించేందుకు వీలులేదు.

సమితి ప్రణాళికలో ఈవిధమైన నిబంధన. పరలు వుండడానికి కారణం లేకపోలేదు. సమితి సైన్యాన్ని ఒక చిన్న రాజ్యంపై ప్రయోగించడంవల్ల ఒక పెద్ద యుద్ధాన్ని నివారింపవచ్చును. కాని, ఒక అగ్రరాజ్యంపై ఈసైన్యాన్ని అంతా

ప్రయోగించడంవల్ల ప్రపంచ సంగ్రామమే ప్రారంభం అవుతుంది. ఇందువల్ల, ప్రపంచ నాగరికతే పూర్తిగా నాశనమైపోవచ్చు. మనలో ఎందరో హతంకావచ్చు.

మరి అగ్రరాజ్యాలు ఈ అవకాశం చూచి చిన్న రాజ్యాలను ఆక్రమించడానికి సైనిక చర్యలు ప్రారంభిస్తే ఆ అల్పరాజ్యాలకు రక్షణ ఏది? గతంలో ఈ అగ్రరాజ్యాలు వ్యష్టిగా అల్పరాజ్యాలపై అత్యాచారాలు చేసినవి. 1898లో అమెరికా దౌర్జన్య చర్యలు జరిపి ఫిలిప్పీన్సును ఆక్రమించింది. అలాగే హైటీ ఆర్థిక వ్యవహారాలపై సర్వాధికారాన్ని సంపాదించింది. నికారాగ్వాలో అక్రమంగా అమెరికా నావికులు ప్రవేశించి ఆ దేశాన్ని ఆక్రమించుకున్నారు.

ఇలాంటి సంఘటనలు ఇప్పుడు జరిగితే దురాక్రమణకు గురియైన అల్పరాజ్యాలు తమకు న్యాయం చేయమని అంతర్జాతీయ న్యాయస్థానాన్నిగాని, సమితి సర్వసభ్య సంఘాన్నిగాని అభ్యర్థించవచ్చును. ఈ రెండు సంస్థల్లో అగ్రరాజ్యాల వీటో అధికారం పనిచేయదు. కాకపోతే భద్రతా మండలికే ఫిర్యాదు చేయవచ్చు. ఈ తగాయిదా పరిష్కారానికి మండలి శాంతియుత మార్గాలను అనుసరించినంత కాలం కక్షిదారైన అగ్రరాజ్యంకూడా వీటోను ప్రయోగించడానికి లేదు. అసలు అలాంటి ప్రతిపాదనపై వోటుచేసే హక్కుకూడా ఆ దేశానికి లేదు.

సమితి సైన్యంలో ప్రతి దేశపు సైన్యం కొంత వుంటుంది. ఏ దేశం ఎంత సైన్యాన్ని పంపాలి అనే విషయంమీద భద్రతా

మండలి ప్రతి ఒక్క దేశంతోనూ ప్రత్యేక ఒడంబడిక చేసుకుంటుంది.

ప్రతి దేశంలోనూ యుద్ధవ్యూహాన్ని తయారుచేసే సైనిక ప్రవీణులు కొందరు వుంటారు. వీరందరూ చేరినప్పుడు ఆ 'సంఘాన్ని' జనరల్ స్టాఫ్ అంటారు. ఈ జనరల్ స్టాఫ్‌కు ఒక అధిపతి వుంటాడు. అతన్ని చీఫ్ ఆఫ్ స్టాఫ్ అంటారు. సర్వసేనాపతి అని మనం అనవచ్చును.

అగ్రరాజ్యపంచకం సర్వసేనానులు అయిదుగురూ ముగ్గురు, ముగ్గురు సైనిక నిపుణులను న్యూయార్క్ పంపుతారు. ఈ ముగ్గురూ వారి దేశపు నౌకా, వైమానిక, సైనిక శాఖల ప్రతినిధులు అయివుంటారు. ఈ విధంగా అయిదు అగ్రరాజ్యాలనుంచి వచ్చిన 15 మంది సైనిక ప్రవీణులు "మిలిటరీ స్టాఫ్ కమిటీ"గా వ్యవహరిస్తారు. ఈ మిలిటరీ స్టాఫ్ కమిటీ భద్రతామండలి శాఖగా వ్యవహరిస్తుంది. ఈ కమిటీ ఎప్పుడు, ఎక్కడ సమావేశమౌతుందో ఎవరికీ తెలియదు. ఈ సమావేశాలన్నీ ప్రయివేటుగా జరుగుతూ వుంటవి. అగ్రరాజ్యాలు అవసరం అని భావించినప్పుడు మరి కొన్ని దేశాలనుకూడా ఇలాంటి సైనిక ప్రవీణులను పంపమని కోరవచ్చును. అయితే, అలాంటి అవసరం సామాన్యంగా కలగదు.

సైనిక నిపుణుల మండలిలో అగ్రరాజ్యాల ప్రతినిధులు తప్ప, అల్పరాజ్యాల ప్రతినిధులు వుండకపోవడానికి ఒక కారణం వుంది. ప్రపంచంలో చెప్పుకోతగ్గ సైనిక బలం అంతా అగ్రరాజ్యాల పరంగానే వుంది. సమితి పరంగా ఏ

దేశం ఎంత సైన్యాన్ని వుంచాలి అన్న విషయాన్ని ఈ "మిలిటరీ స్టాఫ్ కమిటీ" నిర్ణయించి, ఆ నిర్ణయాన్ని భద్రతా మండలికి పంపుతుంది. ఈ నిర్ణయాన్ని పొందుపరిచి ఒక ఒడంబడికను తయారు చేస్తుంది. ఏదైనా అవసరం వస్తే భద్రతామండలికి సలహా ఇస్తూ వుంటుందికూడా.

భద్రతామండలి ఈ మిలిటరీ స్టాఫ్ కమిటీ సహాయంతో ప్రపంచంలో ఎక్కడైనా సరే ఒక అవాంతర పరిస్థితి ఏర్పడితే, ఆ పరిస్థితిని ఎదుర్కోవలసిన విధానాన్ని సవివరంగా ఒక పథకం రూపంలో తయారుచేసి సిద్ధంగా వుంచుతుంది. 'చేతులు కాలినతరువాత ఆకులు పట్టుకోవడం' అనేది భద్రతామండలి చరిత్రలో లేదు. ఒక అవాంతరపరిస్థితి ఏర్పడేవరకూ ఆగదు. అలాంటి పరిస్థితి ఏర్పడితే ఏంచేయాలో ముందుగానే ఆలోచించుకొని ఒక నిర్ణయానికి వచ్చి వుంటుంది. భద్రతామండలి సైన్యాన్ని వుపయోగించవలసిన పరిస్థితే ఏర్పడితే, ఈ మిలిటరీ స్టాఫ్ కమిటీకి ఎక్కడ్లేని ప్రాధాన్యం వస్తుంది. ఏ దేశం మీదకు ఎంత సైన్యాన్ని పంపడం అన్న నిర్ణయం చేయడం మాత్రమే భద్రతామండలి బాధ్యత.

ఆ నిర్ణయాన్ని అనుసరించి ఏ దేశపు సైన్యాన్ని ఏ విధంగా పంపాలి ? ఎటునుంచి పంపితే సులభం ? అన్న విషయాలన్నీ విచారించి అవాంతర పరిస్థితి ఏర్పడ్డ ప్రాంతానికి సమీపంగా వున్న దేశాల సేనలను పంపడానికి ఏర్పాట్లు చేస్తుంది.

ఒక ప్రాంతానికి ఒకదేశం ఎంత సైన్యాన్ని పంపాలి అని మండలి నిర్ణయిస్తే, పంపనని చెప్పడానికి ఏ దేశానికీ వీల్లేదు. సేనలను పంపవలసిన సమయం ఆసన్నమైనట్లు మండలి చెప్పగానే సేనలనుపంపగలనని ప్రతిదేశమూ ముందుగానే హామీ యిచ్చింది.

అయితే, మండలినుంచి ఉత్తరువు రాగానే సైన్యాన్ని పంపవలసిన దేశం ముందు భద్రతామండలికి ఈ విధంగా నివేదించవచ్చును. "మేము మా సేనలను, విమానాలను పంపడానికిముందు ఈ తగాయిదా విషయమై మేము చెప్పేది కూడా కొంచెం వినండి." ఆ ప్రకారం ఆ దేశపు ప్రతినిధి భద్రతామండలి సమావేశానికి హాజరై తన వాదాన్ని వినిపిస్తాడు. మండలి దీనిపై వోటింగు తీసుకోవలసి రావచ్చు. మండలిలో సభ్యత్వం లేకపోయినప్పటికీ ఈ దేశం వోటింగులో పాల్గొనవచ్చు. సేనలను పంపడంలాంటి ప్రధాన విషయమై నిర్ణయంచేసే సందర్భంలో ఆ దేశానికి వోటుహక్కు వుండటం న్యాయమేగా!

ఈ విధంగా గాక, అనేక అల్పరాజ్యాలు భద్రతామండలి కోరినట్లు సేనలను పంప నిరాకరించినవనుకోండి. అందువల్ల పరిస్థితుల్లో రాగల పెద్ద మార్పులు ఏమీ వుండవు. ఎంతటి విపత్కర పరిస్థితినైనా ఎదుర్కొనగల అంగ, ఆయుధబలం అగ్రరాజ్యాలకు వుండనేవుంది. భద్రతామండలి ఈ విధంగా తీర్మానించిన తరువాత అగ్రరాజ్యాలు సేనలను పంపక పోవడం అంటూ వుండదు. ఇలాంటి సైనిక చర్యలను తీసు

కోవడం ఏ అగ్రరాజ్యానికి సమ్మతం కాకపోయినా ఆ రాజ్యం అసలు తీర్మానాన్నే వీటో చేయవచ్చుగా.

ఈ సైనిక సంఘర్షణతో సంబంధం లేకపోయినప్పటికీ కొన్ని అమాయక రాజ్యాలు దెబ్బ తినవలసి వస్తుంది. దురాక్రమణదారులను ప్రతిఘటించేందుకు వెళ్ళే సమితిసేనలు ఈ దేశాలలోనుంచి వెళ్లవలసి వుండవచ్చు. అప్పుడు ఈ దేశంలో వస్తువులన్నీ గిరాకీ కావచ్చును. ఆ దేశ ప్రజలకు ఆహార ధాన్యాలు లభింపకపోవచ్చును. పంటదారులు ఎక్కువ ధరలకు తమ ధాన్యాన్నంతా ఈ సేనలకు అమ్ముకోవచ్చును. ఈ పరిస్థితిలో ఇలాంటి ఇబ్బందులకు గురియైన దేశం భద్రతా మండలి సహాయాన్ని కోరవచ్చును. ఈ కష్టాలను తొలగించేందుకు అగ్రరాజ్యాలుగాని, ఇతరదేశాలుగాని ఈ దేశానికి సహాయపడాలని భద్రతామండలి తీర్మానం చేయవచ్చు. పేరుపెట్టి కొన్ని దేశాలకు ప్రత్యేక సూచనలను చేయవచ్చును.

మిలిటరీ స్టాఫ్ కమిటీ సహాయంతో భద్రతామండలి ఏ దేశం ఎంత సైన్యాన్ని పంపవలసిందీ నిర్ణయిస్తుంది. అన్ని దేశాలూ ఒకేసారి తమ కోటాప్రకారం సైనిక దళాలను, విమానాలను, నౌకలను పంప నవసరం లేదు.

అసలు ఈ విధంగా భద్రతామండలి సైన్యాన్ని సమాయత్తం చేసినా, ఆ సైన్యాన్ని వుపయోగించవలసిన అవసరం లేకుండా పోవచ్చును. బలప్రయోగంవరకూ వెళ్ళక కేవలం బలప్రదర్శన ద్వారానే కొన్ని సందర్భాలలో తగాయిదాలు

పరిష్కారమైపోగలవు. దురాక్రమణ సాగిస్తున్న దేశం ఓడరేవులను సమితి యుద్ధనౌకలు సమీపించేసరికి ఆదేశంపై సమితి విమానాలు విహరించడం ప్రారంభించేసరికి, రాగల ప్రమాదాలను ప్రజలకు తెలియజెప్తూ విమానాలనుంచి కర పత్రాలు వెదజల్లుతూ ఉండేసరికి, ప్రజలు పరిస్థితులను గ్రహించి తమ ప్రభుత్వంపై తిరుగుబాటుచేసి ఆ ప్రభుత్వాన్ని మార్చడానికి ప్రయత్నించవచ్చును. వారి ప్రయత్నం ఫల ప్రదమై వెనుకటి ప్రభుత్వం మారి క్రొత్త ప్రభుత్వం ఏర్పడ గానే ఈ ప్రభుత్వం వెనుకటి విధానాలకు స్వస్తిచెప్పి, క్రొత్త విధానాలను అనుసరించి దురాక్రమణను మానివేసి తన సేన లను ఉపసంహరించుకోగల అవకాశం లేకపోలేదు.

అప్పుడు సమితి సైన్యం యావత్తు ఆ దేశంనుంచి తిరిగి వెళ్ళిపోవలసిందే. ఈ విధంగా దురాక్రమణ జరిపిన దేశంలో మార్పు రాకపోతే సమితి సైన్యాలు ఆ దేశంపై పూర్తి యుద్ధాన్ని సాగించవలసిన అవసరంవున్నా ఆ విధంగా సాధించ గల ప్రయోజనాన్ని రెండు మూడు ముఖ్య పట్టణాలను ఆక్ర మించడం ద్వారా సాధింపవచ్చును. ఉదాహరణకు, అర్జెంటి నాను తీసుకుందాం. బ్యూనోస్ఏరీస్ అర్జెంటినా ముఖ్యపట్నం. సమితి సేనలు ఈ ఒక్క పట్నాన్నీ పట్టుకుంటే అర్జెంటినా ఆట కట్టినట్లే అవుతుంది. రాజధాని పోయిన తరువాత రాజ్యం ఎంతోకాలం నిలబడలేదు. ప్రజల, సేనల ధృతి చెడి పోతుంది. అప్పుడు ఆ దేశం త్వరగా రాజీకి రాగలదు.

బల ప్రదర్శనం, బలప్రయోగం ద్వారా ఈ సమస్యలను పరిష్కరించడానికి ప్రయత్నిస్తూ కూడా అంతిమపరిష్కారం విషయమై రాజీ సంప్రతింపులను భద్రతామండలి సాగిస్తూ వుండాలి. స్థిరపరిష్కారం సైనిక బలప్రయోగంద్వారా గాక సమాధాన మార్గానే సాధ్యం.

సమితి బలప్రయోగానికి మరి కొన్ని పరిమితులుకూడా వున్నవి.

రెండవ ప్రపంచయుద్ధంలో జర్మనీని, జపాన్‌ను ఓడించిన మిత్రరాజ్యాలు ఆ రెండు దేశాల విషయంలోనూ ఏ చర్యలు తీసుకున్నా తీసుకోవచ్చును. భద్రతామండలి ఈ చర్యలను నివారించలేదు. పరాజిత దేశాలయెడల మిత్రరాజ్యాల విధానాన్ని నిర్ణయించడంలో సమితికి ప్రమేయమే లేదు.

భద్రతామండలి దురాక్రమణ జరిపిన దేశాలపై బలాన్ని ప్రయోగించవచ్చును గాని, ఆ దురాక్రమణను జరిపించిన వ్యక్తులపై ఎలాంటి చర్యా తీసుకొనలేదు. యథార్థానికి ఆ దురాక్రమణను జరిపించిన పది పదిహేనుమంది వ్యక్తులే నేరస్థులు. వీరి తప్పుల ఫలితాలను ఆ దేశప్రజలు యావన్మందీ అనుభవించాల్సి వస్తుంది.

భద్రతామండలి ఇతర దేశాలు తన ఆదేశాలను పాలించేటట్లు చేయడానికి సైనిక చర్యలను తీసుకోలేదు. ఒక దేశం యుద్ధాన్ని ప్రారంభించడానికి పూనుకుంటేనే ఆ దేశాన్ని అదుపులో వుంచేందుకు భద్రతామండలి సైన్యాన్ని వుపయోగించ వీలవుతుంది.

ఒక దేశం మరొక దేశాన్ని ఆక్రమించేందుకు పది లక్షలమంది సైనికులను సిద్ధంచేస్తూ వుండవచ్చును. ఇంత సైన్యాన్ని ఎందుకు తయారు చేస్తున్నారని ఆ ప్రభుత్వాన్ని అడిగి ఆ సైన్యాన్ని ఒక లక్షకు తగ్గించమని భద్రతామండలి సూచింపవచ్చును. అయినప్పటికీ, ఆ దేశం యథాప్రకారంగా ఆ పదిలక్షల సైన్యాన్నీ తయారుచేస్తూనే వుంటుంది. ఈ విధంగా సైన్యాన్ని వృద్ధిచేస్తూ, ప్రజాస్వామ్యంలో విశ్వాసం ప్రకటించిన ప్రతి ఒక్కర్నీ నిర్బంధిస్తూ, వాక్ స్వాతంత్ర్యాన్ని, సమావేశ స్వాతంత్ర్యాన్ని అణికట్టి నిరంకుశంగా ఆ దేశపు అధికారవర్గం ప్రవర్తిస్తూ వుంటుంది.

పరిస్థితి ఈ విధంగా మార్పు చెందుతూవుండటం గమనించి భద్రతామండలి ఆ దేశానికి మరొక సందేశం పంపుతుంది: "మీ సైన్యాన్ని లక్షకు తగ్గించండి. కారాగారాల్లో నిర్బంధించిన ప్రజాస్వామిక వాదులనందర్నీ విడుదలచేయండి. న్యాయంగానూ, నిష్పాక్షికంగానూ ఎన్నికలు జరిపి, ప్రజలకు తమకు సమ్మతమైన ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకోడానికి అవకాశం ఇవ్వండి." భద్రతామండలి ఈ సందేశం పంపడంతో తృప్తి చెందక తన శక్తిని చూపేందుకు ఆ దేశం సరిహద్దులకు కొన్ని బాంబరు విమానాలను, యుద్ధ నౌకలను కూడా పంపుతుంది.

దురాక్రమణకు సన్నద్ధమౌతున్న ప్రభుత్వం ఈ విమానాలను, నౌకలను చూచి భయపడిపోతుంది. "మా సైన్యాన్ని

మూడు లక్షలకు తగ్గించాం." అని భద్రతామండలికి సమాధానం పంపుతుంది.

ఇందుకు భద్రతామండలి తిరిగి ఈ విధంగా సమాధానం పంపుతుంది: "మీ సైన్యాన్ని మూడు లక్షలకు తగ్గించారు గాని, మరి మిగతా ఏడు లక్షలమందినీ సరిహద్దుల్లోనే వుంచారు. పైగా, మేము సూచించిన ఇతర ప్రతిపాదనలను వేటినీ అమలు చేయలేదే."

భద్రతామండలి వెంటనే దిగ్బంధనం చేస్తుంది. ఆ దేశానికి విమానాలుగాని, నౌకలుగాని, రైళ్లుగాని వెళ్ళడానికి వీలులేకుండా చేస్తుంది. ప్రధాన వస్తువులు ఏవీ రాకపోవడం వల్ల తమ వ్యూహం దెబ్బతినిపోయినట్లు ఈ దేశ పాలకులు గ్రహిస్తారు. "సరిహద్దులలో వున్న ఏడు లక్షలమంది సైనికులనూ ఇళ్ళకు పంపించివేశాం. మేము యుద్ధాన్ని ప్రకోపింప చేయదలచలేదు," అని భద్రతామండలికి మరొక సందేశం పంపుతారు.

భద్రతామండలి ఇక చేయకల్గిందిలేదు. ఈ దేశం ఇతర చర్యలను వేటినీ తీసుకోనకపోయినప్పటికీ యుద్ధాన్ని ప్రారంభించనని ప్రకటించడంవల్ల భద్రతామండలి దిగ్బంధనాన్ని తొలగించి సైన్యాన్ని, నౌకలను, విమానాలను ఆదేశం సరిహద్దులనుండి ఉపసంహరించుకోవలసి వస్తుంది.

యుద్ధ పరిస్థితిగాని, యుద్ధ ప్రమాదంగాని ఏర్పడినప్పుడు, ఏర్పడే సూచనలు వున్నప్పుడు, మాత్రమే భద్రతామండలి వాటిని తొలగించడానికి చర్యలు తీసుకోగలదు.

అధ్యాయం ౧౨

# నిరాయుధీకరణ

## ఆటంబాంబు కంట్రోలు

"మా దేశంలో అరాచకం తల ఎత్తకుండా చూసుకోవాలి. మామూలు రక్షకభట దళాలకు అలవిగానంతగా ప్రజలు తిరుగుబాటు చర్యలు ప్రారంభించి, శాంతికి భంగం కలిగింపవచ్చును. ఇలాంటి ఉపద్రవాన్ని నివారించేందుకు, ఏర్పడినప్పుడు ఎదుర్కొనేందుకు, సైన్యం కావాలి. మరొక దేశం ఏదైనా మామీద దురాక్రమణ జరిపితే ఆ దురాక్రమణదారులను ప్రతిఘటించేందుకు కూడా సైన్యం కావాలి." ప్రపంచంలో దాదాపు ప్రతి ఒక్క ప్రభుత్వమూ సైన్యాలను సిద్ధంచేసుకొని వుంచుకొనడానికి ఈ కారణాలు చెప్తూవుంటుంది.

ప్రభుత్వాలు బహిరంగంగా చెప్పని కారణం మరొకటి వుంది. ప్రభుత్వాలకు సైన్యాలువుంటే ఇతర దేశాలపై దండయాత్ర సాగించి ఆ దేశాలను ఆక్రమించవచ్చును.

ఇంతంత సైన్యాలను సిద్ధంగా వుంచేందుకు, సైన్యాల వినియోగానికి ఆధునిక ఆయుధాలను సమకూర్చడానికి కోట్లకుకోట్లు రూపాయలు కావాలి. ప్రజలనుంచి పన్నుల రూపంలో వసూలుచేసే డబ్బులో హెచ్చు మొత్తాన్ని ప్రభుత్వాలు ఈవిధంగా ఖర్చుచేస్తుంటే ప్రజలకు నిత్య జీవితావసరాలను సమకూర్చేందుకే ప్రభుత్వాలకు పైకం వుండదు. ప్రజల జీవనప్రమాణం దుర్భరంగా వుంటుంది.

ఇది ఇలావుండగా, ఆయుధాలుండేసరికి ఏమాత్రం చీకాకు కలిగినా మరో దేశంపై ఆయుధాలను ప్రయోగించి వ్యవహారం పరిష్కారం చేసుకుందామనే బుద్ధి పుడుతుంది. మంచి బలిష్ఠమైన సైన్యం వుండేసరికి ఎలాంటి చిన్న తగాయిదానైనా బలప్రయోగంద్వారా పరిష్కరించుకోవాలనే ప్రతి దేశమూ ఆత్రపడుతుంది.

అసలు ఈ ఆయుధాలకు ఒక పరిమితిగాని, ఒక ప్రమాణంగాని లేదు. ఒక దేశం ఏదైనా ఒక క్రొత్తరకం ఆయుధాలనో, మంచి శక్తివంతమైన మారణాస్త్రాల్నో తయారుచేస్తే మిగతా రాజ్యాలన్నీ వాటిని తయారుచేసుకునే వరకూ విశ్రమింపవు. మిగతా దేశాలన్నీ ఈ ఆయుధాలను తయారుచేసినట్లు మొదటి దేశానికి తెలిస్తే, వెంటనే ఆదేశం మరొక అస్త్రాన్ని తయారుచేయడానికి ప్రయత్నిస్తుంది. ఈ విధంగా ఆయుధాల నిర్మాణంలో వివిధ దేశాలమధ్య వుండే పోటీకి హద్దు అంటూ వుండదు.

ప్రపంచ రాజ్యాలచేత అస్త్రసన్యాసం చేయించగలమా? ప్రపంచంలో ఎక్కడా కూడా సైనిక ప్రయోగంద్వారా అన్య దేశాలను జయించడానికి, ఆక్రమించడానికి ప్రయత్నించం అని సమితి ప్రణాళికను ఆమోదించిన ప్రతి ఒక్క దేశమూ వాగ్దానం చేసింది. ప్రపంచ రాజ్యాలన్నీ ఈవాగ్దానాన్ని పాలిస్తే ఏదేశానికీ మరో దేశాన్ని జయించగల సైన్యం అవసరంలేదు. అంతేగాదు, ఏదో దేశం దురాక్రమణ జరపబోతుందని భయపడి ఆ దురాక్రమణను ప్రతిఘటించేందుకు

తగినంత సైన్యాన్నికూడా సమీకరించి యుద్ధసన్నద్ధంలో ఏ దేశమూ వుంచనవసరంలేదు. భద్రతామండలి వివిధ దేశాలకు దురాక్రమణనుండి రక్షణ ఇవ్వగలిగితే ప్రస్తుతం ప్రపంచ రాజ్యాలు సైన్యాలను సమీకరించడానికి గల రెండవ కారణంకూడా వుండదు.

ఈ రెండు కారణాలు లేనప్పుడు ఇక ప్రపంచ రాజ్యాలు కేవలం దేశంలో విప్లవాన్ని అణచివేయడానికి మాత్రమే సైన్యాన్ని వుంచుకోవలసివస్తుంది. అయితే, ప్రతి ప్రభుత్వమూ ప్రజల అవసరాలను తీరుస్తూ, పనిలేనివారికి పనులు కల్పిస్తూ దారిద్ర్యం అనేది లేకుండాచేస్తే ప్రజా విప్లవాలను గురించి భయపడే పనేలేదు. ఆ భయంలేనప్పుడు ఈ సైన్యంకూడా అవసరంలేదు.

ప్రతిదేశమూ సైన్యానికి, ఆయుధాలకు చేస్తున్న ఖర్చును బాగా తగ్గించివేయడానికి ఐక్యరాజ్య సమితి ప్రయత్నించాలని సమితి ప్రణాళిక ముమ్మారు హెచ్చరించింది.

వివిధ దేశాల నిరాయుధీకరణను చర్చించి నిబంధనలను తయారుచేయవలసిందని సమితిప్రణాళిక సర్వసభ్య సంఘాన్ని ఆదేశించింది. సర్వసభ్య సంఘం ఏవైనా మంచి నిబంధనలు తయారుచేస్తే వాటిని అచ్చువేయించి, ఆ నిబంధనలను ఆమోదించమని కోరుతూ ఈ అచ్చు ప్రతులను అన్ని దేశాలకూ పంపుతుంది.

ఇది సాధ్యంగాకపోతే, ప్రపంచ రాజ్యాలన్నీ అస్త్ర సన్యాసంచేస్తూ ఒక ఒడంబడికను కుదుర్చుకోవాలని సర్వ

సభ్య సంఘం సిఫార్సు చేయవచ్చును. "సమితి రాజ్యాలన్నీ ఈ ఒడంబడికను ఆమోదిస్తే మామటుకు మేము వచ్చే అయిదేళ్ళల్లోనూ ఏటా పదోవంతు చొప్పున మా సైనిక, ఆయుధబలాన్ని సగానికి తగ్గించుకోగలం," అని ప్రతి ప్రభుత్వమూ ప్రకటించనూవచ్చు.

కొన్ని దేశాల్లో మైనారిటీ వెళ్ళిన ప్రతి యువకుడూ విధిగా సైనికశిక్షణను పొందాల్సి వుంటుంది. మరి కొన్ని దేశాల్లో యువకులు వారికి ఎందులో అభిరుచివుంటే ఆ వృత్తిలో ప్రవేశించవచ్చు. ఇందువల్ల కొన్ని దేశాల్లో బ్రహ్మాండమైన సైనికబలం ఏర్పడుతుంది. మరి కొన్ని దేశాలు యథాప్రకారంగానే వుంటవి. సైనికంగా బలంగా వున్న దేశాలనుచూచి ఇలాంటి మిగతా దేశాలు భయపడి సైనికసమీకరణకు వుపక్రమిస్తవి.

ప్రతిదేశమూ నిర్బంధ సైనికశిక్షణ పద్ధతిని రద్దు చేయాలని సమితి సర్వసభ్య సంఘం ఆదేశించాలని కొన్ని రాజ్యాలు సూచించినవి. ప్రపంచరాజ్యాల నిరాయుధీకరణకు నిబంధనలు తయారుచేసేందుకు సమితి సర్వసభ్య సంఘం తొలిసమావేశంలోనే పూనుకొన్నది. అన్ని రాజ్యాలు తమ ఆయుధబలాన్ని తగ్గించుకోవాలని, ఆ రాజ్యాలన్నీ ఆవిధంగా చేస్తున్నదీ, లేనిదీ విచారించేందుకు ప్రత్యేక పర్యవేక్షణ, పరీక్షా సంఘాలను ఏర్పాటు చేయాలని సమితి సర్వసభ్య సంఘం తీర్మానించింది. ఈ సంఘాలను నియమించడం, అవి వాటిపనులను ఎలా నిర్వహించడం

మొదలైన వివరాలను భద్రతామండలి నిర్ణయించాలని సూచించింది.

భద్రతామండలి సైనికాధికారుల సంఘంతో సంప్రదించి, ఈ సమస్యను సమగ్రంగా పరిశీలించి ఖచ్చితమైన ఒక పథకాన్ని తయారుచేయవలసి వుంది. ఈ పథకం ఏ దేశానికి ఎన్ని యుద్ధ నౌకలు, ఎన్ని విమానాలు, ఎన్ని జలాంతర్గాములు వుండాలో వివరిస్తుంది. అంతేగాదు, క్రమానుగతంగా ఆయుధాలను తగ్గించుకొనడానికి ఒక కార్యక్రమాన్ని కూడా ఈ పథకం సూచించవచ్చును.

ఈవిధంగా ఖచ్చితమైన ప్రణాళిక తయారైన తరువాత భద్రతామండలి ఆ ప్రణాళికను ఆమోదింపవలసిందిగా సమితి రాజ్యాలన్నింటినీ కోరవచ్చును. అయిదు అగ్రరాజ్యాలతో సహా నలభై అయిదు దేశాలు ఈ పథకాన్ని ఆమోదించినవనుకోండి. అప్పుడు మిగతా దేశాలను భద్రతామండలి ఈవిధంగా హెచ్చరించవచ్చును. "మీరు ఈ పథకాన్ని అంగీకరించకపోతే మీ ఆయుధ, సైనిక బలం ప్రపంచశాంతికి ముప్పు తెచ్చిపెట్టేవిగా అవుపించవచ్చును. మీ ఆయుధాలు, మీ సైన్యంవల్ల ప్రపంచశాంతికి ప్రమాదం ఏర్పడుతుందని మేము నిర్ణయించేస్తే మా సమష్టి బలాన్ని అంతా మీపై ప్రయోగించగలం."

కాని, అసలు సమస్య ఒక చక్కని పథకాన్ని తయారుచేసి, ఆ పథకాన్ని భద్రతామండలిలో సభ్యత్వంగల అన్ని దేశాలు ఆమోదించేట్లు చేయడమే. నిరాయుధీకరణ

పథకం తయారై భద్రతామండలి ఆ పథకాన్ని ఆమోదిస్తే ఆ పథకాన్ని మిగతా రాజ్యాలుకూడా ఆమోదించేటట్లు చేయడం సులభమే.

ఆయుధాలు అన్నింటిలోనూ అత్యంత ప్రధానమైనది "ఆటంబాంబు."

చిన్నచిన్న రాజ్యాలు చిల్లర ఆయుధాలతో యుద్ధాలు ప్రారంభిస్తే, భద్రతామండలి ఆ యుద్ధాలను సులభంగా ఆపు చేయగలదు. కాని, ఒక పెద్దరాజ్యం అణ్వాస్త్రాలను తయారు చేసుకొని యుద్ధం ప్రారంభిస్తే అది తృతీయ ప్రపంచ సంగ్రామమే అవుతుంది. ఆ యుద్ధం అర్ధగంటకంటే ఎక్కువ కాలం జరగదు.

ఏక ప్రపంచ సాధ్యాసాధ్యాలు అణుశక్తి కమిషన్ కృషి సాఫల్య, వైఫల్యాలపై ఆధారపడివున్నవి.

ఈ పరమాణుశక్తి కమిషన్‌లో భద్రతామండలి సభ్యత్వంగల 11 రాజ్యాల ప్రతినిధులు, కెనడా ప్రతినిధి సభ్యులుగా వుంటారు. మొట్ట మొదటి ఆటంబాంబును తయారుచేయడంలో కెనడాకూడా ప్రముఖ భూమికను నిర్వ హించిన కారణంగా ఈ కమిషన్‌లో కెనడాకు శాశ్వత సభ్యత్వం లభించింది.

ఈ అణుశక్తి కమిషన్‌కు అధికారాలు ఏమీ లేవు. భద్రతామండలే ఈ కమిషన్‌కు సంబంధించిన నియమావళిని, నిబంధనలను తయారుచేస్తుంది. కేవలం భద్రతామండలి ఉపశాఖగా మాత్రమే అణుశక్తి కమిషను వ్యవహరిస్తుంది.

అణుశక్తి కంట్రోలుకు సంబంధించిన వివిధ అంశములను సమగ్రంగా చర్చించి, భద్రతామండలికి కొన్ని ప్రతిపాదనలను మాత్రమే ఈ కమిషన్ చేస్తూవుంటుంది. అయితే, ఈ అణుశక్తి కమిషన్ కృషిపైనే యావత్ప్రపంచ భవిష్యత్తు, సమస్త మానవకోటి శాంతి సౌఖ్యాలు ఆధారపడి వున్నవి. అంతర్జాతీయ అణుశక్తి అభివృద్ధి సంఘస్థాపనకు ఒక ప్రణాళికను ఈ అణుశక్తి కమిషన్ తయారు చేయవలసి వుంది.

ప్రపంచ వినాశనానికిగాక ప్రపంచాభ్యుదయానికి అణుశక్తిని వినియోగించడం ఎలాగో విచారించి అందుకు ఒక పథకాన్ని తయారు చేసేందుకుకూడా అణుశక్తి కమిషన్ ప్రయత్నింప వచ్చును.

ఈ పథక రచన ఎంత ప్రధానమైనదో తెలుసుకోడానికి ఒక్క చిన్న విషయం గ్రహిస్తే చాలును. ఈ కమిషన్‌లో పనిచేసే అమెరికా ప్రతినిధికి సహాయపడేందుకు అమెరికా ప్రభుత్వం అరవైమంది వుద్యోగులను నియమించింది. ఏడాదికి 6,60,000 డాలర్లను వీరి జీతాలక్రింద ఖర్చుచేస్తున్నది.

ఈ కమిషన్ ఆమోదార్థం అమెరికాప్రభుత్వం అత్యంత సాహసోపేతమైన పథకాన్ని ఒకదానిని ప్రతిపాదించింది. ఆ పథకం భద్రతామండలి ఆమోదాన్ని పొందివుంటే, ప్రపంచం కని విని ఎరుగనటువంటి అధికారసంస్థ ఒకటి ఏర్పడుతుంది. ఈ సంస్థ ఏర్పడి అణుశక్తిపై యావత్తు అధికారాన్ని పొందకలిగితే ప్రపంచంలో ఏ దేశమూ దురాక్రమణను సంకల్పింపనైనా సంకల్పింప లేదు.

ఈ సంఘానికి వుండే బలం ఏ ఒక్క దేశానికీ వుండదు. ప్రతి ఒక్క దేశాన్నీ మించి వుంటుంది. అగ్రరాజ్య పంచకంతో సహా ప్రపంచ రాజ్యాలన్నింటి మధ్యా శాంతిని కాపాడగల శక్తిగా ఈ సంస్థ అవతరింపగలదు. అమెరికా ప్రతిపాదించిన పథకంలోని విశేషాలు ఏమిటో విచారిద్దాం.

అనేక దేశాల ప్రతినిధులతో కూడిన అంతార్జాతీయ అణుశక్తి అభివృద్ధి సంఘం ఒకటి ఏర్పాటుకావాలి. ఇందులో సభ్యత్వంగల ప్రతి దేశానికీ ఒక వోటు వుంటుంది. ఏ దేశానికి వీటో అధికారం వుండదు. అణ్వాస్త్రాలను తయారు చేయడానికి ఉపయోగపడే యురేనియం, థోరియంలపై—అవి ప్రపంచంలో ఎక్కడున్నా సరే—ఈ సంఘానికే సంపూర్ణాధికారం వుండాలి. ప్రతి ఒక్క గనిని పరీక్షించి పరిస్థితిని నివేదించేందుకు ఇంజనీర్లను, ఇంకా పరిశోధనలను జరిపేందుకు శాస్త్రజ్ఞులను నియమిస్తుంది. అణుశక్తిని శాంతియుత కార్యక్రమాలకు శాస్త్రజ్ఞులు వినియోగించేట్లు చేస్తూ, ఆ కార్యక్రమ నిర్వహణలో శాస్త్రజ్ఞులకు సహాయం చేస్తుంది. అయితే, ఇలాంటి పరిశోధనలను ఈ సంఘం అనుమతి పొందనిదే ఎవరూ సాగించడానికి వీల్లేదు.

అణుశక్తికి సంబంధించిన అనేక రహస్యాలను ఎవరికీ తెలియకుండా దాచివుంచదు. ఇతరులు అలా చేయడంలేదు గదా అని ఎప్పటికప్పుడు విచారణలు జరిపి తెల్సుకుంటూ వుంటుంది. ఎక్కడో, ఎవరికీ తెలియకుండా అణ్వాస్త్రాలను తయారుచేయకుండా వేయి కళ్ళతో కనిపెట్టి వుంటుంది.

యురేనియం, థోరియంలను, తత్సంబంధమైన ఇతర పదార్థాలను వాడే ఫ్యాక్టరీలపై ఈ సంఘం పూర్తిగా ఆధిపత్యం వహించవచ్చు లేదా. నిరంతరం అజ్మాయిషీ చేస్తూ వుండవచ్చును.

ముందుగా ఈ సంఘం అనుమతిని పొందితే ప్రయివేటు కంపెనీలు గాని, ప్రభుత్వ సంస్థలుగాని విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయడానికి, రైలు ఇంజన్లను తయారు చేయడానికి అణుశక్తిని ఉపయోగించ వచ్చును. అందుకు అవసరమైన అణుశక్తి పదార్థాలను ఈ సంఘం ఆ యంత్రాగారాలకు సప్లయి చేస్తుంది. ఇతరత్రా సేకరించుకొని ఈ ఫాక్టరీలు పని సాగించేందుకు ఎంతమాత్రం వీల్లేదు.

ఈ పదార్థాలను పొంది ఉపయోగకరమైన వస్తువులను గాక, అణ్వాస్త్రాలను ఏఫ్యాక్టరీగాని తయారుచేయడం ప్రారంభిస్తే వెంటనే ఈ సంఘం ఆ ఫ్యాక్టరీని స్వాధీనం చేసుకొని, ఆ తరువాత అందులో వున్న పనివారు ఏం చేయ వలసిందీ నిర్ణయిస్తుంది. ఈ అధికారసంఘం అమెరికా, రష్యా, బ్రిటన్ ప్రభుత్వాలకంటే కూడా విశేషాధికారాలను కలిగివుంటుంది. అణుశక్తి పదార్థాలనుగాని, పరికరాలనుగాని ఈ ప్రభుత్వాలు తమ ఇష్టప్రకారం తయారుచేసేందుకు వీల్లేదు.

ఎప్పుడు ఏ ఫ్యాక్టరీని తనిఖీ చేయాలనుకున్నా ఈ సంఘం ఆ ఫ్యాక్టరీకి అధికారులను పంపవచ్చు. ఏ ప్రభుత్వమూ అడ్డు చెప్పడానికి లేదు. ఈ సంఘం ఏర్పాటుచేసే నిబంధనలను

ఎవరు అతిక్రమించినా అట్టివారిని భద్రతామండలి అరెస్టుచేసి, విచారణజరిపి శిక్షింపవచ్చును. భద్రతామండలి అగ్ర రాజ్యాల వీటో అధికారానికి లోబడి వుండకపోతే, ఈ అణుశక్తి అభివృద్ధి సంఘ కార్యక్రమంతో అనుమతిలేకుండా ప్రమేయం పెట్టుకున్నవారిని ఎవరినైనా దండించగలదు. ఐక్యరాజ్య సమితి ప్రణాళిక దేశాలను, జాతులను శిక్షించేందుకు భద్రతామండలికి అధికారాన్ని ఇచ్చింది. కాని, మండలి వ్యక్తుల జోలికి వెళ్ళేందుకు వీల్లేదు. ఈ అంతర్జాతీయ అణుశక్తి అభివృద్ధిసంఘం భద్రతామండలికి అలాంటి అధికారాన్ని ఇస్తుంది.

అమెరికా తయారుచేసిన పథకం ప్రధానలక్షణాలు ఇవి: అణుశక్తి కమిషన్ ఈ పథకాన్ని పరిశీలించి ఈ అణుశక్తి అభివృద్ధి సంఘస్థాపనకు ఒక ప్రణాళికను తయారు చేయవలసి వుంటుంది. ఈ ప్రణాళికను భద్రతామండలి ఆమోదించి ఇతర రాజ్యాలు అంగీకరిస్తే ఈ సంఘం అవతరిస్తుంది. ఈ విధంగా జరిగితే అమెరికా ప్రస్తుతం తన పరంగావున్న అటం బాంబులను ఈ ప్రణాళిక సూచించిన విధంగా నిర్మూలించి వేయడానికి, అణుబాంబుల తయారీని విరమించడానికి, ఈ బాంబుల నిర్మాణానికి సంబంధించి తనకు తెలిసిన యావత్తు విషయాన్ని ఈ సంఘానికి తెలియజేయడానికి సిద్ధంగా వుంది. అమెరికా ప్రభుత్వం ఈ విషయాన్ని స్పష్టంగా ప్రకటించింది.

అధ్యాయం ౧౩

# ఐక్యరాజ్య సమితి సంస్కరణ

ఐక్యరాజ్య సమితి ఇప్పుడున్నట్లే వుంటే మీకు తృప్తికరంగా వుంటుందా? ఈ సమితివల్ల ఏ మైనా పని జరుగుతుందని మీకు నమ్మకం వుందా? ప్రపంచప్రజల జీవితాన్ని ఇప్పటి కంటే సుఖప్రదంగానూ, ఆనందదాయకంగానూ చేయగల శక్తి, సామర్థ్యం ఈ సంస్థకు వున్నదా? అణ్వాస్త్రాల ప్రయోగంతో జరిగే యుద్ధంలో మనం అందరం తుడిచి పెట్టుకు పోకుండా ఈ సమితి మనలను కాపాడగలదా?

ప్రపంచ పౌరులమైన మనం మన అభిమతం ప్రకారం సమితి ప్రణాళికను సవరించగలం. సమితి ప్రణాళికకు ఏవరైనా సవరణలను సూచింపవచ్చును. సమితికిచెందిన ఏ సంఘమైనా ప్రణాళికలో ఈ విధమైన సవరణలు జరగాలని సూచింపవచ్చు. మనం సమితిలోని మన ప్రతినిధులకు ఫలానా సవరణకు అనుకూలంగానూ, ఫలానా సవరణకు ప్రతికూలంగానూ వోటు చేయమని సూచింపవచ్చును. అసలు వేరే కొత్త సవరణలను ప్రతిపాదింపమని కూడా మనం చెప్పవచ్చును.

సమితి సర్వసభ్యసంఘ సభ్యులలో మూడింట రెండు వంతులమంది ఆమోదించిన ఏ సవరణ అయినా నెగ్గుతుంది. ఈ విధంగా సవరింపబడిన ప్రణాళిక ప్రతులను సమితి కార్యాలయం ప్రపంచ రాజ్యాలన్నిటికీపంపి సవరింపబడిన ప్రణాళికను ధృవపరచవలసిందిగా ఆయా ప్రభుత్వాలను కోరవచ్చును. అగ్రరాజ్యాలు అయిదు, సమితి రాజ్యాలు

మూడింట రెండువంతులు ఈ సవరణలను ధృవపరిస్తే, ప్రణాళిక ఆ విధంగా సవరింపబడుతుంది. పాత షరతులలో కొన్ని ఈ క్రొత్త సవరణలలో కొన్నింటికి విరుద్ధంగావుంటే పాత నిబంధనలు రద్దయిపోతవి. కొత్త సవరణలే స్థిరంగా వుండిపోతవి.

ఈ సవరణలలో ఏ సవరణను అయినా అగ్రరాజ్యాలలో ఒక్కరాజ్యం నిరాకరించినా ఆ సవరణను ప్రణాళికలో చేర్చడానికి వీల్లేదు.

సమితి ప్రణాళికను సవరించడం గురించి ఆలోచనలు జరుగుతూనే వున్నవి. ఇప్పటికి విచారణలోకి వచ్చిన సవరణలు ఏమిటో పరిశీలిద్దాం. వాక్ స్వాతంత్ర్యాన్ని, మత స్వాతంత్ర్యాన్ని ప్రపంచ ప్రజలందరికీ సమకూర్చేటట్లుగా ప్రణాళికను సవరించాలని మానవహక్కుల కమిషను సూచించింది. ఒక తగాయిదా పరిష్కారానికి సాత్విక పద్ధతులను అవలంబించాలని భద్రతామండలి తీర్మానంచేసే సందర్భంలో అగ్రరాజ్యాలకు వీటో అధికారం వుండరాదని, అందుకు అనుగుణంగా సమితి ప్రణాళికను సవరించాలని ఆస్ట్రేలియా, మరికొన్ని రాజ్యాలు ప్రతిపాదించినవి.

సమితికి వివిధ దేశాలు ప్రతినిధులను నియమించే విధానాన్నికూడా మార్పు చేయవచ్చును. ప్రస్తుతం ప్రతిదేశం ప్రతినిధి ఆదేశం ప్రభుత్వంచేత నియమింప బడుతూవుంటాడు. అలాగాక, దేశీయ పార్లమెంట్‌కు ప్రజలు ప్రతినిధులను ఎన్నుకున్నట్లే ప్రపంచ పార్లమెంటుకుకూడా ప్రజలు తమదేశ

ప్రతినిధిని ఎన్నుకోవాలని సమితి ప్రణాళికను సవరించి వివిధ రాజ్యాలను ఆ ప్రకారం ఆదేశింప వచ్చును. ఈ విధంగా ఎన్నికైన ప్రతి నిధులలో ప్రజలకు ఎక్కువ విశ్వాసం వుండ వచ్చును కూడా.

అయితే, ఏ దేశానికి ఆదేశం సమితి ప్రణాళిక సవరణతో నిమిత్తంలేకుండా సమితి ప్రతినిధుల ఎన్నికను ప్రజలకే వదలివేయవచ్చును. ఈ విధంగా కొన్ని దేశాలు తమ ప్రతి నిధుల నియామక విధానాన్ని మార్చివేస్తే మిగతా రాజ్యాలు ఈ పద్ధతిని అనుసరింపవచ్చును. ఎక్కువ రాజ్యాలు ఈ పద్ధతిని అనుసరిస్తే అప్పుడు సమితి ప్రణాళికనే ఆ విధంగా సవరింప వచ్చును. బ్రిటిష్ ప్రభుత్వం ఇలాంటి సవరణను ప్రతిపా దించింది కూడా.

సమితి సర్వసభ్య సమావేశానికి శాసనాలను చేసే అధి కారం ఇవ్వాలని ఈక్వెడార్, ఫిలిప్పీన్సు ప్రతినిధులు కొన్ని సూచనలను ప్రతిపాదించారు. అమెరికా సెనెట్ సభ్యులు కొందరు ఈ సవరణలను హర్షించారు. సమితికి ఈవిధంగా శాసనాలను చేసే అధికారం సంక్రమిస్తే అప్పుడు "శాంతి కాలంలో యువకులకు సైనిక శిక్షణను నిర్బంధం చేయరాదు" అని సమితి శాసింప వచ్చును. ఈ శాసనాన్ని ఏ దేశమూ ధిక్కరించడానికి వీల్లేదు. సమితికి శాసనాలుచేసే అధికారం లభిస్తే ఆ సంస్థ ప్రపంచప్రభుత్వంగా మారిపోగలదు.

యుద్ధాన్ని ప్రారంభించడానికి ఎవరు సన్నద్ధమౌతున్నా, అట్టి వ్యక్తులను నిర్బంధించి శిక్షించేందుకు సమితికి అధికారం

వుండాలని ఎంతోమంది వాదిస్తున్నారు. సమితి ప్రణాళికను సవరించి సమితికి అలాంటి అధికారాన్ని ఇవ్వవచ్చును.

అయిదు అగ్రరాజ్యాలతోసహా సమితి సభ్యులలో మూడింట రెండువంతుల మంది సమితి ప్రణాళికను పునః చర్చించి ఏ యే సవరణలు అవసరమో విచారించాలని అభిప్రాయపడితే సమితి ప్రణాళికలోని 109 వ నిబంధనను అనుసరించి శాన్‌ఫ్రాన్సిస్కోలో జరిగిన సభలాంటి సభను తిరిగి జరపవచ్చును. సమితి ఏర్పడిన 9 సంవత్సరాలలో పున ఇలాంటి సభను జరపడానికి వీలులేకపోతే పదవ సంవత్సరంలో భద్రతామండలిలోని ఏడు దేశాలు, సమితి దేశాలలోని ఎక్కువ రాజ్యాలు ఇలాంటిసభ జరగాలని నిర్ణయించ వచ్చును. ఆ సభ ప్రణాళికలో ఎలాంటి సవరణలనైనా చేయ వచ్చును. సభ్యులలో మూడింట రెండువంతులమంది ధ్రువ పరచిన సవరణలు అన్నీ ప్రణాళికలో చేరిపోగలవు.

అధ్యాయం ౧౪

# ఒక హెచ్చరిక

ఒక నౌక సముద్రం మధ్యలో దెబ్బతినిపోయింది. ఇద్దరు ప్రయాణీకులు ఒక ద్వీపం వొడ్డుకు కొట్టుకువచ్చారు. కొంచెంసేపు విశ్రాంతి తీసుకొని ఆ ద్వీపంలో ఎవరున్నారో తెలుసుకుందామని బయల్దేరారు. ఎంతదూరం తిరిగినా నరసంచారం కనిపించలేదు. తల దాచుకునేందుకు ఎక్కడా

చిన్న కొంప అయినా అవుపించలేదు. నిరాశతో నిట్టూర్చి ఒకమూల కూలబడి ముందు చేయవలసిన పనిని గురించి ఆలోచించడం మొదలు పెట్టారు. ఇంతలో బ్రహ్మాండమైన గాలివాన ప్రారంభమైంది. చీకటి పడుతున్నది.

ఇద్దరూ గబగబా రెండు పాకలు వేసుకుందామని కర్రలు, ఆకులూ పోగుచేసుకున్నారు. ఎవరిమటుకు వారు తన పాక సంగతే విచారించుకోవడంవల్ల ఎవరూ పూర్తిగా పాకా తయారు చేసుకోలేక పోయినారు. ఏదో మాటా మాటామీద వాగ్వాదం జరిగింది. ఒకరి పాకను మరొకరు లాగి పారేశారు.

మళ్ళా రాత్రివచ్చింది. భరించలేనంత చలి, వాన. తల దాచుకునేందుకు తావులేదు. ఇద్దరికీ పరిస్థితి తెలిసి వచ్చింది. వెంటనే ఒకడు మళ్ళా తన గుడిసె వేసుకోడానికి అంతా చేసుకుంటున్నాడు. రెండవవాడు చూస్తూ నిలబడ్డాడు. మొదటివాడు ఒకదూలం ఎత్తలేక నానా అవస్థపడుతున్నాడు. "కొంచెం ఇటువచ్చి దూలం లేవదీస్తే, నువ్వు నీపాకా వేసుకోడానికి నేను సహాయపడుతాను" అని అన్నాడు.

ఇద్దరూకలిసి త్వరగా తేలిగ్గా రెండు పాకలూ తయారు చేసుకున్నారు. ఇవి ఎంతో బాగున్నవి.

ప్రపంచ ప్రజలందరూ ఇలాగే పరస్పరం సహకరించు కుంటూ ఒకరి వ్యవహారాల్లో మరొకరు జోక్యం కల్గించుకో కుండా ఉంటే మనందరికీ మంచి ఇళ్ళు, కావాల్సినంత తిండీ అన్నీ లభిస్తవి.

# నాల్గవ భాగం

# ప రి చ య ం



## అధ్యాయం ౧౫

## సమితి రాజ్యాలు

**జ**ర్మనీపైగాని, జపాన్‌పైగాని యుద్ధం ప్రకటించి ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో పాల్గొన్న రాజ్యాలన్నీ ఐక్యరాజ్య సమితిలో తొలి సభ్యులు. ఈ యాభై ఒక్క దేశాలు సమితి ప్రణాళికపై సంతకం చేసినవి. ఆ దేశాల ప్రభుత్వాలు ప్రణాళికను ధృవపరచగానే ఆ దేశా లన్నింటికీ సమితి సభ్యత్వం లభించింది. ఈ యాభై ఒక్క రాజ్యాలు ఇవి: అర్జెంటినా, ఆస్ట్రేలియా, బ్రెజిల్, బైలో రష్యా (వైట్ రష్యా), కెనడా, చిలీ, చైనా, కొలంబియా, కాస్టరీకా, క్యూబా, చకస్లవేకియా, డెన్మార్క్, డొమినికన్ రిపబ్లిక్, ఈక్వెడార్, ఈజిప్టు, ఎల్ సాల్వడార్, ఇథియోపియా, ఫ్రాన్సు, గ్రీసు, గాటిమేలా, హైటి, హాన్డురాస్, ఇండియా, ఇరాన్, ఇరాక్, లెబనాన్, లైబీరియా, లక్జెంబర్గ్, మెక్సికో, నెదర్లెండ్స్, న్యూజిలాండ్, నికారాగ్వా, నార్వే, పెనామా, పరాగ్వే, పెరు, ఫిలిప్పీన్ కామన్వెల్తు, పోలెండ్, సాదీ అరేబియా, సిరియా, టర్కీ, యుక్రేన్, యూనియన్ ఆఫ్ సౌత్ ఆఫ్రికా (దక్షిణ ఆప్రికా), యూనియన్ ఆఫ్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్ (రష్యా.) యునైటెడ్ కింగ్

డమ్ (ఇంగ్లండ్), యునైటెడ్ స్టేట్స్ (అమెరికా), ఉరుగ్వే, వెనిజులా, యుగోస్లావియా.

ఏ దేశమైనా సమితిలో చేరాలనుకుంటే తన సంకల్పాన్ని సమితి సెక్రెటరీ జనరల్‌కు తెలియచేయాలి. సమితి ప్రణాళిక విధించే బాధ్యతలన్నింటినీ నిర్వర్తిస్తామని సమితి ప్రణాళికను ఆమోదించిన ఇతర రాజ్యాలు చేసినట్లే వాగ్దానాలను చేయగలమని ఆ ప్రభుత్వం హామీ ఇవ్వాలి.

ఒక దేశం ఈ విధంగా దరఖాస్తు పంపగానే భద్రతామండలి ఆ దేశం స్వభావాన్ని విచారిస్తుంది. అది శాంతి కాముక రాజ్యం అవునా, కాదా అన్నది ప్రధాన విషయం. శాంతికాముక దేశమేనని భద్రతా మండలిలోని శాశ్వత సభ్యులు అయిదుగురితోపాటు మరో ఇద్దరుకూడా నిర్ణయిస్తే అప్పుడు ఆ దరఖాస్తు సర్వసభ్య సంఘం విచారణకు వస్తుంది. ఈ సభ్యులలో మూడింట రెండువంతులమంది భద్రతామండలి సిఫార్సును అంగీకరిస్తే అప్పుడు ఆ దేశానికి సభ్యత్వం లభిస్తుంది.

స్వాతంత్ర్యం, స్వపరిపాలనా లేనటువంటి రాజ్యాలకు సమితిలో చేరే అర్హత లేదు. ఈ విధంగా వున్న దేశాలు స్వపరిపాలనాధికారాన్ని పొందగానే సమితి సభ్యత్వానికి దరఖాస్తులు పెట్టుకోవచ్చును.

ఒకసారి సమితిలో చేరిన తరువాత ఆ సంస్థనుండి వైదొలగడం గురించి సమితి ప్రణాళికలో ఏమీ లేదు.

అధ్యాయం ౧౬

# ప్రత్యేక పనులకు ప్రత్యేక సంఘాలు

ప్రత్యేక కార్యక్రమాల నిర్వహణకు ప్రత్యేక సంఘాలను ఏర్పాటు చేయడం గురించి అయిదవ అధ్యాయంలో తెలుసుకున్నాం. ఇంతకు ముందే అనేక సంస్థలు ఏర్పడి పని చేస్తున్నవి. ఈ విధంగా ఏర్పడిన సంఘాల్లో ఒకటి ఆహార వ్యావసాయిక సంఘం.

ఈ ఆహార వ్యావసాయికసంస్థ పంటభూములు, మత్స్య పరిశ్రమ, అడవులు గురించి విచారిస్తున్నది. భూసారాన్ని సంరక్షిస్తూ వృద్ధిపరచడానికి, ఆటవికసంపదను కాపాడేందుకు, సస్యాభివృద్ధికి ఏ యే చర్యలు అవసరమో విచారించి తీసుకుంటున్నది.

ఈ సంఘానికి ఒక కార్యవర్గం ఉంది. ఈ కార్యవర్గంలో 15 మంది సభ్యులు ఉంటారు. వీరు వివిధ దేశాలకు చెందిన వారు. ఈ సంఘం అధిపతిని డైరెక్టర్ జనరల్ అంటారు. మొట్టమొదటి డైరెక్టర్ జనరల్‌గా ఎన్నికైన వాడు సర్ జాన్ బాయిడ్ ఆర్. ఈయన, ఈయన, సిబ్బందీ ఏడాది పొడుగునా పనిచేస్తూనే ఉంటారు. వీరి కార్యాలయం వాషింగ్టన్‌లో ఉంటుంది.

ఐక్యరాజ్య విద్యా శాస్త్ర సంస్కృతీ సంఘం ఈ ప్రత్యేక సంస్థలలో మరొకటి. వార్తల సెన్సార్‌షిప్‌ను రద్దు చేయించడానికి, ప్రపంచ దేశాలు ఒకదాన్ని గురించి మరొకటి తెలుసుకోడానికి అవకాశాలు కల్పించడానికే కృషిచేస్తున్నది.

కళాశాలల, పురావస్తుప్రదర్శనశాలల అభివృద్ధికి విద్యా శాస్త్ర సాంస్కృతిక సంఘం సహాయపడుతుంది.

ఈ సంఘ నిబంధనావళిని 1945 నవంబరులో తయారు చేశారు. అప్పుడే 44 రాజ్యాలు ఈ సంఘంలో చేరినవి. ఈ సంఘానికి 18 మందిసభ్యులుగల కార్యవర్గం ఒకటి ఉంటుంది. సర్వసభ్యసంఘసమావేశం సంవత్సరానికి ఒకసారే. కాని, ఈ కార్యవర్గం తరుచు సమావేశమౌతూంటుంది. ఈ సంఘానికి ప్రధానాధికారి ఒక కార్యదర్శి. ప్రసిద్ధ శాస్త్రవేత్త, రచయిత, జులియన్ హక్స్లీ ప్రథమ కార్యదర్శిగా ఎన్నికైనాడు.

అంతర్జాతీయ కార్మిక సంస్థ ఐక్యరాజ్య సమితి కన్నా ముందే అనగా 1920 నే స్థాపించబడింది. అప్పట్లో నానాజాతిసమితితో కలిసి పని చేస్తూ ఉండేది. ఇప్పుడు అమెరికాతో సహా 39 సమితి రాజ్యాలు ఈ సంస్థలో చేరినవి.

ప్రపంచ ద్రవ్యనిధి, అంతర్జాతీయ బ్యాంకు అంతర్జాతీయ వాణిజ్య సంఘం—ఈ మూడు సంస్థలు ప్రపంచ ద్రవ్య, వ్యాపార సమస్యల పరిష్కారానికి కృషి చేస్తూ ఉంటవి.

ఒక దేశంనుంచి మరొక దేశం వస్తువులను తెప్పించు కునేందుకు ఎన్నో అవరోధాలున్నవి. అంతర్జాతీయ వాణిజ్యాభివృద్ధికి ప్రతిబంధకంగా ఉంటున్న శాసనాలు ఎన్నో ఉన్నవి. వాటినన్నింటినీ రద్దు చేయించి ప్రపంచ వాణిజ్యాభివృద్ధికి వివిధ దేశాలంతటికి అవసరమైన సరుకును దిగుమతి

చేసుకొనుటకు అనుకూలమైన పరిస్థితులను కల్పించడమే ఈ సంస్థ కర్తవ్యం.

అంతర్జాతీయ పౌరవిమానయానసంఘం 1945 అక్టోబరులో ఏర్పడింది. ఈ సంఘస్థాపనకు ప్రపంచరాజ్యాల ప్రతినిధులు మొట్టమొదట మాంట్రియల్‌లో సమావేశమై, పౌరవిమానయానం సందర్భంలో వివిధ దేశాలు పాటింపవలసిన సూత్రాలను, నిబంధనలను తయారుచేశారు. ప్రపంచ రాజ్యాలన్నీ ఈ సూత్రాలను పాటిస్తున్నవా? లేదా? అన్న విషయాన్నికూడా ఈ సంఘం విచారించుతూ వుంటుంది.

ప్రపంచారోగ్య సంస్థస్థాపనకు సమితి ఆర్థిక సాంఘిక సంఘం 1946 జూన్ మాసంలో ప్రపంచ రాజ్యాల సమావేశాన్ని ఏర్పాటు చేసినది.

క్రొత్త ఔషధాలకు, వైద్యపరిశోధనలకు సంబంధించిన సమాచారాన్ని సేకరించి అన్ని దేశాలకు అందజేస్తుంది.

ఈ సంస్థకు ఇతర సంఘాలకు లేని అధికారముంది. ఈ సంస్థ ఏర్పాటు చేసే నిబంధనలను అన్ని దేశాలు అంగీకరించవలసి ఉంటుంది. ప్రపంచ ఆహార వ్యవసాయక సంస్థ వలెనే ఈ సంస్థకూ ఒక కార్యవర్గం, ఒక డైరెక్టరు జనరల్ ఉంటారు.

కొద్దిరోజులే పనిచేసినప్పటికి ఐక్యరాజ్య సహాయక పునరావాస సంఘం ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో పూర్తిగా దెబ్బతిని పోయిన ప్రజలకు పునరావాసం కల్పించడానికి ఎంతో కృషిచేసింది.

అధ్యాయము 17

# అంతర్జాతీయ ఒడంబడికలు

## అట్లాంటిక్ ప్రణాళిక

అమెరికా అధ్యక్షుడు ఫ్రాంక్లిన్ డిలానో రూజ్‌వెల్టు, బ్రిటిష్ ప్రభుత్వం పక్షాన ప్రధానమంత్రి విన్‌స్టన్ చర్చిల్ కూడా కలుసుకొని ఉజ్వల ప్రపంచ భవిష్యత్తుకు ఆధారభూతము కావలసిన తమ ప్రభుత్వాల జాతీయవిధానాలను గురించి కొన్ని విషయాలు ప్రకటించటం అవసరం అని భావించి సమష్టిగా ఈ క్రింది ప్రకటన చేస్తున్నారు.

వారి ప్రభుత్వాలకు, వారి దేశాలకు అన్య రాజ్యాలపై ఎట్టి అపేక్ష లేదు. ఏదేశంపై నా దురాక్రమణ జరపాలనే సంకల్పం లేదు.

ప్రజలు స్వేచ్ఛగా, తమకై తాముగా ప్రకటించు అభిమతములకు విరుద్ధముగ ఉండే ప్రాదేశిక మార్పులను చేయాలనే ఉద్దేశ్యం వారికిలేదు.

ప్రజలు యావన్మందికి తమ కిష్టమైన ప్రభుత్వాన్ని ఎన్నుకునే హక్కు ఉంది. ఆ హక్కును ఈ దేశాలు గౌరవిస్తున్నవి. కొన్ని దేశాల ప్రజలు తమ ప్రాథమిక హక్కులను, స్వపరిపాలనాధికారాన్ని కోల్పోయినారు. అట్టి ప్రజలకు ఆ హక్కులను, స్వపరిపాలనాధికారం తిరిగి లభించేటట్లు చూడగలవు.

ప్రపంచ రాజ్యాల అభ్యుదయ, ఆర్థికాభివృద్ధికి ఎంతో ఆవశ్యకము స్వేచ్ఛా వ్యాపారము, ముడిపదార్థాల సప్లయి. విజయులైనా, పరాజితులైనా, అగ్రరాజ్యాలైనా, అల్పదేశాలైనా ప్రపంచ దేశాలన్నింటికీ ముడి పదార్థాలను పొందడానికి, తమ వ్యాపారాన్ని సాగించుకోవడానికి సమానావకాశాలు ఉండాలని విశ్వసిస్తూ, ప్రస్తుత ఏర్పాట్లకు భంగం కలగకుండా, వాటిని అన్ని రాజ్యాలకు సమకూర్చడానికి ప్రయత్నిస్తుంది.

కార్మికుల జీవన పరిస్థితులను బాగుచేయడానికి, ఆర్థిక అభివృద్ధిని సాధించడానికి, సాంఘిక భద్రతను సమకూర్చడానికి ఆర్థిక రంగంలో ప్రపంచ రాజ్యాలు పరస్పరం సహకరించుకోవలసి ఉన్నది. అట్టి సహకారాన్ని సాధించాలని ఈ రెండు దేశాలు ఆతురతగా వాంఛిస్తున్నవి.

నాజీ నియంతృత్వాన్ని సమూలంగా నిర్మూలించిన తరువాత, ప్రతి దేశమూ వాని సరిహద్దుల లోపల సుఖంగా వుండడానికీ, ప్రపంచ ప్రజలు అందరూ వారు ఏదేశంలో వున్నప్పటికీ నిర్భయంగా, లేమి ఎరుగకుండా హాయిగా జీవించడానికీ అవసరమైన స్థిరశాంతిని స్థాపించేందుకు ఈ రెండు రాజ్యాలూ కృషి చేయగలవు.

అట్టి శాంతి ఏర్పడినప్పుడు ప్రపంచ ప్రజలు యథేచ్ఛగా ఎవరివల్లా ఎలాంటి ప్రతిబంధకాలూ కలగకుండా స్వేచ్ఛగా ప్రయాణం చేయడం సాధ్యమౌతుంది.

ప్రపంచ రాజ్యాలన్నీ ఐహికాముష్మిక దృష్ట్యా దౌర్జన్యాన్ని విసర్జించేందుకు సమైక్యం కావడం అవసరమని ఈ రాజ్యాల విశ్వాసం. వివిధ దేశాలు యుద్ధనౌకలను, బాంబరు విమానాలను, పదాతి దళాలను పెంచుకుంటూ పోతే, వాటిని దురాక్రమణకు వినియోగించ గలమని ఈ దేశాలు బెదిరిస్తూవుంటే భవిష్యత్తులో శాంతి స్థాపన సాధ్యంగాదు. కాబట్టి, యావత్ప్రపంచానికీ భద్రతను చేకూర్చగల ఒక శాశ్వత, స్థిరమైన సంస్థ ఏర్పడే వరకూ ఇట్టి రాజ్యాల నిరాయుధీకరణ అవసరమని ఈ రాజ్యాలు విశ్వసిస్తున్నవి. ఆ దృష్టితో శాంతి కాముక రాజ్యాలను అణగార్చి వేసే ఆయుధాల భారాన్ని తగ్గించివేయడానికి అవసరమైన చర్యలన్నీ తీసుకొని ఆ రాజ్యాలకు సహాయ పడగలవు.

ఆగష్టు 14, 1941.

ఫ్రాంక్లిన్ డి. రూజ్ వెల్ట్
విన్‌స్టన్ యస్. చర్చిల్.

## ఐక్యరాజ్యాల ప్రకటన

అమెరికా అధ్యక్షుడు, బ్రిటన్ ప్రధానమంత్రి 1941 ఆగష్టు 14 వ తేదీన చేసిన సమష్టి ప్రకటనాంశములతోనూ, లక్ష్యాశయములతోనూ ఏకీభవించి, మా దేశములలో ప్రజల రక్షణకు స్వేచ్ఛా స్వాతంత్ర్యములు, మత స్వాతంత్ర్యము, మానవహక్కులు, ధర్మముల పరిరక్షణకు శత్రువులపై సంపూర్ణ విజయమును సాధించుట అత్యంతావశ్యకమని గుర్తించి, తామిప్పుడు ప్రపంచాన్ని అణచివేసేటందుకుగాను కృషి చేస్తున్న రాక్షస, పైశాచిక శక్తులతో తీవ్ర పోరాటాన్ని సాగించుచున్న విషయాలను తెలుసుకొని అమెరికా, బ్రిటన్, రష్యా, చైనా, ఆస్ట్రేలియా, బెల్జియం

చకస్లవేకియా, కెనడా, కోస్టరికా, ఎల్ సాల్వడార్, గ్రీస్, గాటిమాలా, హైటి, హోండురాస్, ఇండియా, లగ్జంబర్గ్, నెదర్లాండ్స్, న్యూజీలాండ్, నికరాగ్వా, నార్వే, పనామా, పోలెండ్, దక్షిణ ఆఫ్రికా, యుగోస్లావియా ప్రభుత్వాలు ఈ విధంగా ప్రకటిస్తున్నవి.

త్రైపక్ష రాజ్యాలతో యుద్ధంచేస్తున్న ఈ దేశాలు ఆ రాజ్యాలపై సంపూర్ణవిజయం సాధించడానికి తమకుగల యావత్తు సైనిక ఆర్థికశక్తినీ వినియోగింప ఇందుమూలంగా ప్రమాణం చేస్తున్నవి.

శత్రు రాజ్యాలతో ప్రత్యేకంగా యుద్ధవిరమణ ఒప్పందాలనుగాని, శాంతి ఒడంబడికలనుగాని జరుపుకోమని, ఇతర మిత్రరాజ్యాలతో సంపూర్ణంగా, మనస్ఫూర్తిగా సహకరింపగలమని ప్రతి ఒక్కదేశమూ ఇందు మూలంగా హామీ ఇస్తున్నవి.

హిట్లరిజంపై విజయసాధనకు ఇతోధికంగా, యావచ్ఛక్తిని వినియోగించి తోడ్పడు ఇతర రాజ్యాలు కూడా మున్ముందు ఈ ప్రకటనను ఆమోదింపవచ్చును.

వాషింగ్టన్‌లో 1942 జనవరి 15 వ తేదీన ఈ పత్రంపై సంతకం చేయడమైనది.

## ఐక్యరాజ్యసమితి ప్రణాళిక

పరిచయం: ఈ పురుషాంతరంలోనే రెండుదఫాలు మానవకోటికి అంతులేని బాధలను కలిగించిన యుద్ధపిశాచాన్ని పూర్తిగా నిర్మూలించి ముందుయుగాల వారిని ఈ పైశాచిక శక్తులనుండి సంరక్షించుటకు మిత్ర రాజ్యాల ప్రజలమైన మేము కృతనిశ్చయులమై ఉన్నాం.

ప్రాథమిక మానవ హక్కులలో, ప్రపంచరాజ్యాల స్త్రీ పురుషుల సమానత్వంలో, మానవుని గౌరవ ప్రపత్తులలో మా అచంచల విశ్వాసాన్ని పునరుద్ఘాటిస్తున్నాం.

న్యాయసమ్మతమైన సన్నివేశాలు, అంతర్జాతీయ ఒడంబడికలు, శాసనాలు కల్పించు బాధ్యతలు, విధులు పాలింపబడుటకు, అనుకూలమైన పరిస్థితులు కల్పించుటకు సర్వశక్తులా కృషిచేయ నిర్ణయించుకుంటున్నాం.

విస్తృత స్వాతంత్ర్యంలో సాంఘికాభ్యుదయము, ప్రజల జీవన ప్రమాణాభివృద్ధి సాధనలకు కృషిచేస్తూ, అట్టికృషి సఫలం కావడానికి దోహదం చేయగలమని ఇందుమూలకంగా ప్రకటిస్తున్నాం.

ఈ లక్ష్యాలను సాధించడానికి మేము క్రింది మార్గాలను అనుసరింప నిశ్చయించినాము.

ఓర్మితోనూ, సహనభావంతోనూ, మిత్రులవలెనూ శాంతియుత వాతావరణంలో జీవించడానికి మేము ప్రతిఒక్కరమూ ప్రయత్నిస్తాం.

అంతర్జాతీయ శాంతి భద్రతల పరిరక్షణకు సమైక్యంగా వ్యవహరించగలం.

సమష్టి ప్రయోజనముల సాధనకు తప్ప సైన్యాన్ని, ఆయుధాలను ప్రయోగింపరాదని సిద్ధాంతీకరించి, ఆ సిద్ధాంతాలను అందరూ అంగీకరించేట్లు చేస్తూ, వాటిని అమలు జరపడానికి అవసరమైన సంస్థలను స్థాపించగలం.

ప్రపంచ ప్రజలందరి సాంఘిక, ఆర్థిక అభివృద్ధిని సాధించడానికి అంతర్జాతీయ సంస్థలను స్థాపించి వాటిద్వారా కృషిచేయడానికి నిశ్చయించుకుంటున్నాం.

ఈ కార్యాచరణలో సమైక్యంగా కృషిచేయడానికి తీర్మానిస్తూ కృషిచేయగలమని వాగ్దానం చేస్తున్నాం.

తదనుగుణంగా మా ప్రభుత్వాల ప్రతినిధులు శాన్‌ఫ్రాన్సిస్కో మహానగరంలో సమావేశమై ఈ ప్రణాళిక సక్రమంగానూ, సవ్యంగానూ వున్నదని గుర్తించి ఈ ఐక్యరాజ్య ప్రణాళికను అంగీకరించిన ఫలితంగా "ఐక్యరాజ్యసమితి" పేరున వర్థిల్లు ఈ అంతర్జాతీయ సంస్థను స్థాపిస్తున్నాం.

## మొదటి ప్రకరణ

### లక్ష్యాలు - సూత్రాలు

ఆర్టికల్ 1

ఐక్యరాజ్యసమితి లక్ష్యాలు ఏవి అనగా:—1. అంతర్జాతీయ శాంతి భద్రతలను కాపాడుట. ఇందునిమిత్తం శాంతికి ముప్పుతెచ్చిపెట్టగల పరిస్థితి ఏర్పడే సూచనలు కల్పించినప్పుడు అట్టి ప్రమాదం ఏర్పడకుండానూ, ఏర్పడి

నప్పుడు ఆ ముప్పును తొలగించడానికి, దురాక్రమణ చర్యలను, శాంతిని భంగించగల చర్యలను అణచి వేయడానికి ప్రయోజనకరమైన సమష్టి చర్యలను తీసుకోవాలి. శాంతికి భంగం కల్పించగల తగాయిదాలు ఏర్పడినప్పుడు అంతర్జాతీయ న్యాయ, ధర్మశాస్త్రముల ననుసరించి ఆ తగాయిదా పరిష్కారానికి అవసరమైన చర్యలు తీసుకోవాలి.

2. ప్రజల స్వయం నిర్ణయాధికారాన్ని, ప్రపంచ రాజ్యాల సమానత్వాన్ని గుర్తించి ఆ సూత్రాలు ఆధారంగా వివిధ రాజ్యాల మధ్య మైత్రీ సంబంధాలను పెంపొందిస్తూ లోకశాంతిని సుస్థిరం చేయడానికి సముచితమైన యావత్తు చర్యలనూ తీసుకోవాలి.

3. ప్రపంచ పరివ్యాప్త ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక, జీవకారుణ్య స్వభావం కలిగివున్నటువంటి వివిధ సమస్యల పరిష్కారానికి అంతర్జాతీయ సహకారాన్ని సాధించి, మానవ హక్కులు, ప్రాథమిక, ప్రాతిపదిక స్వాతంత్ర్యాలు మత, జాతి, భాష, లింగ భేదం లేకుండా యావన్మందికీ, ప్రాప్తించేటట్లు చూచేందుకు కృషి చేయాలి.

4. ఈ సమష్టి లక్ష్యాల సాధనకు వివిధ రాజ్యాలు చేసే కృషిని సమన్వయ పరచాలి.

ఆర్టికల్ 2.

ఈ సంస్థ, ఈ సంస్థ సభ్యులు మొదటి ఆర్టికల్‌లో పేర్కొన్న లక్ష్యాల సాధనకు ఇక్కడ వివరిస్తున్న సూత్రాలను అనుసరించి కృషి చేయవలసి యుండును.

1. ప్రపంచ రాజ్యా లన్నింటికీ గల అధికారం ఒకటే నన్న సూత్రం పైన, ప్రపంచ రాజ్యాలన్నీ సమమే నన్న సూత్రంపైన ఈ సంస్థ ఏర్పడింది.

2. సభ్యులు యావన్మందీ, ఈ సంస్థ సభ్యత్వంవల్ల ప్రాప్తించు ప్రయోజనాలు, హక్కులు అందరికీ సమకూరే విధంగా, ఈ ప్రణాళిక విధించిన బాధ్యతలను, నిర్దేశించిన విధులను నిర్వర్తింపవలెను.

3. అంతర్జాతీయ శాంతి, భద్రత, న్యాయములకు ప్రమాదం ఏర్పడని విధంగా ఈ సంస్థ సభ్యులందరూ తమకు ప్రమేయమున్న అంతర్జాతీయ

తగాయిదాలను పరిష్కరించుకోవలెను. అందుకు వారు శాంతియుత మార్గములనే అనుసరింపగలరు.

4. ఇతర దేశస్థుల స్వాతంత్ర్యాన్ని హరించగల, ఇతర దేశాల సరిహద్దుల భంగపరచగల, ఇతర రాజ్యాల రాజకీయ స్వాతంత్ర్యాన్ని భగ్నం చేయగల చర్యలను పేటినీ సమితి సభ్యత్వంగల దేశాలు తమ తగాయిదాల పరిష్కారార్థం తీసుకొనవు. ఐక్యరాజ్య సమితి లక్ష్యాలకు విరుద్ధంగా ఉండే ఏ చర్యలనుకూడా సమితి రాజ్యాలు తీసుకొనవు.

5. ప్రస్తుత ప్రణాళికను అనుసరించి సమితి తీసుకునే ప్రతి ఒక్క చర్యలోనూ సమితి దేశాలకు సహాయపడుతూ, ఏ దేశంపై సమితి చర్యలు తీసుకొంటున్నదో ఆ దేశానికి సమితి రాజ్యాలు ఎట్టి సహాయమూ చేయరాదు.

6. అంతర్జాతీయ శాంతి భద్రతలకు అవసరమైనంత వరకూ సమితిలో చేరని దేశాలు సహితం ఈ ప్రణాళిక ననుసరించి నడుచుకునేటట్లు ఐక్య రాజ్య సమితి చూడాలి.

7. అయితే, ఒక దేశ అంతరంగిక వ్యవహారాల్లో జోక్యం కల్గించుకునే అధికారం సమితికి ఈ ప్రణాళిక సంక్రమింపచేయడం లేదు. అలాంటి వ్యవహారాలకు పరిష్కారార్థం సమితికి నివేదించాలనికూడా ఏ దేశాన్నీ నిర్బంధించడానికి ఈ ప్రణాళిక అధికారం ఇవ్వడం లేదు. అయినా, ఈ ప్రణాళికలోని సప్తమ ప్రకరణాన్ని అనుసరించి సమితి చర్యలు తీసుకుంటూవుంటే అందుకు సూత్రం అడ్డురాదు.

# రెండవ ప్రకరణ

## సభ్యత్వం

ఆర్టికల్ 3:

శాన్ ఫ్రాన్సిస్కోలో జరిగిన ఐక్యరాజ్య మహాసభలో పాల్గొని గాని, లేక 1942 జనవరి 1 న ఐక్యరాజ్యాలు చేసిన ప్రకటనను ఆమోదించిగాని ఈ ప్రణాళికను ఆర్టికల్ 110 ని అనుసరించి ఆమోదించిన రాజ్యాలు సమితి స్థాపక సభ్యులుగా నుండును.

ఆర్టికల్ 4:

1. ఈ ప్రణాళిక విధించిన బాధ్యతలను అంగీకరించిన శాంతికాముక రాజ్యాలన్నీ సమితిలో చేరవచ్చును. అయితే, అట్టి రాజ్యాలకు సభ్యత్వం లభించడానికి ముందు ఆ రాజ్యాలు ప్రణాళిక విధులను, బాధ్యతలను నిర్వర్తింపగలవనీ, నిర్వర్తించాలనే అభిలాష ఆ రాజ్యాలకు ఉన్నదనీ సమితికి నమ్మకం కలగాలి.

2. ఇట్టి రాజ్యాలకు సభ్యత్వం లభించడం అన్నది భద్రతామండలి సిఫార్సులపై సమితి సర్వసభ్య సంఘం చేసే తీర్మానం మీద ఆధారపడి ఉంటుంది.

ఆర్టికల్ 5:

సమితిలో సభ్యత్వంగల ఒక దేశంపై భద్రతా మండలి కొన్ని చర్యలు తీసుకుంటే, భద్రతామండలి సూచనపై సమితి సర్వసభ్య సంఘం ఆ దేశానికి సమితి సభ్యత్వం వల్ల లభించిన హక్కులను, అధికారాలను రద్దు చేయవచ్చును. తిరిగి ఈ హక్కులను, అధికారాలను భద్రతామండలి ఆదేశానికి ప్రసాదింపవచ్చును.

ఆర్టికల్ 6:

ఒక దేశం ఆదేపనిగా ఈ ప్రణాళిక సూత్రాలకు విరుద్ధంగా ప్రవర్తిస్తూ వుంటే, భద్రతా మండలి ప్రతిపాదనపై సమితి సర్వసభ్య సంఘం ఆదేశాన్ని సమితినుండి బహిష్కరింపవచ్చును.

# మూడవ ప్రకరణ

## సమితి సంఘాలు

ఆర్టికల్ 7:

1. సర్వసభ్య సంఘం, భద్రతామండలి, ఆర్థిక సాంఘిక సంఘం, ధర్మకర్తృత్వ సంఘం, అంతర్జాతీయ న్యాయస్థానం, ఒక సెక్రటేరియట్ (కార్యాలయం) సమితి ప్రధానాంశాలుగా ఏర్పాటు చేయబడినవి.

2. అవసరమైనప్పుడు ఈ ప్రణాళికను అనుసరించి మరికొన్ని అధీన సంఘాలను ఏర్పాటు చేయవచ్చును.

ఆర్టికల్ 8:

సమితికి చెందిన ఈ ప్రధానశాఖలలోనూ, ఇతర అధీన సంఘాల లోనూ ఏ హోదాలోనైనా సరే స్త్రీలు, పురుషులు పాల్గొనే అర్హతల నిర్ణయంలో సమితి ఎట్టి నిర్బంధాలను విధించదు.

# నాల్గవ ప్రకరణ

## సర్వసభ్య సంఘం

### స్వరూపం

ఆర్టికల్ 9:

**1.** సమితిలో సభ్యత్వం గల రాజ్యాలన్నీ చేరి, సర్వసభ్య సంఘంగా ఏర్పడును.

**2.** ఏ సభ్యత్వ రాజ్యానికీ సర్వసభ్య సంఘంలో అయిదుగురుకంటే ఎక్కువ మంది ప్రతినిధులు ఉండరాదు.

### పనులు, అధికారాలు

ఆర్టికల్ 10:

ఈ ప్రణాళికాంశములకు సంబంధించిన ఏ విషయాన్ని అయినా, ప్రణాళికను అనుసరించి ఏర్పడే వివిధశాఖల సంఘాల పనులు, అధికారాలను గురించి సర్వసభ్య సంఘం చర్చించవచ్చును. ఈ ప్రణాళికలోని 12 వ ఆర్టికల్ వివరించిన సందర్భాల్లో గాక, ఇతర సందర్భాల్లో సమితి సభ్యులకుగాని, భద్రతామండలికి గాని, లేక ఉభయులకు గాని ఈ ప్రణాళికాంశములకు సంబంధించిన వ్యవహారాలలో ఫలానా విధంగా ప్రవర్తించవలసిందని సిఫార్సు చేయవచ్చును.

ఆర్టికల్ 11:

1. నిరాయుధీకరణ, ఆయుధాల ప్రమాణ నిర్ణయంతో సహా అంతర్జాతీయ శాంతి భద్రతల సంరక్షణలో ప్రపంచ రాజ్యాల సహకారానికి సంబంధించిన సూత్రాలను విచారించి, అనుసరింపతగ్గ కార్యక్రమం

గురించి సమితి సభ్యులకు గాని, భద్రతామండలికి గాని, లేక ఉభయులకు గాని సిఫార్సులు చేయవచ్చును.

2. సమితిలో సభ్యత్వం గల దేశంగాని, భద్రతామండలిగాని, సమితి సభ్యత్వం లేకపోయినప్పటికీ ఈ ప్రణాళికలోని 35 వ ఆర్టికల్ లోని 2 వ నిబంధన ప్రకారం అట్టి దేశంగాని అంతర్జాతీయ శాంతి భద్రతలను సంబంధించి ప్రతిపాదించే ఏ విషయాన్ని అయినా చర్చించి 12 వ ఆర్టికల్ కు లోబడి కొన్ని ప్రతిపాదనలను అందుకు సంబంధించిన దేశాలకు గాని, భద్రతామండలికి గాని, లేక ఉభయులకూ గాని చేయవచ్చును. చర్యలు తీసుకోవలసి యున్న ఏ సమస్యనైనా సర్వసభ్య సంఘం, ఆ సమస్యను చర్చించిన తరువాత గాని, చర్చించుటకు ముందుగాని భద్రతా మండలికి సూచింపవచ్చును.

3. అంతర్జాతీయ శాంతి భద్రతలకు ప్రమాదకరంగా పరిణమించగల పరిస్థితులను సర్వసభ్య సంఘం భద్రతామండలి దృష్టికి తీసుకురావచ్చును.

4. ఈ 11 వ ఆర్టికల్ సర్వసభ్య సంఘాని కిచ్చిన అధికారాలు 10 వ ఆర్టికల్ ను ఏ విధంగానూ పరిమితం చేయడంలేదు.

ఆర్టికల్ 12 :

1. ఒక తగాయిదానుగాని, ఒక విపత్కర పరిస్థితిగాని భద్రతా మండలి చర్చిస్తున్నంత కాలం, భద్రతామండలి కోరితేనే తప్ప, ఆ సమస్యను గురించిగాని, ఆ విపత్కర పరిస్థితిని గురించిగాని సమితి సర్వసభ్య సంఘం ఏ విధమైన ప్రతిపాదనలు చేయడానికి వీలులేదు.

2. సమితి సర్వసభ్య సంఘం సమావేశం అయ్యేముందు సెక్రటరీ జనరల్ అంతర్జాతీయ శాంతి భద్రతలకు సంబంధించిన ఏ యే సమస్యలను, ఏ యే పరిస్థితులను భద్రతా మండలి విచారిస్తున్నదీ సమితి సంఘానికి తెలియజేస్తాడు. భద్రతా మండలి ఎప్పుడైతే ఈ విషయాల విచారణను విరమిస్తుందో అప్పుడు ఆ విషయాన్ని సమితి సర్వసభ్య సంఘానికి, సమితి సంఘం సమావేశం కాకుండా ఉన్న సందర్భాల్లో సమితి సభ్యులకు సెక్రటరీ జనరల్ నివేదిస్తాడు.

ఆర్టికల్ 13 :

1. అంతర్జాతీయ రాజకీయరంగంలో సహకారాన్ని పెంపొందిస్తూ, అంతర్జాతీయ న్యాయశాస్త్రం ధర్మసూత్ర ప్రతిక్రమానుగతాభివర్ధిని, క్రోడీకరణను ప్రోత్సహిస్తూ, ఆర్థిక, సాంస్కృతిక, సాంఘిక, విద్యా, ఆరోగ్య విషయక రంగములలో అంతర్జాతీయ సహకారాన్ని ప్రోత్సహించుచూ, ఏలాంటి విచక్షణ లేకుండా స్త్రీలకు, పురుషులకు, అన్ని మతాలవారికి, అన్ని జాతులవారికి, అన్ని భాషలవారికి మానవ హక్కులు, ప్రాథమిక స్వాతంత్ర్యాలు సమకూరేటట్లు చేయడానికీ, సమితి సర్వసభ సంఘం అవసరమైన విచారణలను జరిపి తదను గుణంగా సమితి రాజ్యాలకు సిఫారసులు చేస్తూ వుంటుంది.

2. పైన పేర్కొన్న విషయాలను సంబంధించి సమితి సర్వసభ్య సంఘానికి ఉండిన బాధ్యతలు, విధులు, అధికారాలు 9, 10 ప్రకరణలలో వివరింపబడినవి.

ఆర్టికల్ 14 :

వివిధ రాజ్యాలు సమితి ప్రణాళికలో నిర్వచింపబడిన లక్ష్యాలు, సూత్రాలకు విరుద్ధంగా ప్రవర్తించడంవల్ల ఏర్పడిన పరిస్థితులతోసహా, ప్రపంచ రాజ్యాల మైత్రీ సంబంధాలకు భంగం కలిగించే పరిస్థితైనా, ఆ పరిస్థితి ఎందువల్ల ఏర్పడినప్పటికీ సమితి సర్వసభ్య సంఘం ప్రణాళికలోని 12 వ ఆర్టికల్‌కు లోబడి చర్చించి, ఆ పరిస్థితిని పరిష్కరించడానికి అవసరమైన ప్రతిపాదనలను చేయవచ్చును.

ఆర్టికల్ 15 :

1. భద్రతా మండలి సమర్పించే ప్రత్యేక వార్షిక నివేదికలను సమితి సర్వసభ్య సంఘం స్వీకరించి చర్చింపగలదు. అంతర్జాతీయ శాంతి భద్రతల సంరక్షణకు భద్రతామండలి తీసుకొన్న, తీసుకోదలచిన చర్యలను అన్నింటినీ ఈ నివేదికలలో పొందుపరుపబడును.

2. సమితికి చెందిన ఇతర శాఖలు, సంఘములు పంపే నివేదికలను కూడా సమితి సర్వసభ్య సంఘం చర్చించగలదు.

ఆర్టికల్ 16:

అంతర్జాతీయ ధర్మకర్తృత్వ పద్ధతికి సంబంధించి 12, 13 ప్రణాళిక నిబంధనలలో పేర్కొనబడినట్టి బాధ్యతలను సమితి సర్వసభ్య సంఘం నిర్వర్తించగలదు. సైనిక, యుద్ధవ్యూహం దృష్ట్యా ముఖ్యమని పేర్కొన బడినట్టి ప్రాంతాలను సంబంధించిన ధర్మకర్తృత్వ ఒడంబడికలను సమితి సర్వసభ్య సంఘం ఆమోదించవలసి యుండును.

ఆర్టికల్ 17:

1. సమితి సంస్థను సంబంధించిన ఆయవ్యయ అంచనాలను విచారించి ఆమోదించగలదు.

2. సమితి ఖర్చులను సర్వసభ్య సంఘం నిర్ణయించిన ప్రకారం సమితి రాజ్యాలు భరింపవలసి యుండును.

3. ప్రణాళికలోని 57 వ ఆర్టికల్‌లో పేర్కొనబడిన సమితి ప్రత్యేక శాఖలు, సంఘాలు ఏర్పాటు చేసుకున్న ఆర్థిక ఒప్పందాలను విచారించి ఆమోదించును. ఆ ప్రత్యేక సంఘాలను సంబంధించిన ఆయ వ్యయ పట్టికను పరిశీలించి ఆ యా సంఘాలకు అవసరమైన ప్రతిపాదనలను సమితి సర్వసభ్య సంఘం చేయగలదు.

## వోటింగ్

ఆర్టికల్ 18:

సమితి సభ్యత్వం గల ప్రతిదేశానికి ఒక్క వోటు ఉంటుంది. ప్రధానాంశాలను సంబంధించిన తీర్మానాల ఆమోదానికి సమావేశానికి హాజరైన మొత్తం సభ్యులలో మూడింట రెండువంతుల సభ్యుల సమ్మతి కావాలి. ప్రధాన విషయాలు ఏవి అనగా: అంతర్జాతీయ శాంతి భద్రతలను సంబంధించిన ప్రతిపాదనలు, భద్రతామండలిలోని ఆరు స్థానాలకు సభ్యుల ఎన్నిక, 86 వ ఆర్టికల్‌లోని 1 (సి) క్లాజును అనుసరించి ధర్మకర్తృత్వ సంఘానికి సభ్యుల ఎన్నిక, సమితిలో కొత్త దేశాలకు సభ్యత్వం లభింప చేయడం, ఒకే దేశానికి గల సభ్యత్వ అధికారాలు, అర్హతలను రద్దు చేయుట, ధర్మకర్తృత్వ పద్ధతి అమలు జరిపే విధానం, బడ్జెట్‌కు సంబంధించిన వ్యవహారాలు.

3. మూడింట రెండువంతుల మెజారిటీతో ఇంకా ఏ యే తీర్మానాలు జరగాలనే విషయంతో సహా, అన్ని ఇతర తీర్మానాల ఆమోదానికీ సమావేశానికి హాజరైన సభ్యులలో మెజారిటీ సభ్యులు తమ సమ్మతిని తెలియజేస్తే చాలు.

ఆర్టికల్ 19:

సమితికి చెల్లింపవలసిన రుసుమును ఏ దేశమైనా చెల్లింపకపోతే, అందువల్ల బాకీపడిన మొత్తం ఆ దేశం క్రిందటి రెండు సంవత్సరాలలో (24 మాసాలు) చెల్లించిన మొత్తానికి మించివుంటే అట్టి దేశానికి సమితి సర్వసభ్య సంఘంలో వోటు వుండదు. అయితే, అలాంటి సందర్భాల్లో ఈ దేశం దానికి అతీతంగా ఉండిపోయిన కారణాలవల్ల బాకీ చెల్లింపలేకపోయిందని సర్వసభ్య సంఘం భావిస్తే, ఆ దేశానికి సర్వసభ్య సంఘం వోటు హక్కును ఇవ్వవచ్చును.

## కార్య విధానం

ఆర్టికల్ 20:

సాధారణంగా సర్వసభ్య సంఘం వార్షికంగా సమావేశమాతుంది. అవసరమైనప్పుడు ప్రత్యేక సమావేశాలనుకూడా జరుపవచ్చును. భద్రతా మండలిగాని, సమితి సభ్యులలో హెచ్చుమందిగాని కోరిన పక్షంలో సెక్రటరీ జనరల్ సర్వసభ్య సంఘ ప్రత్యేక సమావేశాలను ఏర్పాటు చేయవచ్చును.

ఆర్టికల్ 21:

కార్యక్రమానికి సంబంధించిన నియమాలను, నిబంధనలను సమితి సర్వసభ్య సంఘమే నిర్ణయించుకుంటుంది. ప్రతి సమావేశానికి ఒక అధ్యక్షుణ్ణి ఎన్నుకుంటుంది.

ఆర్టికల్ 22:

తన బాధ్యతల నిర్వహణ నిమిత్తం ఏవైనా ప్రత్యేక సంఘాలు, శాఖలు అవసరమని భావిస్తే, సర్వసభ్య సంఘం అట్టి శాఖలను, సంఘాలను నెలకొల్పవచ్చును.

# అయిదవ ప్రకరణ

## భద్రతా మండలి

### నిర్మాణం

ఆర్టికల్ 23 :

1. సమితిలో సభ్యత్వం గల 11 రాజ్యాలు చేరి భద్రతామండలిగా ఏర్పడతవి. చైనా, ఫ్రాన్సు, రష్యా, బ్రిటన్, అమెరికాలు మండలిలో శాశ్వత సభ్యత్వం కలిగి ఉంటవి. మిగతా ఆరుగురు సభ్యులను సమితి సర్వసభ్య సంఘం ఎన్నుకొంటుంది. వివిధ దేశాలనుంచి మండలికి సభ్యులను ఎన్నుకోవడంలో అంతర్జాతీయ శాంతి భద్రతల సంరక్షణకు, సమితి లక్ష్యాల సాధనకు ఆ యా దేశాల కృషితో పాటు ప్రాంతీయ ప్రాతినిధ్య సూత్రాలన్నీ సమితి సర్వసభ్య సంఘం ప్రధానంగా గమనిస్తూ ఉంటుంది.

2. శాశ్వత సభ్యత్వం లేని ఆరు దేశాలు రెండేళ్ళ కొకసారి ఎన్నిక అవుతూ ఉండవలెను. అయితే, మొట్టమొదటి ఎన్నికలో ఈ ఆరు దేశాల్లోనూ మూడు దేశాలు మాత్రం ఏడాది సభ్యత్వానికి ఎన్నిక అవుతు. సభ్యత్వ కాలపరిమితి తీరిన ఏ దేశమూ వెంటనే తిరిగి ఎన్నికకు నిలబడేందుకు వీలులేదు.

3. భద్రతామండలిలో సభ్యత్వ దేశాలు ఒక్కొక్క దానికి ఒక్కొక్క ప్రతినిధి మాత్రం ఉంటాడు.

### నిర్వహింపవలసిన పనులు, అధికారాలు

ఆర్టికల్ 24 :

1. ఐక్యరాజ్య సమితి శీఘ్రంగానూ, ప్రయోజనకరంగానూ చర్యలు తీసుకునేందుకు వీలుగా, అంతర్జాతీయ శాంతి భద్రతల సంరక్షణ బాధ్యతను సమితి రాజ్యాలు పూర్తిగా భద్రతామండలిపై నుంచినవి. ఈ బాధ్యతా నిర్వహణలో భద్రతామండలి తమ పక్షాన వ్యవహారం చేయడానికి కూడా ఈ రాజ్యాలు అంగీకరించుచున్నవి.

2. భద్రతామండలి ఈ బాధ్యతలను నిర్వర్తించడంలో సమితి సూత్రాలను, లక్ష్యాలను అనుగుణంగా వ్యవహరింపవలసి ఉంటుంది.

ఈ బాధ్యతల నిర్వహణంలో భద్రతామండలి చలాయించగల విశేషాధికారాలు 6, 7, 8, 12 ప్రకరణలలో వివరింపబడినవి.

3. సమితి సర్వసభ్య సంఘ విచారణ నిమిత్తం సాధారణంగా వార్షిక నివేదికలను, అవసరమైనప్పుడు ప్రత్యేక నివేదికలను సమర్పించుతూ ఉంటుంది.

ఆర్టికల్ 25 :

ప్రస్తుత ప్రణాళిక ననుసరించి భద్రతామండలి నిర్ణయాలను అంగీకరించి అమలు జరుపడానికి సమితి రాజ్యాలు సమ్మతిస్తున్నవి.

ఆర్టికల్ 26 :

ప్రపంచ ఆర్థిక అంగబలాన్ని, ఆయుధోత్పత్తికి సాధ్యమైనంత తక్కువగా వినియోగం అయ్యేటట్లు చూస్తూ భద్రతామండలి అంతర్జాతీయ శాంతి భద్రతల సంరక్షణకు 47 వ ఆర్టికల్‌లో పేర్కొనబడిన మిలిటరీ స్టాఫ్ కమిటీ సహాయంతో సమితి రాజ్యాలకు నివేదించే నిమిత్తం ఆయుధాలను క్రమబద్ధం చేయడానికి ఒక పథకాన్ని తయారు చేయవలసి ఉంటుంది.

## వోటింగ్

ఆర్టికల్ 27 :

1. భద్రతామండలిలో సభ్యత్వం గల దేశాలు ప్రతి ఒక్క దానికీ ఒక వోటు ఉంటుంది.

2. కార్యక్రమానికి సంబంధించిన విషయాలపై భద్రతామండలి నిర్ణయాలు ఏడు అనుకూల వోట్లతో చేయబడును.

3. తదితర విషయా లన్నింటిపై భద్రతామండలి నిర్ణయాలను ఐదు శాశ్వత సభ్యులతో పాటు మరి రెండు రాజ్యాలు అనుకూలంగా వోటు చేయవలసి ఉంటుంది. అయితే, 6 వ ప్రకరణ, ఆర్టికల్ 52 లోని 3వ పేరాగ్రాఫులో పేర్కొన బడినట్లు కక్షిదారు అయిన సభ్యత్వ దేశం వోటింగ్‌లో పాల్గొనడానికి లేదు.

## కార్యక్రమము

ఆర్టికల్ 28 :

1. విరామం అనేది లేకుండా నిరంతరం పనిచేస్తూ ఉండేందుకు వీలుగా భద్రతామండలి ఏర్పాటు చేయబడింది. ఇందు నిమిత్తం సభ్యత్వ దేశాల ప్రతినిధి భద్రతామండలిలోని తన స్థానంలో తక్షణం నోటీసులో హాజరయ్యేందుకు సిద్ధంగా ఉంటాడు.

2. భద్రతామండలి సమావేశాలు అప్పుడప్పుడు జరుగుతూ వుంటవి. ఆ సమావేశాలకు సభ్యత్వ దేశాల ప్రభుత్వోద్యోగిగాని, లేక ప్రత్యేకంగా నియమింపబడిన ప్రతినిధిగాని హాజరవుతూ ఉండవచ్చును.

3. భద్రతామండలి కార్యస్థానం కాని ప్రాంతాల్లో సమావేశం కావడంవల్ల ఎక్కువ ప్రయోజనం ఉంటుంది అని అనుకుంటే ఆ విధంగా ఎక్కడైనా సమావేశం కావచ్చును.

ఆర్టికల్ 29 :

తన విధుల నిర్వహణకు భద్రతామండలి ప్రత్యేక సంఘాలనుగాని, సంస్థలనుగాని ఏర్పాటు చేయవచ్చును.

ఆర్టికల్ 30 :

కార్యక్రమ విధానాన్ని, నిబంధనలను, నియమాలను అధ్యక్షుని ఎన్నిక విధానంతోసహా భద్రతామండలే నిర్ణయించుకుంటుంది.

ఆర్టికల్ 31 :

ఏదైనా ఒక సమస్య విచారణకు వచ్చినప్పుడు అందువల్ల ఒక దేశం స్థాయిగాని, అపేక్షలకుగాని భంగం కలుగుతుందని భద్రతామండలి భావిస్తే, అట్టి దేశం చర్చలలో పాల్గొనవచ్చునని భద్రతామండలి నిర్ణయింపవచ్చును. అయితే, ఆ దేశం చర్చలలో మాత్రమే పాల్గొనగలదుగాని, వోటింగ్‌లో పాల్గొనడానికి వీలులేదు.

ఆర్టికల్ 32 :

సమితిలో సభ్యత్వం కలిగి మండలిలో సభ్యత్వంలేని ఒక దేశానికి సంబంధించిన తగాయిదా మండలి విచారణకు వస్తే, ఆ తగాయిదాకు సంబం

ధించిన చర్చలో పాల్గొనవలసిందని భద్రతామండలి ఆ దేశాన్ని ఆహ్వా నింప వచ్చును. అసలు సమితి సభ్యత్వంలేని దేశంకూడా ఒక తగాయి దాలో కక్షిదారైనప్పుడు ఆ దేశాన్నికూడా భద్రతామండలి ఆహ్వానింప వచ్చును. అయితే, ఆ దేశాలకు వోటుమాత్రం ఉండదు. సమితి సభ్యత్వం లేని దేశాలు ఈ చర్చలలో పాల్గొనడానికి సంబంధించిన నిబంధనలను భద్రతామండలి తయారుచేస్తుంది.

# ఆరవ ప్రకరణ

## సాత్విక మార్గాన తగాయిదాల పరిష్కారం

ఆర్టికల్ 33 :

ఏదైనా ఒక తగాయిదా పరిష్కారంగాకుండా అలాగే ఉండి పోయినట్లయితే అంతర్జాతీయ శాంతి భద్రతలకు భంగం కలిగే అవకాశం ఉన్నప్పుడు కక్షిదారులు ముందు ఆ తగాయిదాను పరిష్కరించుకోనడానికి రాజీ సంప్రతింపుల ద్వారా, మధ్యవర్తిత్వం ద్వారా, విచారణలద్వారా, సమాధాన పద్ధతులద్వారా, న్యాయస్థాన తీర్పుద్వారా, పరిష్కర్తృత్వం ద్వారా, ప్రాంతీయ సంఘాలు తదితర ఏర్పాట్లుద్వారా లేక తమకు సమ్మతమైన ఇతర సాత్వికమార్గాలద్వారా పరిష్కరించు కొనడానికి ప్రయత్నించాలి.

2. అవసరమని భావించినప్పుడు భద్రతామండలి కక్షిదారులను ఇట్టి మార్గాలను అనుసరించి తగాయిదా పరిష్కరించుకోవలసిందని కోర వచ్చును.

ఆర్టికల్ 34 :

అంతర్జాతీయ సంఘర్షణకు దారితీయగల తగాయిదానుగాని, పరిస్థితిని గాని, లేక తగాయిదాకు దారితీసే పరిస్థితినిగాని భద్రతామండలి, అట్టి తగాయిదాగాని, పరిస్థితిగాని అంతరాతీయ శాంతి భద్రతలకు ముప్పుతెచ్చి పెడుతుందా అనే విషయం నిర్ధారణచేసే నిమిత్తం విచారణ చేయవచ్చును.

ఆర్టికల్ 35 :

1. పైన 34 వ ఆర్టికల్‌లో ప్రస్తావింపబడిన తగాయిదానుగాని, పరిస్థితినిగాని సమితిలో సభ్యత్వంగల ఏ దేశమైనా భద్రతామండలి దృష్టికి గాని, సమితి సర్వసభ్య సంఘం దృష్టికిగాని తీసుకురావచ్చును.

2. సమితిలో సభ్యత్వం లేని దేశం ఏదైనా తన తగాయిదాలను భద్రతామండలికి గాని, సమితి సర్వసభ్య సంఘానికి గాని నివేదింపవచ్చును. అయితే, అలా నివేదించడానికి పూర్వం ఈ తగాయిదాకు సంబంధించిన వరకు "తగాయిదాల సాత్త్విక పరిష్కారం" క్రింద ఈ ప్రణాళికలో పేర్కొనబడిన నిబంధనలను, తత్సంబంధమైన బాధ్యతలను అంగీకరింప గలవని ఆ దేశం హామీ ఇవ్వాలి.

3. ఈ ఆర్టికల్‌ను అనుసరించి సమితి సర్వసభ్య సంఘం విచారణకు వచ్చే వివాదాలపై జరిగే చర్చ 11, 12 ఆర్టికల్స్‌కు లోబడి జరుగవలసి ఉంటుంది.

ఆర్టికల్ 36 :

1. పైన 33 వ ఆర్టికల్‌లో వివరింపబడిన మాదిరి తగాయిదాను గురించి గాని, ఆ విధమైన పరిస్థితిని గురించిగాని భద్రతామండలి ఏ దశలో నైనా సముచిత కార్యవిధానాన్ని, లేక సమాధాన మార్గాలను సూచింప వచ్చును.

2. అట్టి సందర్భాల్లో కక్షిదారులు అతఃపూర్వం ఒడంబడిక తగాయిదా పరిష్కార మార్గాలను భద్రతామండలి విచారణలోకి తీసుకొన వలసి ఉంటుంది.

3. ఈ ఆర్టికల్‌ను అనుసరించి భద్రతామండలి చర్యలు తీసుకునే ముందు మరొక విషయాన్ని కూడా గమనించవలసి ఉంటుంది. న్యాయ శాస్త్ర విషయకమైన తగాయిదాలను కక్షిదారులు వారికై వారే అంతర్జా తీయ న్యాయస్థానం చట్టాన్ని అనుసరించి విధిగా ఆ న్యాయస్థానానికి నివేదింపవలసి ఉంటుంది.

ఆర్టికల్ 37:

1. కక్షిదారులు తమ తగాయిదాను (ఆర్టికల్ 33 లో వివరింప బడిన రకం) ఆ ఆర్టికల్‌లో సూచింపబడిన పద్ధతులను అనుసరించి పరిష్కరించుకో లేకపోయినప్పుడు, వారు ఆ తగాయిదాను భద్రతామండలికి నివేదింపవలసి ఉంటుంది.

2. ఒక తగాయిదా అపరిష్కారంగా ఉండిపోయినట్లయితే అంతర్జాతీయ శాంతి భద్రతలకు ముప్పు ఏర్పడే అవకాశం వాస్తవంగా వున్నదని భద్రతామండలి భావించితే, ఆ ప్రమాదాన్ని తొలగించేందుకు 36 వ ఆర్టికల్‌ను అనుసరించి చర్యలు తీసుకోవాలా, లేక మరో మార్గం సముచితంగా ఉంటుందా అనే విషయాన్ని భద్రతామండలి నిర్ధారణ చేసుకుంటుంది.

ఆర్టికల్ 38:

ఆర్టికల్స్ 33, 34, 35, 36, 37 లో ఏమి చెప్పబడి వున్నప్పటికీ ఒక తగాయిదాకు సంబంధించిన కక్షిదారులు అందరూ కోరే పక్షంలో ఆ తగాయిదా శాంతియుత పరిష్కారానికి కక్షిదారులు అనుసరింపవలసిన పద్ధతులను, అవలంబింపవలసిన విధానాలను సూచింపవచ్చును.

## ఏడవ ప్రకరణం

### శాంతికి ప్రమాదం ఏర్పడినప్పుడు. శాంతికి భంగం కలిగినప్పుడు, దురాక్రమణ చర్యలు జరిగినప్పుడు చేయవలసిన పని

ఆర్టికల్ 39:

శాంతికి ప్రమాదం ఏర్పడనున్నట్లుగాని, శాంతికి భంగం కలిగిందని గాని, దురాక్రమణ చర్యలు జరుపబడినట్లుగాని భద్రతామండలి నిర్ధారణ చేసి, శాంతి సంరక్షణకుగాని, తిరిగి శాంతిని నెలకొల్పుటకుగాని అవసరమైన ప్రతిపాదనలను చేయవచ్చును; లేదా ఆర్టికల్స్ 41, 42 లను అనుసరించి ఏ యే చర్యలు తీసుకోవాలో నిర్ణయింపవచ్చును.

ఆర్టికల్ 40 :

ఒక పరిస్థితి విషమించకుండా చూచేందుకుగాను, ఆ పరిస్థితిని పూర్తిగా తొలగించి వేసేటందుకు 39 ఆర్టికల్‌ను అనుసరించి తీసుకోవలసిన చర్యలను నిర్ణయించేముందు, కక్షిదారులు ఏ యే విధానాలను అనుసరించడం వాంఛనీయమో, అవసరమో భద్రతామండలి సూచింపవచ్చును. ఇలాంటి తాత్కాలిక చర్యలవల్ల కక్షిదారుల అసలు హక్కులు, స్థాయి, కోర్కెలకు భంగం వాటిల్లదు. ఇట్టి తాత్కాలిక చర్యలను తీసుకోవలసిందని భద్రతామండలి ప్రతిపాదిస్తే, ఆ ప్రతిపాదనలను కక్షిదారులు తిరస్కరించి ఉంటే అట్టి పరిస్థితినికూడా భద్రతామండలి గుర్తించును.

ఆర్టికల్ 41 :

తన ప్రతిపాదనలను, నిర్ణయాలను అమలు జరిపేందుకు, సైనిక ప్రయోగం వినా, ఏ యే చర్యలను తీసుకోవలసి ఉంటుందో నిర్ధారణచేసి అట్టి చర్యలను తీసుకోవలసినదిగా సమితి దేశాలకు సిఫార్సు చేయవచ్చును. ఈ విధమైన చర్యలలో పూర్తిగాగాని, పాక్షికంగాగాని ఆర్థిక సంబంధాలను, రవాణా, రాకపోకల సంబంధాలను తెగత్రెంపులు చేసుకోవడం ఉండవచ్చును.

ఆర్టికల్ 42 :

పైన పేర్కొన్న చర్యలు చాలవని భద్రతామండలి భావించినప్పుడుగానీ, చాలవని ఋజువు అయినప్పుడుగాని అంతర్జాతీయ శాంతి భద్రతల సంరక్షణ నిమిత్తం అవసరమైన చర్యలను తెలుసుకోవచ్చును. ఈ విధమైన చర్యలు ఏవి అంటే దిగ్బంధన ప్రయోగం, బలప్రదర్శనం, లేదా సమితి రాజ్యాల పదాతి, నౌకా, వైమానిక దళాల ప్రయోగం.

ఆర్టికల్ 43 :

భద్రతామండలి పిలుపును అనుసరించి, ప్రత్యేక ఒడంబడికలకు అనుగుణంగా అంతర్జాతీయ శాంతి భద్రతల సంరక్షణకు తోడ్పడేందుకు సమితి రాజ్యాలు వాటి సాయుధబలాలను భద్రతామండలి పరంగా వుంచుతవి. అంతర్జాతీయ శాంతిభద్రతల సంరక్షణకు అవసరమైన యూపత్తు

సౌకర్యాలు, సదుపాయాలు కల్పించడానికికూడా సమితి రాజ్యాలు సిద్ధంగా ఉండాలి.

2. వీటికి సంబంధించిన ఒప్పందం, ఒడంబడికలు ఆ యా దేశాలు సప్లయి చేయగల సాయుధ బలాల వివరాలనూ, ఇతరంగా భద్రతా మండలి తీసుకునే చర్యలతో చేయగల సదుపాయాలనూ పొందుపరుస్తూ ఉంటవి.

3. భద్రతామండలి ప్రోద్బలంతో ఈ ఒప్పందాలు, ఒడంబడికలు సాధ్యమైనంత శీఘ్రంగా జరుగును. ఈ ఒడంబడికలు భద్రతామండలికీ, సమితి రాజ్యాలకూ విడివిడిగా గాని, కొన్ని రాజ్యాల కూటమితోగానీ మధ్య జరుగును. ఈ విధంగా ఒడంబడికలు జరిగిన తర్వాత ఆ ఒడం బడికలను ఆ యా దేశాలు వాటి రాజ్యాంగ విధానాన్ని అనుసరించి ధృవ పరుచును.

ఆర్టికల్ 44:

భద్రతామండలి సాయుధబలాలను ప్రయోగించడానికి నిశ్చయించితే అట్టి సాయుధబలాలను సప్లయి చేయవలసిన దేశానికి మండలిలో సభ్యత్వం లేని పక్షంలో ఆ దేశవు సాయుధబలాల ప్రయోగంపై జరిగి, చర్చలో పాల్గొనేందుకు భద్రతామండలి ఆ దేశాన్ని ఆహ్వానింపవచ్చును.

ఆర్టికల్ 45:

క్షణం వ్యవధిలో సమితి సాయుధబలాలను ప్రయోగించేటందుకు వీలుగా, సైనిక చర్యలు జరపడానికి అనుకూలంగా సమితి రాజ్యాలన్నీ వాటి జాతీయ వైమానికదళంలో కొంతభాగాన్ని ఇందునిమిత్తం సంసిద్ధంగా ఉంచాలి. ఆర్టికల్ 43 లో ప్రస్తావింపబడిన ప్రత్యేక ఒడంబడికలు ఏర్పరచే పరిమితులకు కట్టుబడి, వివిధ రాజ్యాలు ఏ యే రకమైన సైన్యాన్ని ఎంతెంత ఏ యే స్థితిలో ఉంచాలో, ఈ సైన్యాలన్నీ కలిసి సమష్టిగా పనిచేయడానికి ఏ పథకాన్ని అనుసరించాలో భద్రతామండలి మిలిటరీ స్టాఫ్ కమిటీ సహాయంతో నిర్ణయాలు చేస్తుంది.

ఆర్టికల్ 46 :

సాయుధబలాల ప్రయోగానికి సంబంధించిన పథకాలను భద్రతా మండలి మిలిటరీ స్టాఫ్ కమిటీ సహాయంతో తయారుచేస్తూ ఉంటుంది.

ఆర్టికల్ 47 :

1. అంతర్జాతీయ శాంతి భద్రతల సంరక్షణకుగాను భద్రతామండలికి కావలసిన సైనిక బలం, సాయుధదళాల సంఖ్య, వీటి వినియోగ విధానం, ఆయుధాలను క్రమబద్ధం చేయడం, సాధ్యమైన నిరాయుధీకరణ—ఇత్యాది విషయాలను గురించి మండలికి సలహాలు ఇచ్చేందుకు, సహాయపడేందుకు మిలిటరీ స్టాఫ్ కమిటీ ఒకటి ఏర్పాటవుతుంది.

2. ఈ మిలిటరీ స్టాఫ్ కమిటీలో అయిదు అగ్రరాజ్యాల సర్వ సేనాపతులుగాని, వారి ప్రతినిధులుగాని సభ్యులుగా ఉంటారు. అయితే, ఈ కమిటీ కార్యక్రమ నిర్వహణకు ఏదైనా ఒక దేశం ఈ కమిటీ వ్యవహారాలలో పాల్గొనడం ఆవశ్యకమని కమిటీ సభ్యులు భావిస్తే ఆ దేశాన్ని ఈ కమిటీ సమావేశాల్లో పాల్గొనేందుకు ఒక ప్రతినిధిని పంపమని కోరవచ్చును.

3. భద్రతామండలి అధీనంగా వున్న సాయుధబలాల ప్రయోగానికి సంబంధించిన వ్యూహాన్ని తయారు చేయడం, ఆ వ్యూహాన్ని అమలు జరపడం మిలిటరీ స్టాఫ్ కమిటీ బాధ్యత. ఈ సాయుధబలాల సేనాపతిత్వాన్ని ఎవరు వహించాలన్న విషయం తరవాత నిర్ణయింపబడుతుంది.

4. భద్రతామండలి అనుమతితో, ప్రాంతీయ సంఘాలతో, సంస్థలతో సంప్రతించిన మీదట మిలిటరీ స్టాఫ్ కమిటీ ప్రాంతీయ ఉపసంఘాలను స్థాపింపవచ్చును.

ఆర్టికల్ 48 :

1. అంతర్జాతీయ శాంతి భద్రతల సంరక్షణకుగాను భద్రతామండలి చేసిన నిర్ణయాలను అమలు జరపడానికి సమితి రాజ్యాలు అన్నీగానీ, కొన్నిగానీ భద్రతామండలి నిర్ణయించిన ప్రకారం చర్యలు తీసుకోవలసి ఉంటుంది.

2. భద్రతామండలి చేసే ఈ నిర్ణయాలను సమితి రాజ్యాలు వాటి కవి, సభ్యత్వం గల ఇతర అంతర్జాతీయ సంస్థల ద్వారా చర్యలను తీసుకొనును.

ఆర్టికల్ 49:

భద్రతామండలి నిర్ణయాలను అనుసరించి తీసుకొనబడు చర్యలలో సమితి రాజ్యాలు పరస్పరం సహకరించుకుంటూ ఉండగలవు.

ఆర్టికల్ 50:

ఒక దేశంపై భద్రతామండలి తీసుకున్న చర్యల ఫలితంగా సమితిలో సభ్యత్వం కలిగివున్నా, లేకపోయినా మరో దేశం విషమ ఆర్థిక సమస్యలను ఎదుర్కోవలసి వస్తే, ఆ సమస్యల పరిష్కారం గురించి అట్టి దేశం భద్రతామండలి సలహాను అర్థింపవచ్చును.

ఆర్టికల్ 51:

సమితి దేశంపై దురాక్రమణ జరిగిన సందర్భంలో ఈ ప్రణాళికలో ఏమి చెప్పబడి నప్పటికీ, అంతర్జాతీయ శాంతి భద్రతల సంరక్షణకై భద్రతా మండలి చర్యలు తీసుకునేలోపున, ఆత్మరక్షణకై అట్టి దేశం వ్యష్టిగాగాని, సమష్టిగాగాని అవసరమైన చర్యలు తీసుకోవడానికి హక్కు కలిగి వుంది. అయితే, సమితి రాజ్యాలు ఈ విధంగా తీసుకున్నట్టి చర్యల వివరాలను వెంటనే భద్రతామండలికి నివేదింపవలసి యుండును. అయితే, ఈ ప్రణాళి కను అనుసరించి, అంతర్జాతీయ శాంతి భద్రతలను కాపాడేందుకు, తిరిగి ఏర్పాటు చేసేందుకు, భద్రతామండలి ఏ సమయంలో నైనా, ఏ క్షణంలో నైనా అవసరమని భావించిన చర్యలను తీసుకొనవచ్చును.

# ఎనిమిదవ ప్రకరణ

## ప్రాంతీయ ఏర్పాట్లు

ఆర్టికల్ 52:

1. ప్రాంతీయావసరాన్ని బట్టి, ప్రాంతీయంగా, అంతర్జాతీయ శాంతి భద్రతల సంరక్షణ నిమిత్తం చర్యలు తీసుకునేందుకు, తత్సంబంధ మైన ఇతర వ్యవహారాలను చూచునేందుకు, అవసరమైన ప్రాంతీయ ఏర్పాట్లు చేసుకునేందుకు సమితి ప్రణాళిక ఏ విధంగానూ అడ్డురాదు.

కాని, అట్టి సంస్థలు, వాటి చర్యలు ప్రణాళిక లక్ష్యాలకూ, సూత్రాలకూ అనుగుణంగా ఉండాలి.

2. అలాంటి ఏర్పాటు చేసుకున్న సమితి రాజ్యాలు తమ మధ్య ఏర్పడిన తగాయిదాలను శాంతియుతంగా పరిష్కరించుకోనేందుకు ముందు ఆ సంస్థల ద్వారానే ప్రయత్నించవలసి ఉంటుంది. అందువల్ల ప్రయోజనం లేనప్పుడే భద్రతామండలికి నివేదించవలసి ఉంటుంది.

3. స్థానిక తగాయిదాలను అట్టి ప్రాంతీయ సంస్థలద్వారాగాని, ఇతర ప్రాంతీయ ఏర్పాట్లద్వారాగాని ఆ యా దేశాలు శాంతియుతంగా పరిష్కరించుకోవడాన్ని భద్రతామండలి దానికదిగా గాని, లేక తగాయిదాకు సంబంధించిన రాజ్యాలు కోరగాగాని ప్రోత్సహింపగలదు.

4. అయితే, ఈ ఆర్టికల్ ప్రణాళికలోని 34, 35 ఆర్టికల్స్ ప్రయోగానికి ఏవిధంగానూ ప్రతిబంధకం కాదు.

ఆర్టికల్ 53:

ఇలాంటి ప్రాంతీయ సంస్థలను, సముచితమైన సందర్భాల్లో భద్రతా మండలి తన నిర్ణయాలను అమలు జరిపించే టందుకు వినియోగించుకో వచ్చును. కాని, భద్రతామండలి అనుమతించనిదే ఈ ప్రాంతీయ సంఘాల అధ్వర్యాన ఎలాంటి చర్యలు జరపడానికీ వీల్లేదు. అయితే, ఈ నిషేధానికి ఒక మినహాయింపు వుంది. ఈ ఆర్టికల్లోనే 2 వ పేరాగ్రాఫులో నిర్వచింపబడిన శత్రురాజ్యాలపైన, 107 ఆర్టికల్‌ను అనుసరించిగాని, లేక ఇట్టి శత్రురాజ్యాల పునరాక్రమణ ప్రతిఘటన విషయమై జరిగిన ప్రాంతీయ ఒడంబడికల ననుసరించిగాని, సమితి ఈ రాజ్యాల ప్రస్తాపనపై చర్యలు తీసుకునేంతకూ అవసరమైన చర్యలను తీసుకోవచ్చును.

2. క్రిందటి ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో ఈ ప్రణాళికపై సంతకం చేసేటటువంటి ఏ దేశంతోనైనా సరే యుద్ధంచేసి యున్నటువంటి దేశం శత్రు దేశంగా నిర్వచింప బడుచున్నది.

ఆర్టికల్ 54:

అంతర్జాతీయ శాంతి భద్రతల సంరక్షణకు ఈ ప్రాంతీయ సంస్థలు తీసుకున్నటువంటి, తీసుకోదలచినటువంటి చర్యలను ఎప్పటికప్పుడు భద్రతా మండలికి తెలియజేస్తూ ఉండాలి.

# తొమ్మిదవ ప్రకరణ

## ఆర్థిక, సాంఘిక వ్యవహారాల్లో అంతర్జాతీయ సహకారం

ఆర్టికల్ 55 :

సమాన హక్కులు, ప్రజల స్వయం నిర్ణయాధికారం సూత్రాలు ఆధారంగా వివిధ దేశాలమధ్య స్నేహ, సామరస్యపూరిత సంబంధాలు ఏర్పడి వర్థిల్లడానికి ప్రజ లందరూ సుఖంగాను, పరిస్థితి స్థిరంగాను ఉండడం అవసరం. అలాంటి వ్యవస్థాస్థాపనకు అనుకూలంగా ఉండే పరిస్థితులను కల్పించడాని కీ ఐక్యరాజ్యసమితి క్రింది చర్యలు తీసుకుంటుంది.

ప్రజల జీవన ప్రమాణాన్ని వృద్ధిచేయడం, అందరికీ పని కల్పించడం, ఆర్థిక, సాంఘికాభ్యుదయాభివృద్ధి సాధనకు అనుకూల పరిస్థితులను కల్పించడం.

అంతర్జాతీయ ఆర్థిక, సామాజిక, ఆరోగ్య, తత్సంబంధ సమస్యల పరిష్కారం; సాంస్కృతిక, విద్యావిషయిక వ్యవహారాల్లో అంతర్జాతీయ సహకారాన్ని పెంపొందించడం.

జాతి, మత, భాషా, లింగ విభేదాలను పాటించకుండా ప్రపంచ ప్రజ లందరికీ ప్రాథమిక స్వాతంత్ర్యాలు, మానవ హక్కులు సమకూరే టట్లు చూచి, వాటిని అందరూ గౌరవించేటట్లు చేయడం.

ఆర్టికల్ 56 :

పైన పేర్కొనబడిన లక్ష్యాల సాధనకు సమితిలో చేరి సభ్యత్వ రాజ్యాలు వ్యష్టిగానూ, సమష్టిగానూ కృషిచేయడానికి సభ్యు లందరూ ఇందు మూలంగా ప్రమాణం చేస్తున్నారు.

ఆర్టికల్ 57 :

1. ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక, విద్యావిషయక, ఆరోగ్యాది విషయాలలో కృషిచేసే నిమిత్తం అంతర్జాతీయ బాధ్యతలు కలిగి, వివిధ ప్రభుత్వాలు ఏర్పాటు చేసుకున్నటువంటి ప్రత్యేక సంస్థలను ప్రణాళికలోని 63 వ ఆర్టికల్‌ను అనుసరించి ఐక్యరాజ్య సమితితో సంబంధం ఏర్పడాలి.

2. వివిధ ప్రభుత్వాల ఒప్పందాలవల్ల ఏర్పడి సమితి సంఘంతో సంబంధాలను పెట్టుకున్న ఈ వివిధ సంస్థలను ఈ ప్రణాళికలో ప్రత్యేక సంస్థలుగా పేర్కొనబడినవి.

ఆర్టికల్ 58:

ఈ ప్రత్యేక సంస్థల విధానాలను, కార్యక్రమాలను సమన్వయం చేయడానికి అవసరమైన సిఫార్సులను సమితి సంఘం చేస్తూ ఉంటుంది

ఆర్టికల్ 59:

ఆర్టికల్ 55 లో పేర్కొనబడిన లక్ష్యాల సాధనకు ఇప్పుడున్న ప్రత్యేక సంస్థలు గాక ఇంకా మరికొన్ని సంస్థలు అవసరమని భావించితే, సమితి స్వయంగానే అట్టి సంస్థల స్థాపనార్థం వివిధ రాజ్యాల మధ్య సంప్రతింపులను ప్రారంభింప వచ్చును.

ఆర్టికల్ 60:

ఈ ప్రకరణంలో సమితి బాధ్యతలుగా పేర్కొనబడిన వాటిని నిర్వర్తించేందుకు కావలసిన అధికారం సర్వసభ్య సంఘానికి ఇవ్వబడింది. సమితి సర్వసభ్య సంఘం అధికారంతో ఈ బాధ్యతలను ఆర్థిక, సాంఘిక సంఘం నిర్వర్తింపవచ్చును. ఈ సంఘానికి ఏయే అధికారాలు ఉండగలవో 10 ప్రకరణములో వివరింపబడినవి.

# పదవ ప్రకరణ

## ఆర్థిక సాంఘిక సంఘం

### నిర్మాణం

ఆర్టికల్ 61:

1. ఆర్థిక సాంఘిక సంఘంలో సమితిలో సభ్యత్వం గల అష్టాదశ దేశాలకు సభ్యత్వం ఉంటుంది. ఈ దేశాలను సమితి సర్వసభ్య సంఘం ఆర్థిక సాంఘిక సభ్యులుగా ఎన్నుకుంటుంది.

2. మూడవ పేరాలో వివరింపబడిన నిబంధనలకు లోబడి ప్రతి సంవత్సరం ఆరుగురు సభ్యులు ఎన్నుకోబడతారు. ఈ విధంగా ఎన్ని

కైన వారు మూడు సంవత్సరాలపాటు ఈ ఆర్థిక సాంఘిక సభ్యులుగా ఉంటారు. సభ్యత్వం తీరిపోయిన దేశం తిరిగి ఎన్నిక కావడానికి ఏలాంటి నిషేధమూ లేదు.

3. ప్రథమతః ఆర్థిక సాంఘిక సభ్యులుగా 18 దేశాలు ఎన్నిక అవుతవి. ఈ 18 మంది సభ్యులలో ఆరుగురి సభ్యత్వం మొదటి సంవత్సరం పూర్తి కాగానే ఆఖరవుతుంది. మరో ఆరు దేశాల సభ్యత్వం రెండేళ్ళు పూర్తికాగానే ఆఖరవుతుంది. సభ్యత్వ కాల పరిమితికి సంబంధించిన ఈ ఏర్పాట్లను సమితి సర్వసభ్య సంఘం చేస్తుంది.

4. ఆర్థిక సాంఘిక సంఘంలో సభ్యత్వం గల ప్రతిదేశం తరఫున ఒక్కొక్క ప్రతినిధి సంఘంలో పాల్గొంటూ వుంటాడు.

## విధులు, అధికారాలు

**ఆర్టికల్ 62:**

1. అంతర్జాతీయ ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక, విద్య ఆరోగ్య విషయక సమస్యలపై పరిశోధనలను, విచారణలను స్వయంగా జరుపవచ్చును. ఇతర సంస్థలచేత పరిశోధనలు జరిపింపవచ్చును. ఆ తరువాత ఆ పరిశోధనలు, విచారణలను అనుసరించి సమితి దేశాలుగానీ, ఇతర ప్రత్యేక సంస్థలుగాని ఏ యే చర్యలు తీసుకోవాలో ఈ సంస్థలకు, దేశాలకు సమితి సర్వ సభ్య సంఘానికి ప్రతిపాదనలు చేయవచ్చును.

2. ప్రాథమిక స్వాతంత్ర్యాలను, మానవ హక్కులను అందరూ గౌరవించేటట్లు, పాలించేటట్లు చేయడానికి ఏ యే చర్యలు తీసుకోవాలో సూచిస్తూ ఉండగలదు.

3. తన విచారణాధికారానికి లోబడివున్న వివిధ అంశములపై ప్రణాళికలను తయారుచేసి సమితి సర్వసభ్య సంఘానికి నివేదింప వచ్చును.

4. సమితి ఏర్పరచిన నిబంధనలను అనుసరించి ఈ సంఘం తనకు విచారణాధికారం కలిగి వున్నట్టి వివిధ విషయాల విచారణకు అంతర్జాతీయ సమావేశాలను ఏర్పాటు చేయవచ్చును.

ఆర్టికల్ 63:

1. ఆర్టికల్ 57 లో ప్రస్తావించిన ప్రత్యేక సంస్థలకు సమితితో సంబంధం ఏర్పాటుచేసే నిమిత్తం ఈ రెండు సంఘాలకూ వలసిజరగవ

ఒడంబడికలను సమితి ఆర్థిక సాంఘిక సంఘం తయారుచేయవచ్చును. ఐతే, అట్టి ఒడంబడికలను సమితి సర్వసభ్యసంఘం ఆమోదింపవలసి వుండును.

2. వివిధ ప్రత్యేక సంస్థల కార్యక్రమాలను, విధానాలను సమన్వయ పరచడానికి అట్టి ప్రత్యేక సంస్థలకు, సమితి రాజ్యాలకూ, సర్వసభ్య సంఘానికి ప్రతిపాదనలు చేస్తూ ఉండవచ్చును.

ఆర్టికల్ 64:

1. ఈ ప్రత్యేక సంస్థలు నిర్వహిస్తున్న కార్యక్రమాలను సంబంధించి నివేదికలను తెప్పించుకొనడానికి ఆర్థికసాంఘికసంఘం అవసరమైన చర్యలు తీసుకోవచ్చును. తాను స్వయంగా చేసినట్టి, తన విచారణాధికారానికి లోబడివున్న విషయాలనుగురించి సమితి సర్వసభ్య సంఘం చేసిన ప్రతిపాదనలనుగురించి సమితి రాజ్యాలు, సమితి అధీన ప్రత్యేక సంస్థలు ఏ యే చర్యలు తీసుకున్నవీ తెలియజేసే నివేదికలను పొందడానికి అవసరమైన చర్యలు తీసుకొనవచ్చును.

2. ఈ వివిధ నివేదికలపై తన అభిప్రాయాలను ఆర్థిక సాంఘిక సంఘం సమితి సర్వసభ్య సంఘానికి తెలియజేయవచ్చును.

ఆర్టికల్ 65:

ఆర్థిక సాంఘిక సంఘం భద్రతామండలికి సమాచారాన్ని తెలియజేస్తూ, మండలి కోరే పక్షంలో ఒక కార్యక్రమ నిర్వహణకు భద్రతా మండలికి సహాయపడుతూ ఉండవచ్చును.

ఆర్టికల్ 66:

1. సమితి సర్వసభ్య సమావేశం చేసేటటువంటి ప్రతిపాదనలను, తనకు సంబంధించి నంతవరకు అమలు పరచడానికి అవసరమైన చర్యలు తీసుకొనవచ్చును.

2. సమితి సర్వసభ్య సంఘం ఆమోదంతో సమితి దేశాలు, సమితి అధీన ప్రత్యేక సంస్థలు చేయు విజ్ఞాపనలను అనుసరించి అవసరమైన చర్యలు తీసుకొనవచ్చును.

3. ఈ ప్రణాళికలో ఇతరత్రా ప్రస్తావింపబడిన బాధ్యతలను, సమితి సర్వసభ్య సంఘం విధించే ఇతర బాధ్యతలను ఆర్థిక సాంఘిక సంఘం నిర్వర్తించుచుండును.

## వోటింగు

ఆర్టికల్ 67 :

1. ఆర్థిక సాంఘిక సంఘంలో సభ్యత్వం గల ప్రతి ఒక్క దేశానికి ఒక వోటు ఉంటుంది.

2. సమావేశాలకు హాజరై వోటు చేసే వారిలో మెజారిటీ సభ్యుల సమ్మతిపై ఆర్థిక సాంఘిక సంఘ నిర్ణయాలు జరుగుతూ ఉండును.

## కార్యక్రమ విధానం

ఆర్టికల్ 68 :

ఆర్థిక, సామాజిక విషయాలను సంబంధించి, ఆర్థిక సాంఘిక సంఘం ప్రత్యేక కమిషన్లను నెలకొల్పవచ్చును. మానవ హక్కులను సుస్థిరంచేసి, అన్ని రాజ్యాలు మానవుల హక్కులను పాలించేటట్లు చేసే టందుకు ప్రత్యేక కమిషన్‌ను స్థాపింపవచ్చును. ఆర్థిక సాంఘిక సంఘం నిర్వర్తించవలసిన ఇతర విధుల నిర్వర్తించేందుకు అవసరమైన ఇతర కమిషన్లను ఏర్పాటు చేయువచ్చును.

ఆర్టికల్ 69 :

ఒక దేశానికి సంబంధించిన విషయం ఆర్థిక సాంఘిక సంఘ విచారణకు వచ్చినప్పుడు ఆ దేశానికి ఈ సంఘంలో సభ్యత్వం లేని సందర్భాల్లో ఈ చర్యలో పాల్గొనేందుకు మాత్రం అట్టి దేశాన్ని ఆహ్వానింపవచ్చును. అయితే, ఆ దేశానికి వోటు హక్కు మాత్రం ఉండదు.

ఆర్టికల్ 70 :

సమితి అధీన ప్రత్యేక సంస్థలలో, కమీషన్లలో ఆర్థిక సాంఘిక సంఘం ప్రతినిధి పాల్గొనడానికి, ఆర్థిక సాంఘిక సంఘ సమావేశాల్లో ఈ ప్రత్యేక సంస్థల కమిషన్ల ప్రతినిధులు పాల్గొనడానికి ఈ సంఘం తగిన ఏర్పాట్లు చేయగలదు.

ఆర్టికల్ 71 :

తన విచారణాధికారానికి చెందిన వివిధ విషయాలపై అనధికార సంస్థలతో సంప్రతింపులు, సమాలోచనలు జరపేందుకు ఆర్థిక సాంఘిక సంఘం సముచిత ఏర్పాట్లు చేయవచ్చును. అట్టి ఏర్పాట్లను అంతర్జాతీయ సంస్థలతో గాని, అవసరమైన సందర్భాలలో జాతీయసంస్థలతో, అందుకు సంబంధించిన సమితి దేశంతో సంప్రతించిగాని సమితి ఆర్థిక సాంఘిక సంఘం చేసుకొనవచ్చును.

ఆర్టికల్ 72 :

1. ఆర్థిక సాంఘిక సంఘం దాని కార్యక్రమానికీ, సమావేశాలకూ సంబంధించిన నిబంధనలను, నియమాలను అధ్యక్షుని ఎన్నికతో సహా, స్వయంగా చేసుకొనగలదు.

2. ఈ సంఘ సమావేశాలు ఎప్పుడెప్పుడు జరగాలో కూడా సంఘ సర్వసభ్య సమావేశం నిర్ణయించవలసింటుంది. సంఘ సభ్యులలో మెజారిటీ సభ్యులు కోరే పక్షంలో ఆర్థిక సాంఘిక సంఘం సమావేశం అవుతూ ఉండాలి.

# పదనొకండవ ప్రకరణ

## పారతంత్ర్య దేశాలకు సంబంధించిన ప్రకటన

ఆర్టికల్ 73 :

కొన్ని దేశాలు ఇప్పటికే సమితి రాజ్యాల పరంగా ఉంటున్నవి. అట్టి పరాధీన దేశాల ప్రజల సంపూర్ణ స్వపరిపాలనాధికారాన్ని పొంది వుండలేదు. అలాగే ఇప్పుడు కొత్తగా కొన్ని దేశాల బాధ్యతలను సమితి రాజ్యాలు వ్యష్టిగాను, సమష్టిగాను స్వీకరింపగలవు. ఈ విధంగా ఇతర దేశాలపై యాజమాన్యం వహించే సమితి దేశాలు ఈ పారతంత్ర్య దేశాల ప్రజల ఆపేక్షలు అత్యంత ప్రధానములనే సూత్రాన్ని అంగీకరిస్తున్నవి. ఈ ప్రణాళిక ఏర్పాటుచేసిన అంతర్జాతీయ శాంతి భద్రతల వ్యవస్థకు లోబడి ఈ పరాధీన దేశ ప్రజల క్షేమాభివృద్ధిని సాధించడానికి కృషిచేయడం తమ పవిత్రధర్మంగా ఈ సమితి దేశాలు అంగీకరిస్తున్నవి.

ఈ విధి, ధర్మ నిర్వహణకుగాను ఆ యా సమితి దేశాలు ఈ క్రింది చర్యలను తీసుకొనగలవు.

(ఎ) పరాధీన దేశీయుల సంస్కృతిని గౌరవిస్తూ, ఆ ప్రజల ఆర్థిక, రాజకీయ, సామాజిక, విద్యాభివృద్ధిని సాధిస్తూ, ప్రజలకు రక్షణలను ఏర్పాటు చేస్తూ వారి కెట్టి అపచారాలూ జరుగకుండా చూడగలవు.

(బి) స్వపరిపాలనను ప్రోత్సహిస్తూ, ప్రజల రాజకీయాశయాలను గమనిస్తూ, ప్రజలు స్వతంత్ర రాజకీయ సంస్థల అభివృద్ధిని సాధించడానికి చేసే ప్రయత్నాల సాఫల్యానికి సహాయపడుతూ, వీటిన్నింటినీ సాధించే నిమిత్తం ఆ యా ప్రాంతాల ప్రత్యేక పరిస్థితులను, ప్రజల స్థాయి, స్థితిని గమనించి, ఈ ప్రాంతాల బాధ్యతను స్వీకరించిన సమితి దేశాలు తమ పవిత్రధర్మాలను పాలిస్తూ, గురుతర బాధ్యతలను నిర్వర్తిస్తూ ఉండగలవు.

(సి) అంతర్జాతీయ శాంతి భద్రతల సాధనలకు కృషి చేస్తూ ఉండగలవు.

(డి) దేశాభివృద్ధికి నిర్మాణాత్మక చర్యలను ప్రోత్సహించుతూ వుండగలవు. పరిశోధనలు సాగించడానికి సంపూర్ణావకాశాలు కల్గించుచుండగలవు. ఈ దేశాలు పరస్పరం సహకరించుకుంటూ, ఉచితమైనప్పుడు ప్రత్యేక అంతర్జాతీయ సంస్థలతో సహకరిస్తూ ఈ ఆర్టికల్‌లో వివరించబడిన సామాజిక, ఆర్థిక, శాస్త్రీయ లక్ష్యాల సాధనకు ఇతోధికంగా కృషి చేస్తూ, ఉండగలవు.

(ఇ) భద్రతామండలి ఏర్పాటుచేసిన మినహాయింపులకు, నిబంధనావళిలోని అంశములకు లోబడి ఈ రాజ్యాలు తమ అధ్వర్యం క్రిందనున్న దేశాల ఆర్థిక, సాంఘిక, విద్యా విషయిక పరిస్థితులకు సంబంధించిన సాంకేతిక వివరాలను సమితి సెక్రెటరీ జనరల్‌కు పంపుతూ ఉండగలవు.

ఆర్టికల్ 74 :

ఈ ప్రకరణ వర్తించే దేశాల విషయంలోనేగాక, ఇతర ప్రధాన ప్రాంతాల విషయంలోనూ తమ విధానాలకు ఇరుగు పొరుగుల సద్భావం, ఇతర ప్రపంచ సాంఘిక, ఆర్థిక, వాణిజ్య శ్రేయస్సు ప్రాతిపదికగా వుండాలనికూడా సమితి రాజ్యాలు అంగీకరిస్తున్నవి.

# పండ్రెండవ ప్రకరణ

## అంతర్జాతీయ ధర్మ కర్తృత్వ పద్ధతి

ఆర్టికల్ 75 :

తన పరంగా ఉంచబడినటువంటి దేశాల పరిపాలనకు, అట్టి దేశాల అజ్మాయిషీకిగాను ఐక్యరాజ్యసమితి తన అధికారం క్రింద అంతర్జాతీయ ధర్మ కర్తృత్వ పద్ధతిని ఏర్పాటు చేస్తున్నది. ఇట్టి దేశాలను ఇకమీదట రక్షిత రాజ్యాలని వ్యవహరించడమౌతుంది.

ఆర్టికల్ 76 :

మొట్టమొదటి ఆర్టికల్‌లో వివరింపబడిన సమితి లక్ష్యాల ననుసరించి ఈ ధర్మ కర్తృత్వ పద్ధతి ఆశయాలు దిగువ పేర్కొనబడుచున్నవి.

(ఎ) అంతర్జాతీయ శాంతి భద్రతల సాధనకు దోహదం చేయడం.

(బి) రక్షిత రాజ్యాల ప్రజల రాజకీయ, ఆర్థిక, సాంఘిక, విద్యాభివృద్ధికి దోహదం చేస్తూ ఆ దేశాల ప్రజలు క్రమానుగతంగా స్వపరిపాలన బాధ్యతను స్వీకరించడానికి తయారయ్యేటట్లు చేస్తూ, ఆ యా దేశాల ప్రత్యేక పరిస్థితుల ననుసరించి, స్థానిక ప్రజల అభిమతాలను గమనించి ధర్మ కర్తృత్వ ఒడంబడిక నిబంధనలను అనుసరించి రక్షక రాజ్యాలు అవసరమైన చర్యలు తీసుకుంటూ ఉండగలవు.

(సి) మానవ హక్కులను, ప్రాతిపదిక స్వాతంత్ర్యాలను గౌరవిస్తూ, ఇతరులు గౌరవించేటట్లు చూస్తూ ప్రపంచ ప్రజలు పరస్పరం ఆధారపడి ఉన్నారనే భావం కలిగేటట్లు చేయడానికి ప్రయత్నిస్తుంది.

(డి) సమితి దేశాలన్నింటికి, ఆ దేశీయులందరికీ సాంఘిక, ఆర్థిక వాణిజ్య వ్యవహారాలలో సమానావకాశాలు లభించేటట్లు చూస్తూ 80 వ ఆర్టికల్‌కు లోబడి పైన పేర్కొన్న లక్ష్యాలకు భంగం కలగని విధంగా సమితి దేశాల పౌరులందరికీ న్యాయపాలనలో అన్యాయం జరగకుండా చూడగలదు.

ఆర్టికల్ 77:

1. దిగువ పేర్కొనబడిన మూడు తరగతులకు చెందిన దేశాలలో ధర్మ కర్తృత్వ ఒడంబడికలద్వారా రక్షక ఏర్పాటులో చేర్చబడిన దేశాలకు ఈ ధర్మ కర్తృత్వ పద్ధతి వర్తిస్తుంది.

(ఎ) ప్రస్తుతం మాండేట్ పద్ధతి క్రిందవున్న దేశాలు.

(బి) ద్వితీయ ప్రపంచ సంగ్రామ ఫలితంగా శత్రురాజ్యాలనుండి విడదీయబడిన దేశాలు.

(సి) కొన్ని దేశాల పరిపాలనా బాధ్యతను వహించిన రాజ్యాలు అట్టి దేశాలను ఐచ్ఛికంగా వాటి కవి ధర్మ కర్తృత్వ పద్ధతి క్రింద వుంచిన దేశాలు.

2. పైన పేర్కొనబడిన మూడు తరగతులకు చెందిన దేశాల్లో ఏ యే దేశాలను ఈ ధర్మకర్తృత్వ ఒడంబడిక క్రిందకు తీసుకురావడం అనే విషయం ఇకమీదట జరిగే ఒడంబడికలపై ఆధారపడి ఉంటుంది.

ఆర్టికల్ 78:

సమితి సభ్యత్వం గల రాజ్యాలకు ఈ ధర్మకర్తృత్వ పద్ధతి వర్తింపదు. సమితి రాజ్యాల సంబంధాలు అన్నిదేశాలూ సమానమే అన్న ప్రధాన సూత్రంపై ఆధారంగా నిర్ణయింపబడుతవి.

ఆర్టికల్ 79:

రక్షిత దేశాలకు సంబంధించినటువంటి ప్రతి ఒక్క ఒడంబడికకూ, అట్టి ఒడంబడిక సవరణకూ, అందుకు సంబంధించిన అన్ని రాజ్యాలకూ లోగడ అట్టి దేశం మరో రాజ్యపరంగా వుండివుంటే అట్టి రాజ్యంతో సహా అంగీకారం కుదరాలి. అట్టి ఒడంబడికలు 83, 85 ఆర్టికల్స్‌లోని నిబంధనల ననుసరించి ఆమోదింపబడాలి.

ఆర్టికల్ 80:

1. ఆర్టికల్స్ 77, 79, 81 ని అనుసరించి జరిగే వ్యష్టి ఒడంబడికలు మినహాగా, అట్టి ఒడంబడికలు జరిగే వరకూ కూడా ప్రస్తుతం అమలులో వున్నటువంటి అంతర్జాతీయ ఒప్పందాలన్నీ అలాగే అమలులో వుంటవి.

2. అయితే, ఈ పై మినహాయింపు ఆధారంగా వెనుకటి మాండేట్ దేశాలను ధర్మకర్తృత్వ పద్ధతి క్రింద వుంచే నిమిత్తం తాజా ఒడంబడికలు జరుపుకొనడానికి ఏ మాత్రం కాలహరణమూ ఉండరాదు.

ఆర్టికల్ 81:

రక్షిత రాజ్యాల పరిపాలన ఏ విధంగా జరగాలి, ఈ దేశాలపై ఏ రాజ్యాలు ధర్మకర్తృత్వం వహించాలి మొదలైన అన్ని విషయాలు ఈ ఒడంబడికలలో సవివరంగా విశదీకరింప బడుతవి. ఈ విధంగా ధర్మకర్తృత్వం వహించే దేశాన్నిగాని, దేశాలనుగాని, లేక ఈ సంస్థనేగాని 'పాలనాధికారి' అని వ్యవహరించడ మౌతుంది.

ఆర్టికల్ 82:

ఒక ధర్మకర్తృత్వం క్రింద వున్న దేశంగాని, దేశాలుగాని, లేక దేశంలో ఒక భాగంగాని సైనిక దృష్ట్యా ప్రధానమైన ప్రాంతంగా నిర్వచింపబడవచ్చును. అయితే, 43 ఆర్టికల్‌ను అనుసరించి చేసుకోబడే ప్రత్యేక ఒడంబడికలకు ఇందువల్ల భంగం కలగదు.

ఆర్టికల్ 83:

1. సైనిక దృష్ట్యా ప్రధానమైన దేశాలు అని పేర్కొనబడినటువంటి ప్రాంతాలకు సంబంధించిన ధర్మకర్తృత్వ ఒడంబడికలను ఆమోదించడం, సవరించడం మొదలైన అన్ని విషయాలకు సంబంధించిన అధికారాలను భద్రతామండలే చలాయిస్తుంది.

2. ఆర్టికల్ 76 లో పేర్కొనబడిన ప్రధాన లక్ష్యాలు, సూత్రాలు అన్ని రక్షిత దేశాలకూ-సైనిక ప్రాధాన్యంగల ప్రాంతాలతో సహా-వర్తిస్తవి.

3. సైనిక ప్రాధాన్యం గల ప్రాంతాలకు సంబంధించిన రాజకీయ, ఆర్థిక, సాంఘిక, విద్యావిషయక వ్యవహారాలను నిర్వహించడంలో సమితికి గల యావత్తు బాధ్యతలను, అధికారాలను ధర్మకర్తృత్వ సంఘ సహాయంతో భద్రతామండలే నిర్వహిస్తుంది.

ఆర్టికల్ 84:

రక్షిత దేశాలు కూడా అంతర్జాతీయ శాంతి భద్రతల పరిరక్షణలో సముచిత పాత్రను నిర్వహించేటట్లు చూడవలసిన బాధ్యత పాలనాధికారం గల రాజ్యంపై వుంది. రక్షిత రాజ్యంలో శాంతిని కాపాడడానికీ, ప్రపంచ శాంతి భద్రతల సంరక్షణలో పాలక దేశం భద్రతామండలి ఆ దేశాలను పాలించడానికి రక్షిత దేశాల్లో స్వచ్ఛంద సైనికులను సమీకరిస్తూ అవసరమైన సౌకర్యాలను పొందుతూ వుండగలదు.

ఆర్టికల్ 85:

1. సైనిక వ్యూహందృష్ట్యా ప్రధానంగా నిర్వచింపబడి యుండునటువంటి రక్షిత ప్రాంతాలకు సంబంధించిన ధర్మకర్తృత్వ ఒడంబడికలను ఆమోదించడం, అవసరమైనప్పుడు వాటిని సవరించడం అన్న పనులను సమితి సర్వసభ్య సంఘం నిర్వర్తించుతూ వుంటుంది.

2 సమితి సర్వసభ్య సంఘం ఈ పనులను నిర్వర్తించడంలో ధర్మకర్తృత్వ సంఘం సమితి సర్వసభ్య సంఘానికి తోడ్పడుతూ వుంటుంది.

# పదమూడవ ప్రకరణ

## ధర్మకర్తృత్వ సంఘం

## నిర్మాణం

ఆర్టికల్ 86:

ధర్మకర్తృత్వ సంఘంలో ఈ దిగువ పేర్కొనబడిన తరగతులకు చెందిన దేశాలకు సభ్యత్వం ఉంటుంది.

(ఎ) రక్షిత దేశాలపై ధర్మకర్తృత్వం వహిస్తున్న రాజ్యాలు;

(బి) రక్షిత ప్రాంతాలపై ధర్మకర్తృత్వం వహించకవున్న 23 వ ఆర్టికల్‌లో పేరు పేరునా పేర్కొనబడిన రాజ్యాలు.

(సి) ధర్మకర్తృత్వం వహిస్తున్న దేశాలు ఎన్నో, ధర్మకర్తృత్వం వహించని దేశాలు అన్నీ, మూడేళ్లకు ఒకసారి సమితి సర్వసభ్య సంఘంచేత ఎన్నుకోబడుతూ ఉంటవి.

2. ధర్మ కర్తృత్వ సంఘ సమావేశాల్లో పాల్గొనే నిమిత్తం సభ్యత్వం గల దేశాలు అనుభవమూ, అర్హతాగల ఒక్కొక్క ప్రతినిధిని నియమిస్తవి.

## విధులు, అధికారాలు

ఆర్టికల్ 87:

సమితి సర్వసభ్య సంఘం, దాని అధికారాన్ని అనుసరించి ధర్మ కర్తృత్వ సంఘం తన బాధ్యతలను నిర్వర్తించడం నిమిత్తం ఈ దిగువ చర్యలు తీసుకొనవచ్చును.

(ఎ) రక్షక రాజ్యాలు సమర్పించే నివేదికలను విచారించు చుండవచ్చును.

(బి) రక్షిత ప్రజల విజ్ఞాపనల స్వీకరించి ధర్మ కర్తృత్వం వహించిన దేశాలతో కలిసి వాటిని విచారింపవచ్చును.

(సి) ధర్మ కర్తృత్వం వహిస్తున్న దేశాల సమ్మతి అవసరమైన సందర్భాల్లో అట్టి సమ్మతిని పొంది, అట్టి అవసరం లేనప్పుడు తనకై తానే ధర్మ కర్తృత్వం క్రిందవున్న ప్రాంతాల్లో పరిస్థితులను పరిశీలించి రావడానికి కమిషన్లను ధర్మ కర్తృత్వ సంఘం పంపుతూ వుండగలదు.

(డి) ధర్మ కర్తృత్వ ఒడంబడికకు అనుగుణంగా ఈ సంఘం తదితర చర్యలను కూడా తీసుకోగలదు.

ఆర్టికల్ 88:

ధర్మ కర్తృత్వం క్రిందవున్న ప్రాంతాల ప్రజల రాజకీయ, ఆర్థిక, సాంఘిక, విద్యా రంగాలలో పొందిన అభివృద్ధిని తెలుసుకునే నిమిత్తం ధర్మ కర్తృత్వ సంఘం ఒక ప్రశ్నావళిని తయారు చేస్తుంది. ధర్మ కర్తృత్వం వహించిన రాజ్యాలు ఈ ప్రశ్నావళి ఆధారంగా వార్షిక నివేదికలను తయారుచేసి సమర్పిస్తూ ఉండగలవు.

## వోటింగు

ఆర్టికల్ 89:

1. ధర్మ కర్తృత్వ సంఘంలో సభ్యత్వం గల ప్రతి దేశానికి ఒక వోటు ఉంటుంది.

2. సమావేశాలకు హాజరై వోటింగులో పాల్గొన్న సభ్యుల మెజారిటీ సమ్మతిపై ఈ సంఘం నిర్ణయాలు జరుగుతూ ఉంటవి.

### కార్యక్రమ విధానం

ఆర్టికల్ 90:

1. తన కార్యక్రమాన్ని ఏ విధంగా నిర్వహించాలో, సంఘ అధ్యక్షుని ఎలా ఎన్నుకోవాలో ధర్మ కర్తృత్వ సంఘమే నిర్ణయించుకుంటుంది.

2. సభ్యులలో మెజారిటీ సభ్యులు కోరినప్పుడల్లానూ, సంఘ నిబంధనల ననుసరించి ధర్మ కర్తృత్వ సంఘం సమావేశమాతూ ఉంటుంది.

ఆర్టికల్ 91:

ధర్మ కర్తృత్వ సంఘం అవసరమైనప్పుడు, ఉచితమని భావించినప్పుడు ఆర్థిక సాంఘిక సంఘ సహాయాన్ని, సమితి అధీన తదితర ప్రత్యేక సంస్థల సహాయాన్ని పొందుతూ ఉండవచ్చును.

# పదునాల్గవ ప్రకరణ

## అంతర్జాతీయ న్యాయస్థానం

ఆర్టికల్ 92:

అంతర్జాతీయ న్యాయస్థానం సమితి న్యాయపాలనా సంస్థలలో ముఖ్యమైనది. ఈ ప్రణాళికకు అనుబంధంగా చేర్చబడిన శాసనాన్ని అనుసరించి ఈ న్యాయస్థానం వ్యవహరిస్తుంది. శాశ్వత అంతర్జాతీయ న్యాయస్థానం చట్టం ఆధారంగా ఈ శాసనం తయారు చేయబడింది. ఈ శాసనం ప్రస్తుత సమితి ప్రణాళిక అంతర్భాగంగా ఉంటుంది.

ఆర్టికల్ 93:

1. ఐక్యరాజ్య సమితి సభ్యు లందరూ ఈ అంతర్జాతీయ న్యాయస్థాన చట్టానికి బద్ధులై ఉండగలరు.

2. సమితిలో సభ్యత్వం లేని రాజ్యం కూడా భద్రతామండలి సిఫారసు ననుసరించి సర్వసభ్య సంఘం నిర్ణయించే షరతులపై ఈ అంతర్జాతీయ న్యాయస్థాన చట్టానికి పార్టీ కావచ్చును.

ఆర్టికల్ 94:

1. సమితి రాజ్యాలు అన్నీ అవి కక్షిదారులుగా ఉన్నటువంటి తగాయిదాలలో అంతర్జాతీయ న్యాయస్థాన తీర్పులను పాలించగలమని సమితి దేశం ప్రతి ఒక్కటీ ఇందుమూలంగా హామీ ఇస్తున్నది.

2. కక్షిదారులలో ఒకరు అంతర్జాతీయ న్యాయస్థాన తీర్పును పాలింప నిరాకరించిన పక్షంలో రెండవ కక్షిదారు ఆ విషయాన్ని భద్రతా మండలికి ఫిర్యాదు చేయవచ్చును. ఈ తీర్పును అమలు పరచడానికి ఏయే చర్యలు తీసుకోవాలో భద్రతామండలి నిర్ణయించి ఆ ప్రకారంగా చర్యలు తీసుకోవచ్చును.

ఆర్టికల్ 95:

ఇప్పటికి అమలులో నున్న ఒడంబడికలను అనుసరించిగాని, ఇక ముందు చేసుకోగల ఒడంబడికల ననుసరించిగాని సమితి రాజ్యాలు తమ తగాయిదాలను అంతర్జాతీయ న్యాయస్థాన పరిష్కారానికి నివేదించడానికి ఈ ప్రణాళిక నిబంధనలు ఏవీ ప్రతిబంధకములు కావు.

ఆర్టికల్ 96:

న్యాయశాస్త్రానికి సంబంధించిన ఏ విషయం మీదనైనా సర్వసభ్య సంఘంగాని, భద్రతా మండలిగాని అంతర్జాతీయన్యాయస్థాన అభిప్రాయాన్ని, సలహాను కోరవచ్చును.

2. సమితి అధీన సంఘాలు ఏవైనా, ప్రత్యేక సంస్థలు ఏవి గాని సమితి సర్వసభ్య సంఘం ఆదేశించినప్పుడు న్యాయశాస్త్ర సమస్యలపై అంతర్జాతీయ న్యాయస్థాన సలహాను అడగవచ్చును.

# పదునైదవ ప్రకరణ

## సమితి కార్యాలయం

ఆర్టికల్ 97:

సమితి కార్యాలయం (సెక్రటేరియట్) ఒక సెక్రటరీ జనరల్‌తోనూ, సంస్థ నిర్వహణకు అవసరమైన ఇతర సిబ్బందితోనూ ఏర్పడుతుంది. భద్రతా మండలి ప్రతిపాదనపై సమితి సెక్రటరీ జనరల్‌ను సర్వసభ్య సంఘం నియ

మిస్తుంది. ఈయనే సమితి ప్రధాన పరిపాలనాధికారి (అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసరు)

ఆర్టికల్ 98:

సమితి సర్వసభ్య సంఘం, భద్రతామండలి, ఆర్థిక సాంఘిక సంఘం, ధర్మకర్తృత్వ సంఘాల సమావేశాలలో యీయన ఆ హోదాలోనే పాల్గొంటూ, ఆ యా సంఘాలు ఆయనకు అప్పగింతపెట్టిన పనులను నిర్వహిస్తూ ఉంటారు. సమితి వ్యవహారాలను నిర్వహించిన పనులను గురించి సమితి సర్వసభ్య సంఘానికి వార్షిక నివేదికలను సమర్పిస్తూ ఉండగలరు.

ఆర్టికల్ 99:

అంతర్జాతీయ శాంతి భద్రతలకు విపత్తు తెచ్చిపెట్టగలదని ఏ సమస్యను గురించిగాని, ఒక పరిస్థితిని గురించిగాని ఈయన అభిప్రాయపడితే, ఆ విషయాన్ని ఆయన భద్రతామండలికి నివేదింపవచ్చును.

ఆర్టికల్ 100:

1. సెక్రెటరీ జనరల్‌గాని, సమితి సిబ్బందికి చెందిన మరెవ్వరుగాని తమ విధులను నిర్వర్తించడంలో ఇతర ప్రభుత్వ ఆదేశములనుగాని, సమితికి చెందనటువంటి ఇతర సంఘాల, సంస్థలనుండిగాని, ఎట్టి వుత్తరువులనుగాని పొందకూడదు. సమితికి బాధ్యులైనట్టి అంతర్జాతీయ అధికారులైన వీరు తమ స్థాయికి ఉచితంగా ఉండనటువంటి ఏ పనిని వీరు చేయకూడదు.

2. సమితి సెక్రెటరీ జనరల్, సమితి సిబ్బంది నిర్వహింపవలసినట్టి బాధ్యతలు అంతర్జాతీయ స్వభావము కలిగియున్నట్టివి అని సమితి రాజ్యాలన్నీ గుర్తించి తదనుగుణంగా వ్యవహరింపగలవు. వారిపై ఎట్టి వొత్తిడినిగాని తీసుకురాకుండుటకు సమితిరాజ్యాలు ప్రతి ఒక్కటి ఇందుమూలంగా అంగీకరిస్తున్నవి.

ఆర్టికల్ 101:

1. సర్వసభ్య సంఘం తయారుచేసిన నిబంధనలను అనుసరించి సెక్రెటరీ జనరల్ సమితి ఉద్యోగులను నియమించును.

2. ఆర్థిక సాంఘిక సంఘానికీ, ధర్మ కర్తృత్వ సంఘానికీ, తదితర సమితి అధీన సంస్థలకూ తగిన వుద్యోగులను శాశ్వతంగా, స్థిరంగా నియమింప బడుదురు. ఈ వుద్యోగులందరు సమితి సెక్రెటేరియట్ లో చేరి వుందురు.

3. అత్యంతసమర్థతతోనూ, నిజాయితీగానూ, శక్తివంతంగా నూ పని చేయగలగడానికి వీలైన విధంగా ఈ వుద్యోగుల నియామకం జరుగుతుంది. ఆ వుద్యోగ విధులను ఆ విధంగా నిర్వహించడానికి అనుకూలమైన పరిస్థితులు కల్పించబడును. ఈ విధంగా వుద్యోగులను నియమించే సందర్భంలో సాధ్యమైనంతవరకు ప్రపంచ రాజ్యాలన్నిటికీ ప్రాతినిధ్యం వుండేటట్లు చూడడం మంచిది; అవసరం.

# పదునారవ ప్రకరణ

## తదితర నిబంధనలు

ఆర్టికల్ 102:

1. ఈ ప్రణాళిక అమలుకు వచ్చిన తరువాత సమితి రాజ్యాలు కుదుర్చుకునే ప్రతి ఒడంబడిక, ప్రతి అంతర్జాతీయ ఏర్పాటు సాధ్యమైనంత శీఘ్రంగా సమితి కార్యాలయంలో దఖలు పరచబడి, ఆ కార్యాలయంచేత ప్రకటించబడాలి.

2. ఆ విధంగా దఖలు చేయబడినటువంటి ఒడంబడికల షరతులను ఆధారంగా తీసుకొని సమితి సంఘాల విచారణకు అట్టి ఒడంబడిక వుల్లంఘన లను ఫిర్యాదు చేయడానికి వీలు లేదు.

ఆర్టికల్ 103:

సమితి రాజ్యాలు అవి విడిగా చేసుకున్న ఒడంబడిక షరతులను అనుసరించి ప్రవర్తించాలా, లేక సమితి ప్రణాళికాంశాల ననుసరించి ప్రవర్తించాలా అనే సమస్య ఒక సందర్భంలో ఏర్పడితే అప్పుడు సమితి రాజ్యాలు సమితి ప్రణాళిక విధించిన బాధ్యతలనే నిర్వర్తింపవలసి ఉంటుంది.

ఆర్టికల్ 104:

సమితి రాజ్యాలన్నింటిలోనూ సమితి సంఘానికి దాని బాధ్యతలను నిర్వర్తించడానికి అవసరమైన స్థాయినీ, అధికారాన్నీ కలిగి వుంటవి.

ఆర్టికల్ 105:

1. సమితి దేశాలన్నింటిలోనూ సమితి సంఘానికి దాని బాధ్యతల నిర్వహణకు, లక్ష్యాల సాధనకు అవసరమైన హక్కులను, రక్షణలను కలిగి ఉంటవి.

2. సమితి వుద్యోగులకు, సమితి దేశాల ప్రతినిధులకు సమితికి సంబంధించి వారు నిర్వర్తింప వలసిన బాధ్యతల నిర్వహించడంలో సమితి సంస్థకు సమితి రాజ్యాలలో ఎట్టి హక్కులు, రక్షణలు వుండగలవో, అట్టి హక్కులు, రక్షణలు వుండగలవు.

3, పై రెండు పేరాగ్రాఫులో పేర్కొనబడిన అంశములకు సంబంధించిన వివరములను నిర్ణయించే నిమిత్తం, సంప్రదాయములను ఏర్పరచే నిమిత్తం సర్వసభ్య సంఘం సమితి దేశాలకు ప్రతిపాదనలు చేస్తూ వుండవచ్చును.

# పదునేడవ ప్రకరణ

## నడమంత్రపు రక్షణ ఏర్పాట్లు

ఆర్టికల్ 106:

ఆర్టికల్ 42 ను అనుసరించి భద్రతామండలి తన బాధ్యతలను నిర్వర్తించడానికి వీలుగా ఆర్టికల్ 43 లో ప్రస్తావింపబడిన ప్రత్యేక ఒప్పందాలు, ఏర్పాట్లు అమలులోనికి వచ్చే పర్యంతం 1943 అక్టోబరు 30 న మాస్కోలో నాలుగు రాజ్యాల ప్రకటనకు పార్టీలైన దేశాలు, ఫ్రాన్సు. ఆ ప్రకటనలోని అయిదవ పేరాగ్రాఫును అనుసరించి ఈ రాజ్యాలు పరస్పరం సంప్రతింపులు జరుపుకొని, అవసరమైనప్పుడు ఇతర సమితి రాజ్యాలతో కూడా, అంతర్జాతీయ శాంతి భద్రతల సంరక్షణకు తీసుకొన తగు చర్యలగురించి, సంప్రతింపులు జరిపి, తదనుగుణంగా చర్యలు తీసుకొనవచ్చును.

ఆర్టికల్ 107:

సమితి ప్రణాళికపై సంతకం చేసిన దేశాల్లో ఏ దేశం అయినా ద్వితీయ సంగ్రామంలో అట్టి దేశంపై యుద్ధం సాగించిన శత్రు రాజ్యంపై ఎట్టి చర్యలు తీసుకోవడానికి ఈ ప్రణాళిక అడ్డుగాదు.

# పదునెనిమిదవ ప్రకరణ

## సవరణలు

ఆర్టికల్ 108:

సమితి సభ్యులలో మూడింట రెండువంతుల మంది ఆమోదించి అదే లెక్కలో సమితి దేశాల ప్రభుత్వాలు, భద్రతామండలిలోని అయిదుగురు శాశ్వత సభ్యులతో సహా ఆమోదించిన సవరణలు అన్నీ అమలులోకి వస్తవి. ఆ సవరణలు సమితి దేశాలు అన్నింటికీ వర్తిస్తవి.

ఆర్టికల్ 109:

1. ఈ ప్రణాళికను పరిశీలించే నిమిత్తం సమితి సర్వసభ్య సంఘం సమావేశం కావచ్చు. ఆ సమావేశం ఎప్పుడు ఎక్కడ జరగాలి అనే విషయం సమితి సభ్యులలో మూడింట రెండువంతుల మంది భద్రతామండలి లోని ఏడుగురు సభ్యులు ఆమోదించిన తీర్మానం ద్వారా నిర్ణయ మౌతుంది. అట్టి సర్వసభ్య సమావేశంలో సభ్యత్వ దేశానికి ఒక వోటు ఉంటుంది.

2. సమితి సభ్యులలో మూడింట రెండువంతుల మంది ఆమోదంపై ఈ ప్రణాళికకు జరిగిన సవరణలు సమితి దేశాల ప్రభుత్వాలు మూడింట రెండువంతులు, భద్రతామండలిలోని శాశ్వత సభ్యత్వం గల అయిదు దేశాల ప్రభుత్వాలు ధ్రువపరచిన వెంటనే అమలులోనికి వస్తవి.

3. ఈ ప్రణాళిక అమలుకు వచ్చిన తరువాత సమితి సర్వసభ్య సంఘ పదవ వార్షిక సమావేశంలోపుగా సమితి ప్రణాళిక పరిశీలనార్థం ఇలాంటి సమావేశం జరక్కపోతే, ఆ వెంటనే జరిగే సమితి సర్వసభ్య సంఘ వార్షిక సమావేశంలో సమితి ప్రణాళిక పరిశీలనకు అట్టి సమావేశాన్ని జరపాలా, అక్కర్లేదా అన్న విషయం విచారణకు వస్తుంది. ఆ తీర్మానానికి సమితి సభ్యులలో మెజారిటీ సభ్యులు, భద్రతామండలిలో ఏడుగురు సభ్యులు అనుకూలంగా తమ సమ్మతిని తెలియజేస్తే అట్టి సమావేశం జరుగుతుంది.

# పందొమ్మిదవ ప్రకరణం

## ధృవీకరణ, సంతకాలు చేయడం

ఆర్టికల్ 110 :

1. ప్రణాళికపై సంతకం చేసిన దేశాల ప్రభుత్వాలు తమ రాజ్యాంగంలో పేర్కొనబడిన విధంగా ఈ ప్రణాళికను ధృవపరుస్తవి.

2. ఈ విధంగా ధృవపరచిన తర్వాత ఆ యా దేశాలు ఈ ధృవ పత్రాలను అమెరికా ప్రభుత్వానికి పంపగలవు. అమెరికా ప్రభుత్వం ఎప్పటికప్పుడు ఏ యే ప్రభుత్వాల ధృవపత్రాలు అందిందీ సమితి సెక్రటరీ జనరల్ నియమింపబడగానే ఆయనకు తెలుపుతూ ఉంటుంది.

3. రిపబ్లిక్ ఆఫ్ చైనా, ఫ్రాన్సు, యూనియన్ ఆఫ్ సోవియట్, సోషలిస్టు రిపబ్లిక్స్, యునైటెడ్ కింగ్‌డమ్ ఆఫ్ గ్రేట్ బ్రిటన్ అండ్ నార్దరన్ ఐర్లెండు, యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా. ప్రణాళికపై సంతకంచేసిన ఇతర దేశాల్లో మెజారిటీ దేశాలు ధృవపరచగానే ఈ ప్రణాళిక అమలులోకి వస్తుంది. అప్పుడు అమెరికా ప్రభుత్వం ఈ ధృవ పత్రాలన్నిటినీ సంపుటీకరించి ఒక పత్రం తయారుచేసి, ఆ పత్రం ప్రతులను ప్రణాళికపై సంతకాలు చేసిన అన్ని దేశాలకూ పంపుతుంది.

4. ఈ ప్రణాళిక సంతకం చేసి ఈ ప్రణాళిక అమలుకు వచ్చిన తరువాత ప్రణాళికను ధృవ పరచిన దేశాలు ధృవపత్రాలను సమర్పింపగానే సమితి ఆది సభ్యులుగా నుండును.

ఆర్టికల్ 111 :

ఈ ప్రణాళిక చైనీస్, ఫ్రెంచి, రష్యన్, ఇంగ్లీష్, స్పానిష్ భాషాంతరాల ప్రతులు అమెరికా అధికార పత్రాలలో భద్ర పరుపబడి ఉన్నవి. ఈ పత్రాల అధికార ప్రతులు ప్రణాళికపై సంతకాలు పెట్టిన ఇతర రాజ్యాలకు పంపబడును.

ఈ ప్రణాళికలో సంపూర్ణ విశ్వాసం కలిగి సమితి దేశాల ప్రభుత్వాల ప్రతినిధులు ఈ ప్రణాళికపై సంతకం చేయడమైనది.

1915 వ సంవత్సరం జూన్ నెల 26 వ తేదీన ఈ ప్రణాళికను సుస్థిరపరచడమైనది.

# అంతర్జాతీయ న్యాయస్థాన శాసనం

[సమితి ప్రణాళికను ధృవపరచిన ప్రతి సమితి సభ్య రాజ్యమూ ఈ శాసనాన్ని అంగీకరించినట్లే అవుతుంది.]

ఆర్టికల్ 1:

ఐక్యరాజ్య సమితి ప్రధాన న్యాయపాలనా సంస్థగా అంతర్జాతీయ న్యాయస్థానం సమితి ప్రణాళికద్వారా ఏర్పాటై ఈ శాసనాన్ని అనుసరించి వ్యవహరింపగలదు.

## ప్రథమ ప్రకరణ

### న్యాయస్థాన నిర్మాణం

ఆర్టికల్ 2:

సర్వస్వతంత్రులైన న్యాయాధిపతులతో ఈ న్యాయస్థానం ఏర్పాటవుతుంది. వీరు ఏ జాతికి చెందినప్పటికీ వారు ఋజువర్తన కలిగిన ఘనా వ్యక్తులుగా ఉండాలి. వారు వారి దేశాల్లోని అత్యున్నత న్యాయస్థానానికి నియమింపబడడానికి అన్ని విధాలా అర్హులైన వారుగా ఉండాలి. అంతర్జాతీయ న్యాయ శాస్త్రమందలి దేనికైనా న్యాయశాస్త్ర సలహాదారులుగా వ్యవహరించడానికి తగిన వారై ఉండాలి.

ఆర్టికల్ 3:

1. ఈ న్యాయస్థానంలో 15 మంది సభ్యులు ఉంటారు. వీరిలో ఏ ఇద్దరూ ఒకజాతికి చెందినవారై ఉండరాదు.

2. ఈ న్యాయస్థాన సభ్యత్వానికి ఎన్నిక కానున్న వ్యక్తి ఎవరైనా రెండు రాజ్యాల్లో పౌరసత్వం కలిగి ఉంటే, అప్పుడు ఆ వ్యక్తి సాధారణంగా ఏ రాజ్యంలో తనకు గల రాజకీయ, పౌరహక్కులను వినియోగించుకుంటూ ఉంటాడో ఆ రాజ్యపు పౌరుడుగా పరిగణించ బడతాడు.

ఆర్టికల్ 4:

1. శాశ్వత పరిష్కార మండలికి చెందిన వివిధ వర్గాలు చేసే ప్రతిపాదనల ననుసరించి ఈ న్యాయస్థానసభ్యులను సమితి సర్వసభ్య సంఘము,

భద్రతామండలి ఎన్నుకుంటవి. ఈ ఎన్నిక దిగువ వివరించిన నిబంధనల ననుసరించి జరుగుతుంది.

2. సమితి సభ్యులు శాశ్వత పరిష్కారమండలిలో ప్రాతినిధ్యం కలిగి ఉండనప్పుడు ఆ యా ప్రభుత్వాలు ఇందు నిమిత్తం ఏర్పాటు చేసే జాతీయమండలి ఈ న్యాయస్థానానికి ఎన్నిక కావలసిన సభ్యులను సూచిస్తుంది. అయితే, ఈ విధంగా ఆ యా ప్రభుత్వాలు ఈ విధమైన జాతీయ ఎన్నిక మండలిని ఏర్పాటుచేసే సందర్భంలో అంతర్జాతీయ వివాదాల శాంతియుత పరిష్కారం నిమిత్తం 1907 వ సంవత్సరపు హేగ్ ఒడంబడికలోని 44 వ ఆర్టికల్ను గమనించి శాశ్వత పరిష్కారమండలి సభ్యుల ఎన్నికకు విధింపబడిన షరతులను పాలించి వ్యవహరింపవలసి ఉంటుంది.

3. ఏ దేశమైనా ఈ శాసనాన్ని అంగీకరించి ఉండి సమితిసభ్యత్వం లేకుండా ఉండి ఉన్న పరిస్థితులలో ప్రత్యేక ఒడంబడిక ఏవీ లేనప్పుడు, అట్టి దేశం ఈ ఎన్నికల్లో ఎలా పాల్గొనాలనే విషయమై భద్రతామండలి సిఫార్సులను అనుసరించి సర్వసభ్య సంఘం నిర్ణయిస్తుంది.

ఆర్టికల్ 5:

1. ఎన్నికలు జరగడానికి కనీసం మూడు మాసాలముందు ప్రస్తుత శాసనాన్ని ఆమోదించిన శాశ్వత పరిష్కారమండలి సభ్యులందరికీ, ఆర్టికల్ 4 పేరగ్రాఫు 2 లో వివరించిన ప్రకారం ఏర్పాటైన జాతీయ ఎన్నికల సంఘాలకు, అంతర్జాతీయ న్యాయమూర్తి పదవిని స్వీకరింపగల వ్యక్తులను సూచింపవలసిందిగా సమితి సెక్రటరీ జనరల్ లిఖితపూర్వకంగా కోరగలడు.

2. ఎవ్వరూ నలుగురు అభ్యర్థులకంటే ఎక్కువమంది పేర్లను సూచించడానికి లేదు. ఈ నలుగురు అభ్యర్థుల్లోనూ ఇద్దరూ మాత్రమే ఆ దేశానికి చెందిన పౌరులై ఉండవచ్చును. ఏ పరిస్థితుల్లోనూ ఏ దేశ ఎన్నిక సంఘమూ ఎన్నిక కావలసిన వారి సంఖ్యకు రెట్టింపుకు మించి సూచించడానికి వీలులేదు.

ఆర్టికల్ 6:

ప్రతి దేశంలోని ఎన్నికల సంఘమూ ఈ అభ్యర్థుల పేర్లను సూచించే ముందు ఆ దేశంలోని ఉన్నత న్యాయస్థానం అభిప్రాయాన్ని, న్యాయ శాస్త్ర సంఘాల అభిప్రాయాన్నీ తెల్సుకోవలసి ఉంటుంది.

ఆర్టికల్ 7:

1. ఈ విధంగా వివిధ దేశాలు సూచించిన పేళ్ల జాబితా నొక దాన్ని అక్షరక్రమంలో సెక్రటరీ జనరల్ తయారు చేస్తాడు. ఆర్టికల్ 12, పేరాగ్రాఫు 2 లో పేర్కొనబడిన సందర్భాల్లో తప్ప, న్యాయస్థానానికి ఎన్నిక అయ్యే అర్హత గలవారు వీరు మాత్రమే.

2. ఈ విధంగా జాబితాలను తయారుచేసే, సెక్రెటరీ జనరల్ ఆ జాబితాను సమితి సర్వసభ్య సంఘానికీ, భద్రతామండలికీ పంపుతాడు.

ఆర్టికల్ 8:

సమితి సర్వసభ్య సంఘమూ, భద్రతామండలీ దేనికదే న్యాయ స్థాన సభ్యుల ఎన్నికను ఉపక్రమించును.

ఆర్టికల్ 9:

ఈ న్యాయమూర్తులను ఎన్నుకునేవారు ప్రతి ఎన్నిక సమయంలోనూ ఎన్నికయ్యే ప్రతి ఒక్కరూ అన్ని అర్హతలూ గలవాడని గమనించడంతో బాటు మొత్తంగా ఈ న్యాయస్థానంలో ప్రపంచంలోని ప్రధాన నాగరికత లకూ, ముఖ్య న్యాయపాలనా పద్ధతులకు ప్రాతినిధ్యం ఉండేటట్లు కూడా చూడవలసి ఉంటుంది.

ఆర్టికల్ 10:

1. సమితి సర్వసభ్య సంఘంలోనూ, భద్రతామండలిలోనూ ఖచ్చిత మైన మెజారిటీ వచ్చిన అభ్యర్థులు ఎన్నికైనట్లు పరిగణింపబడుదురు.

2. సభ్యుల ఎన్నిక సందర్భంలోగాని, ఆర్టికల్ 12 లో పేర్కొన బడిన సమావేశాన్ని పిలిచే సందర్భంలోగాని భద్రతామండలిలో వోటు తీసుకోవడంలో పెర్మనెంటు సభ్యులూ, పెర్మనెంటుగాని సభ్యులూ అనే విచక్షణ పాటింపబడదు.

3. ఒకే దేశానికి చెందిన ఇద్దరు సర్వసభ్య సంఘంచేతా, భద్రతా మండలిచేతా కూడా ఎన్నుకోబడితే వారిద్దరిలో వయస్సులో పెద్దవాడైన అభ్యర్థి ఎన్నికైనట్లు పరిగణింపబడును.

ఆర్టికల్ 11:

మొదటి ఎన్నిక ఫలితంగా ఇంకా ఒకటిగాని, ఒంతకు మించిగాని స్థానాలు ఖాళీపడివుంటే ఆ ఖాళీ పూర్తి అయ్యేవరకూ మరొకటి రెండు సార్లు ఎన్నిక జరుగుతుంది.

ఆర్టికల్ 12:

1. ఈ విధంగా మూడు పర్యాయములు ఎన్నిక జరిగినప్పటికీ ఇంకా కొన్ని స్థానాలు ఖాళీపడివుంటే అప్పుడు భద్రతామండలి సూచనపైగాని, సర్వసభ్య సంఘ సూచనపైగాని ఈ రెండు సంఘాలకు చెందిన ఆరుగురు సభ్యులు (ఒక్కొక్క సంఘంనుంచి ముగ్గురు) కలిసి, ఖాళీపడిన ప్రతి ఒక్క స్థానాన్ని పూర్తిచేసే నిమిత్తం భద్రతామండలి, సర్వసభ్య సంఘ ఆమోదం నిమిత్తం ఒక్కొక్క పేరును మెజారిటీ ఆమోదంతో సూచింపవచ్చును.

2. ఆర్టికల్ 7 లో చెప్పిన అభ్యర్థులు జాబితాలో లేకపోయినప్పటికీ ఈ ఆరుగురు సభ్యులూ అన్ని అర్హతలూ వున్నట్టి వేరొక వ్యక్తిని సూచించితే ఆ వ్యక్తిని ఆ జాబితాలో చేర్చవచ్చును.

3. ఈ విధంగా ఈ ఆరుగురు సభ్యుల జాయింటు కృషి ఫలితగా కూడా ఈ ఖాళీలు పూర్తిగాని పరిస్థితుల్లో ఎన్నికైన ఇతర సభ్యులు సర్వసభ్య సంఘంచే గాని, భద్రతామండలిచే గాని ఎన్నుకోబడిన వారినుండి ఖాళీ స్థానాలను భర్తీ చేసేందుకు ఎన్నుకోవచ్చును. ఈ ఎన్నిక ఎంత వ్యవధిలోగా జరగాలో భద్రతామండలి నిర్ణయిస్తుంది.

4. ఈ న్యాయమూర్తులలో వోట్లు సమంగా ఉన్నప్పుడు వయస్సులో పెద్ద అయిన న్యాయమూర్తికి కాస్టింగ్ వోటు ఉంటుంది.

ఆర్టికల్ 13:

1. ఈ న్యాయస్థాన సభ్యులు 9 సంవత్సరాలు పదవుల్లో ఉండేందుకు ఎన్నిక అవుతారు. కాలపరిమితి తీరిపోయినతరువాత అట్టి వారు తిరిగి

ఎన్నిక కావచ్చును. అయితే, మొదటి ఎన్నికైన న్యాయమూర్తులలో అయిదుగురి పదవీకాలం మూడు సంవత్సరాలకూ, మరో ఐదుగురి పదవీ కాలం ఆరు సంవత్సరాలకూ తీరిపోతుంది.

2. ఈ విధంగా ఏయే న్యాయమూర్తులు కాలపరిమితి ఎప్పుడు ముగిస్తుందీ అన్నది లాటరీవేసి, మొదటి ఎన్నిక పూర్తి కాగానే సెక్రెటరీ జనరల్ నిర్ణయిస్తాడు.

3. ఈ విధంగా ఖాళీ పడిన స్థానాల న్యాయమూర్తులు ఆ స్థానాలకు క్రొత్తవారు ఎన్నిక అయ్యేవరకూ ఆ స్థానంలో ఉంటారు. ఒకవేళ కొత్తవారు ఎన్నికైనా, పాతవారు ఒక కేసును విచారిస్తూ వుంటే అది పూర్తి అయ్యేవరకూ వారు న్యాయమూర్తులుగానే ఉండి తమ పని పూర్తి చేయగలరు.

4. ఈ న్యాయమూర్తులలో ఎవరైనా రాజీనామా ఇవ్వదలిస్తే, అట్టివారు తమ అభిమతాన్ని న్యాయస్థాన అధ్యక్షునకు లిఖిత పూర్వకంగా తెలియజేస్తే ఆయన ఆ విషయాన్ని సెక్రెటరీ జనరల్‌కు తెలియజేస్తారు. కోర్టు అధ్యక్షుడు సెక్రెటరీ జనరల్‌కు తెలియచేయగానే రాజీనామా నిచ్చిన న్యాయమూర్తి స్థానం ఖాళీ అవుతుంది.

ఆర్టికల్ 14:

ఖాళీలను భర్తీచేయడం కూడా మొదట జరిగిన ఎన్నిక పద్ధతినే జరుగుతుంది. ఖాళీ ఏర్పడిన నెల రోజుల లోపల ఆర్టికల్ 5 లో సూచించిన విధంగా వివిధ దేశాలకు ఆహ్వానాలు సెక్రటరీ జనరల్ పంపుతాడు. భద్రతామండలి ఎన్నికల తేదీని నిర్ణయిస్తుంది.

ఆర్టికల్ 15:

ఒక న్యాయమూర్తి పదవీకాలం పూర్తికాక పూర్వమే తన స్థానాన్ని ఖాళీచేస్తే ఆ స్థానానికి క్రొత్తగా ఎన్నికైన న్యాయమూర్తి మిగతా కాలానికే ఆ స్థానంలో న్యాయమూర్తిగా ఉండగలడు.

ఆర్టికల్ 16:

1. న్యాయస్థానానికి చెందిన న్యాయాధికారులు ఎవ్వరూ రాజకీయ సంబంధమైన, పరిపాలనకు సంబంధించిన పనులను వేటినీ చేయరాదు. ఒక వృత్తిగా నిర్వచింపబడిన ఏ వ్యవహారంలోనూ వారు ప్రవేశింపరాదు.

2. ఈ విషయంలో ఉత్పన్నమయ్యే సందేహాలు న్యాయస్థాన తీర్పు ద్వారానే పరిష్కార మవుతవి.

ఆర్టికల్ 17:

1. న్యాయస్థాన సభ్యులుగా వున్నవారు ఎవ్వరూ ఏ కేసులోనూ ఏజెంటుగాగాని, ప్లీడరుగాగాని, సలహాదారుగాగాని వ్యవహరింపరాదు.

2. లోగడ ఏ కేసులోనైనా ఒక న్యాయమూర్తి ఏజెంటుగాగాని, సలహాదారుగాగాని, ప్లీడరుగాగాని పనిచేసివుంటే ఆ కేసు పరిష్కారంతో అట్టి న్యాయమూర్తికి ఎలాంటి సంబంధమూ ఉండకూడదు.

3. ఈ విషయంలో ఏర్పడే సందేహాలు కోర్టు తీర్పు ద్వారానే పరిష్కారం కాగలవు.

ఆర్టికల్ 18:

1. న్యాయస్థానంలోని ఇతర సభ్యులందరూ ఏకగ్రీవంగా ఒక న్యాయమూర్తికి ఉండవలసిన అర్హతలు లేకుండా పోయినట్లు తీర్మానిస్తే తప్ప న్యాయస్థాన సభ్యులలో ఎవ్వరినీ బర్తరఫ్ చేయుడానికి వీలులేదు.

2. ఇట్టి పరిస్థితి ఏర్పడినప్పుడు కోర్టు రిజిస్ట్రారు ఆ విషయాన్ని సమితి సెక్రటరీ జనరల్‌కు తెలియపరచవలెను.

3. ఈ విధంగా రిజిస్ట్రారు తెలియచేయగానే ఆ న్యాయమూర్తి స్థానం ఖాళీ పడుతుంది.

ఆర్టికల్ 19:

న్యాయస్థాన పనులను నిర్వహిస్తున్న సమయాల్లో న్యాయమూర్తులకు మామూలు డిప్లమాట్సు (రాయబారులు) కు ఉండే హక్కులు కలిగి ఉండగలరు.

ఆర్టికల్ 20 :

ప్రతి న్యాయమూర్తి తన పదవిని స్వీకరించే ముందు నిష్పాక్షికంగానూ, అంతరాత్మ సాక్షిగానూ వ్యవహరించగలనని బహిరంగంగా కోర్టులో ప్రకటన చేయాలి.

ఆర్టికల్ 21 :

1. న్యాయస్థానం అధ్యక్షుడిని ఉపాధ్యక్షుడిని ఎన్నుకుంటుంది. వీరు మూడు సంవత్సరాలు ఆ పదవుల్లో ఉంటారు. తిరిగి వారా స్థానాలకు ఎన్నికయ్యేందుకు ఎట్టి అభ్యంతరాలూ ఉండవు.

2. న్యాయస్థానం ఒక రిజిస్ట్రారును, అవసరమైన ఇతర సిబ్బందినీ నియమింపవచ్చును.

ఆర్టికల్ 22 :

1. అంతర్జాతీయ న్యాయస్థానం కార్యస్థానం హేగ్‌లో ఉంటుంది. అంత మాత్రాన కోర్టు మరొకచోట సమావేశం కాకూడదని ఏమీ లేదు. ఎక్కడ అవసరం అని అనుకుంటే అక్కడ సమావేశం కావచ్చును.

2. న్యాయస్థాన అధ్యక్షుడు, రిజిస్ట్రారు మాత్రం కోర్టు కార్యస్థానం ఉన్నచోటే తమ నివాసం ఏర్పాటు చేసుకొని ఉండాలి.

ఆర్టికల్ 23 :

1. కోర్టు సెలవులలో తప్ప న్యాయస్థానం ఎప్పుడూ సమావేశం అవుతూనే ఉండాలి. సెలవులు ఎప్పుడో కోర్టే నిర్ణయిస్తుంది.

2. న్యాయమూర్తులు సెలవుల మీద వెళ్లవచ్చును. వీరి స్వదేశానికీ, హేగ్‌కూ గల దూరాన్నిబట్టి వీరు ఎన్నాళ్లు సెలవు తీసుకోవచ్చునో కోర్టే నిర్ణయిస్తుంది.

3. సెలవుపై ఉన్నా, సుస్తీగా ఉన్నా, ఇతర ప్రబల కారణాలేమైనా ఉన్నా తప్ప, సామాన్యంగా న్యాయాధిపతులు కోర్టు పరంగానే ఉండాలి. అవాంతరం ఏర్పడితే ఆ విషయాన్ని అధ్యక్షునికి నివేదించాలి.

ఆర్టికల్ 24 :

1. ఏదైనా ఒక తగాయిదా విచారణలో తను పాల్గొనడం భావ్యంగాదని ఒక న్యాయమూర్తి భావిస్తే ఆయన ఆ విషయాన్ని న్యాయస్థాన అధ్యక్షునికి తెలియజేయాలి.

2. న్యాయస్థాన అధ్యక్షుడు న్యాయమూర్తి ఒక తగాయిదా విచారణలో పాల్గొనరాదని అభిప్రాయపడితే ఆ విధంగా ఆయన ఆ న్యాయమూర్తికి నోటీసు ఇస్తాడు.

3. ఇలాంటి విషయంలో న్యాయస్థాన అధ్యక్షుడూ న్యాయమూర్తీ ఏకీభవించలేకపోతే ఆ విషయాన్ని న్యాయస్థానమే పరిష్కరిస్తుంది.

ఆర్టికల్ 25 :

1. ఈ శాసనంలో అన్యథా సూచింపబడితేనే తప్ప మామూలుగా మొత్తం న్యాయస్థానం సమావేశమౌతూ ఉంటుంది.

2. ఏ పరిస్థితులలోనూ పూర్తి న్యాయస్థాన సమావేశానికి 11 మందికి తక్కువగాకుండా న్యాయమూర్తులు హాజరులో ఉంటే, ఒకరిద్దరు న్యాయమూర్తుల వంతున ఈ సమావేశాలకు హాజరు కానవసరం లేకుండా న్యాయస్థాన మేర్పాటు చేయవచ్చును.

3. పూర్తి సమావేశం జరగడానికి 9 మంది న్యాయమూర్తులు హాజరైతే కోరం అయినట్లే.

ఆర్టికల్ 26 :

1. ముగ్గురు గాని అంతకంటే ఎక్కువ మంది న్యాయమూర్తులు గాని, కోర్టు నిర్ణయించిన విధంగా కొన్ని రకాల కేసుల విచారణకు ప్రత్యేక న్యాయవిచారణమండలిగా ఏర్పడవచ్చును. ఈ విధంగా విచారింపబడగల కేసులు కార్మిక వివాదాలు, రవాణా రహదారి విషయాలకు సంబంధించినవి.

2. ఎప్పుడైనా న్యాయస్థానం ఒక ప్రత్యేక తగాయిదాను విచారించేందుకు ఒక న్యాయవిచారణమండలిని పై విధంగా ఏర్పాటు చేయవచ్చును. ఎంతమంది న్యాయమూర్తులతో ఈ న్యాయవిచారణమండలి

ఏర్పడాలన్న విషయాన్ని కక్షిదారుల అంగీకారంతో అంతర్జాతీయ న్యాయ స్థానం నిర్ణయిస్తుంది.

3. కక్షిదారులు, వాది ప్రతివాదులు కోరినప్పుడు ఆ తగాయిదాలు ఈ ఆర్టికల్‌లో సూచించిన న్యాయపాలనా మండలిచే విచారింప బడవచ్చును.

ఆర్టికల్ 27 :

ఆర్టికల్స్ 26, 29 లలో సూచింపబడిన న్యాయపాలనా మండలులు ఇచ్చిన తీర్పులు మొత్తం న్యాయస్థానం ఇచ్చిన తీర్పులుగానే పరిగణింప బడగలవు.

ఆర్టికల్ 28 :

వాది ప్రతివాదుల కోరికపై ఆర్టికల్స్ 26, 29 లలో సూచింప బడిన న్యాయపాలనా మండలులు హేగ్‌లోనే గాక ఇతర ప్రాంతాలలో కూడా సమావేశం కావచ్చును.

ఆర్టికల్ 29 :

దావాలు త్వరత్వరగా పరిష్కారం అయ్యేందుకు వీలుగా న్యాయ స్థానం అయిదుగురు న్యాయమూర్తులతో ఒక న్యాయపాలనా మండలిని ఏర్పాటు చేస్తుంది. కక్షిదారులు సమ్మతిస్తే వారి తగాయిదాను ఈ న్యాయ మండలి విచారింపవచ్చును. ఈ న్యాయమండలిలోని అయిదుగురు న్యాయ మూర్తులలోనూ ఒకరిద్దరు ఏ కారణం వల్లగాని సమావేశాలకు హాజరు కాలేని పరిస్థితుల్లో వారికి బదులుగా పనిచేసేందుకు న్యాయస్థానం ఇద్దరు న్యాయమూర్తులను పేర్కొని రిజర్వులో ఉంచుతుంది.

ఆర్టికల్ 30 :

1. అంతర్జాతీయ న్యాయస్థానం తన కార్యక్రమ నిర్వహణకు సంబంధించిన నిబంధనలు స్వయంగా తయారు చేసుకుంటుంది.

2. వోటు చేసే అధికారం లేకుండా కొన్ని కేసుల విచారణలో పాల్గొనే నిమిత్తం న్యాయస్థానం కొంతమందిని అసెసర్లుగా నియమింప వచ్చును.

ఆర్టికల్ 31 :

1. న్యాయస్థాన విచారణకు వచ్చిన తగాయిదాలో కక్షిదారులుగా ఉన్న దేశాల పౌరులు న్యాయస్థాన సభ్యులుగా ఉంటే అట్టి సభ్యులు కూడా ఆ విచారణలో పాల్గొనేందుకు హక్కు కలిగి ఉంటారు.

2. ఒక కక్షిదారుకు చెందిన పౌరుడు తగాయిదా విచారణలో పాల్గొంటే ఇతర కక్షిదారులు కూడా ఆ న్యాయమూర్తితో సరిసమాన హోదాలో పాల్గొనేందుకు ఒకర్ని న్యాయమూర్తిగా సూచింపవచ్చును. ఆర్టికల్స్ 4, 5 లో విశదీకరింపబడిన విధంగా లోగడ నామినేటు చేయబడిన వ్యక్తులనుండి అట్టి న్యాయమూర్తులను ప్రధానంగా ఎన్నుకోనడమౌతుంది.

3. ఏ పార్టీ పౌరసత్వమూ కలిగి వున్నటువంటి న్యాయమూర్తులు ఈ విచారణ మండలిలో చేరి ఉండకపోయిన పై పేరగ్రాఫులో సూచించిన విధంగా వాది, ప్రతివాదులు ఒక్కొక న్యాయమూర్తిని ఎన్నుకోవచ్చును.

4. ఈ ఆర్టికల్ నియమాలు ఆర్టికల్స్ 26, 29 లకు సంబంధించిన వ్యవహారాలకు వర్తించును. ఈ విధంగా అప్పటి అవసరానికి న్యాయమూర్తులుగా ఎన్నికైన వారికి స్థానాలిచ్చే నిమిత్తం న్యాయస్థాన అధ్యక్షుడు న్యాయ విచారణమండలిలోని ఒకరిద్దరు న్యాయమూర్తులకు తమ స్థానాలను తాత్కాలికంగా ఈ కొత్తవారికి ఇవ్వవలసిందిగా ఆదేశింపవచ్చును.

5. ఒక తగాయిదాలో అనేక దేశాలు ఒకే పార్టీగా చేరినప్పుడు పై ఏర్పాటుకు సంబంధించినంతవరకు అన్ని దేశాలను ఒకే పార్టీగా అంతర్జాతీయ న్యాయస్థానం భావించగలదు. ఈ విషయంలో వచ్చే సందేహాలను అంతర్జాతీయ న్యాయస్థానమే పరిష్కరిస్తుంది.

6. ఈ ఆర్టికల్లోని 2, 3, 4 పేరగ్రాఫులలో సూచించిన విధంగా ఎన్నిక అయ్యే న్యాయమూర్తులకు ఆర్టికల్స్ 2, 17 లోని 2 వ పేరగ్రాఫు, 20, 24 లలో విధింపబడిన అర్హతలు కలిగి ఉండాలి. ఈ విధంగా అప్పటి అవసరానికి ఎన్నికయ్యే న్యాయమూర్తులు ఆ స్థానాల్లో వున్నంత కాలం ఇతర న్యాయమూర్తులతో సరిసమాన హోదా, అధికారాలు, హక్కులు కలిగి ఉంటారు.

**ఆర్టికల్ 32 :**

1. ప్రతి న్యాయమూర్తికీ వార్షిక వేతనం ఉంటుంది.

2. న్యాయస్థాన అధ్యక్షుడికి ప్రత్యేకం వార్షిక అలవెన్సు ఉంటుంది.

3. అధ్యక్షుడుగా వ్యవహరించిన కాలంలో ఉపాధ్యక్షుడు ఆ రోజులకు ప్రత్యేక అలవెన్సు తీసుకోగలడు.

4. న్యాయస్థాన సభ్యులుగాక, ఆర్టికల్ 31 ని అనుసరించి న్యాయమూర్తులుగా ఎన్నికైన వారు ఆ బాధ్యతలను నిర్వర్తించిన రోజులకు కొంత మొత్తాన్ని పరిహారం క్రింద పుచ్చుకోగలరు.

5. ఈ వేతనాలు, అలవెన్సులు, పరిహారం మొత్తాలను సమితి సర్వసభ్య సంఘం నిర్ణయిస్తుంది. న్యాయమూర్తుల ఉద్యోగ కాలంలో వారి వేతనాలనుగాని, అలవెన్సులనుగాని, పరిహారం మొత్తాలనుగాని తగ్గించడానికి వీలు లేదు.

6. న్యాయస్థానం ప్రతిపాదనపై సర్వసభ్య సంఘం కోర్టు రిజిస్ట్రారు జీతాన్ని నిర్ణయిస్తుంది.

7. న్యాయస్థాన సభ్యులకు పెన్షన్లు ఏ పరిస్థితులలో ఏ షరతులపై ఇవ్వవచ్చునో, రిజిస్ట్రారుకు ఏ షరతులపై పెన్షన్లు ఇవ్వవచ్చునో, రిజిస్ట్రారు న్యాయస్థాన సభ్యుల ప్రయాణపు ఖర్చులు తిరిగి ఇవ్వబడునో మొదలైన విషయాలు అన్నీ సమితి సర్వసభ్య సంఘం చేతనే నిర్ణయింపబడతవి.

8. ఈ జీతాలపైనా, అలవెన్సులపైనా, పరిహారం, మొదలా మొత్తాలపైనా ఆదాయపు పన్ను ఉండదు.

**ఆర్టికల్ 33 :**

సర్వసభ్య సంఘం నిర్ణయించిన విధంగా న్యాయస్థానం ఖర్చులను సమితే భరిస్తుంది.

# రెండవ ప్రకరణ

## న్యాయస్థాన అధికారం

**ఆర్టికల్ 34 :**

1. కోర్టు విచారణకు వచ్చే తగాయిదాల్లో రాజ్యాలే కక్షిదారులుగా ఉండును.

2. ఒక కేసు విషయంలో ఏవైనా వివరాలు కావలసివస్తే అట్టి వివరాలను తెలియజేయవలసిందిగా అంతర్జాతీయ న్యాయస్థానం తమ నిబంధనలకు లోబడి, అంతర్జాతీయ పౌరసంస్థలను అడగవచ్చును. అట్టి సంస్థలు వాటి కవే అట్టి వివరాలను న్యాయస్థానానికి తెలియజేయ వచ్చును కూడా.

3. అంతర్జాతీయ పౌరసంస్థ తయారుచేసిన ఒక పత్రంలోని పద ప్రయోగం, నిర్వచనం గురించిన తగాయిదా కోర్టు విచారణకు వస్తే రిజిస్ట్రారు ఆ విషయాన్ని ఈ అంతర్జాతీయ సంస్థకు తెలుపుతూ దీనిపై కోర్టు విచారణకు సంబంధించిన యావత్తు వివరాలనూ పంపగలడు.

ఆర్టికల్ 35 :

1. ఈ శాసనాన్ని ఆమోదించిన అన్ని రాజ్యాలకూ ఈ కోర్టులో ప్రవేశార్హత ఉన్నది.

2. ఇతర రాజ్యాలకు ఈ న్యాయస్థానంలో ప్రవేశాన్ని ఏ షరతులపై ఇవ్వవచ్చునో అట్టి షరతులను భద్రతామండలి అమలులో ఉన్నటువంటి ప్రత్యేక ఒడంబడికలను గుర్తించి తయారుచేయును. అయితే, భద్రతా మండలి తయారుచేసే నిబంధనల మూలంగా కోర్టులో వివిధ రాజ్యాల స్థాయికి ఎట్టి భంగమూ కలుగదు. కోర్టులో అన్ని రాజ్యాలకూ సమాన హోదా, అధికారం ఉంటుంది.

3. సమితి సభ్యత్వం లేని దేశం ఏదైనా కోర్టు విచారణకు వచ్చిన తగాయిదాలో పార్టీ అయివుంటే ఆ కేసు విచారణ క్రింద ఆ దేశం ఎంత కర్చు చెల్లించాల్సిందీ న్యాయస్థానం నిర్ణయిస్తుంది. అయితే, అట్టి దేశం ఇదివరకే ఈ కోర్టు కర్చులలో కొంత కర్చును భరిస్తూవుంటే ఇప్పుడు అదనంగా ఏ కర్చునూ భరించ నవసరంలేదు.

ఆర్టికల్ 36 :

1. కోర్టు విచారణాధికారం వాది, ప్రతివాదులు తెచ్చే ఫిర్యాదు లన్నింటికీ, సమితి ప్రణాళికలో ప్రత్యేకం పేర్కొనబడిన విషయాలకూ, ప్రస్తుతం అమలులో ఉన్నటువంటి ఒడంబడిక అంశములకూ వర్తించగలదు.

2. దిగువ పేర్కొనబడిన విషయాలకు సంబంధించిన న్యాయశాస్త్ర వ్యవహారాలలో కోర్టు నిర్ణయాన్ని నిర్నిబంధంగా అంగీకరించగలమని ఈ శాసనాన్ని ఆమోదించిన రాజ్యాలు ప్రకటించవచ్చును.

(ఏ) ఒక ఒడంబడిక అన్వయం

(బి) అంతర్జాతీయ న్యాయశాస్త్రానికి సంబంధించిన విషయం

(సి) అంతర్జాతీయ బాధ్యతలకు భంగం కలగే పరిస్థితి

(డి) అంతర్జాతీయ బాధ్యతలను భంగించినప్పుడు అట్టి భంగపాటు స్వభావం, అందుకు చెల్లింపవలసిన ముదరా మొత్తం నిర్ణయం

3. పై విధమైన ప్రకటనలు వివిధ రాజ్యాలు వాటి కవిగాగాని, లేక కొన్ని దేశాలు కలిసిగాని, లేక కొంత కాలం వరకూ అమలునందువుండే టట్లుగా గాని చేయవచ్చును.

4. ఈ ప్రకటనలను సమితి సెక్రెటరీ జనరల్‌కు దఖలు పరచవలసి ఉంటుంది. వివిధ దేశాలు ఈ విధంగా ప్రకటనలు చేసినప్పుడు సెక్రెటరీ జనరల్ ఈ ప్రకటన ప్రతులను ఈ శాసనాన్ని ఆమోదించిన దేశాలకూ, కోర్టు రిజిస్ట్రారుకూ పంపును.

5. శాశ్వత అంతర్జాతీయ న్యాయస్థాన శాసనంలోని 36 వ ఆర్టికల్‌ను అనుసరించి జరిగియుండిన ప్రకటనలు, ఆ ప్రకటనలలో నిర్ణయింపబడిన కాల వ్యవధి తీరేవరకూ అమలులో ఉండగలవు. అయితే, లోగడ అట్టి ప్రకటనలు చేసిన దేశాలు ఇప్పుడు ఈ శాసనాన్ని అంగీకరించి ఉండాలి.

6. ఈ న్యాయస్థానికి ఏ విషయంలోనైనా విచారణాధికారం వున్నదా లేదా అనే విషయం కోర్టు నిర్ణయాన్ని అనుసరించి తీర్మానమౌతుంది.

ఆర్టికల్ 37 :

ఈ శాసనం అమలుకు రావడానికి ముందు జరిగివున్న ఒడంబడికల్లో ఆ ఒడంబడికాంశాలకు సంబంధించిన తగాయిదాల పరిష్కారానికి ప్రత్యేక పరిష్కర్త సంఘం ఏర్పడాలని సూచింపబడివున్నా, లేదా ఆ తగాయిదాలు శాశ్వత అంతర్జాతీయ న్యాయస్థానికి నివేదింపబడాల

వున్నా ఇప్పుడు అట్టి ఒడంబడికలు కుదుర్చుకొన్న దేశాలు ఈ శాసనాన్ని అంగీకరించి వుంటే అట్టి తగాయిదాలను అంతరాతీయ న్యాయస్థానానికి నివేదింపవలసి ఉంటుంది.

ఆర్టికల్ 38:

1. విచారణకు వచ్చిన తగాయిదాలను అంతర్జాతీయ న్యాయ శాస్త్రాన్ని అనుసరించి న్యాయస్థానం పరిష్కరించే టప్పుడు దిగువ పేర్కొన్న విషయాలనుకూడా గుర్తింపవలసి ఉంటుంది.

(ఎ) కక్షిదారులు అంగీకరించినటువంటి అంతర్జాతీయసంప్రదాయాలు

(బి) శాసనంగా అంగీకరింపబడినటువంటి ఆచారాలు

(సి) నాగరిక రాజ్యాలన్నీ అంగీకరించినటువంటి న్యాయసూత్రాలు

(డి) ఆర్టికల్ 59 కి లోబడి ప్రసిద్ధ న్యాయమూర్తులు ఇచ్చిన తీర్పులు. న్యాయశాస్త్ర ప్రవీణులు వెల్లడించిన అభిప్రాయాలు, చేసిన వాఖ్యానాలు.

2. పార్టీలు అంగీకరించే పక్షంలో అంతర్జాతీయ న్యాయస్థానం ఏ తగాయిదానైనా తన సూత్రాలను, సిద్ధాంతాలను అనుసరించి పరిష్కరించేందుకు ఈ నిబంధనలు ప్రతి బంధకాలు కావు.

# మూడవ ప్రకరణ

## కార్యవిధానం

ఆర్టికల్ 39:

ఫ్రెంచి, ఇంగ్లీషు భాషలు కోర్టు అధికార భాషలుగా ఉండును. విచారణ ఫ్రెంచి భాషలో జరగడానికి పార్టీలు సమ్మతిస్తే తీర్పుకూడా ఫ్రెంచి భాషలోనే చెప్పబడుతుంది. విచారణ ఇంగ్లీషులో జరగాలని పార్టీలుకోరితే తీర్పుకూడా ఇంగ్లీషులోనే చెప్పబడుతుంది.

2. విచారణ ఏ భాషలో జరగాలనే విషయంపై ఒడంబడికి కుదరక పోతే ఏ పార్టీకి ఆ పార్టీ తన కిష్టమైన భాషలో వాదనను కొనసాగింప వచ్చును. అప్పుడు కోర్టు తీర్పును ఫ్రెంచి, ఇంగ్లీషు భాషలలో ఇవ్వగలదు.

ఈ రెండు తీర్పులలో ఏ భాషతీర్పు అధికార దృష్ట్యా నికరమైందీ కోర్టే వెల్లడిస్తుంది.

3. పార్టీ కోరిన ప్రకారం ఫ్రెంచి, ఇంగ్లీషుగాక ఇతర భాషలలో వాదన సాగించడానికి కోర్టు అనుమతింప వచ్చును.

ఆర్టికల్ 40:

1. ఒక ప్రత్యేక ఒప్పందాన్ని అనుసరించిగానీ, రిజిస్ట్రారుకు ఒక దరఖాస్తును పంపడం ద్వారా గానీ ఫిర్యాదులను కోర్టుకు నివేదింప వచ్చును. ఈ రెండు సందర్భాల్లోనూ తగాయిదా అంశములనూ, పార్టీలనూ స్పష్టంగా వివరించాల్సి ఉంటుంది.

2. ఆ దరఖాస్తును రిజిస్ట్రారు వెంటనే పార్టీ లన్నింటికీ అంద జేయును.

3. సెక్రెటరీ జనరల్ ద్వారా సమితి సభ్యదేశాలకూ, కోర్టులో హాజరు కావడానికి అర్హతగల ఇతర రాజ్యాలకూ కూడా రిజిస్ట్రారు దరఖాస్తు వివరాలను తెలియజేస్తారు.

ఆర్టికల్ 41:

1. పార్టీల హక్కులను కాపాడేందుకు అవసరమైన తాత్కాలిక చర్యలను న్యాయస్థానం సూచింపవచ్చును. ఆ విధమైన చర్యలు తీసుకోవడం అవసరమా అన్న సంగతిని న్యాయస్థానమే నిర్ణయిస్తుంది.

2. అంత్య తీర్పు ఇచ్చేలోపున తీసుకొన బడవలసిన అవసర చర్య లను గురించి న్యాయస్థానం పార్టీలకూ, భద్రతా మండలికీ తెలియ జేయును.

ఆర్టికల్ 42:

1. ఆ యా పార్టీల తరఫున ఆ పార్టీల ఏజెంట్లు కోర్టులో హాజ రవుతారు.

2. కోర్టులో ఈ ఏజెంట్లు న్యాయవాదుల సలహాదారుల సహా యాన్ని పొందవచ్చును.

3. ఈ ఏజెంట్లు, సలహాదారులు, న్యాయవాదులు కోర్టులో తమ విధులను స్వేచ్ఛగా నిర్వర్తించడానికి అవసరమైన హక్కులను కలిగి ఉందురు.

ఆర్టికల్ 43:

1. కార్యవిధానం రెండు విభాగాలుగా ఉంటుంది. ఒకటి లిఖిత పూర్వకమైనది; రెండవది మూజువాణీగా ఉండేది.

2. న్యాయస్థానానికి,పార్టీలకువచ్చే లేఖలు, నివేదికలు, విజ్ఞాపికలు, ఎదురు విజ్ఞాపికలు, వీటికి సమాధానాలు, వీటికి ఆధారంగా పేర్కొన బడే పత్రాలు అన్నీ లిఖితపూర్వకమైన కార్యక్రమ భాగానికి చెంది ఉంటవి.

3. ఈ నివేదనలన్నీ కోర్టు నిర్ణయించిన క్రమంలో, గడువులోపల రిజిస్ట్రారుకు పంపవలసి ఉండును.

4. ఒక పార్టీ ప్రసాదించిన పత్రాల అధికార ప్రతిని రెండవ పార్టీకి అంద జేయవలసి యుండును.

5. సాక్షుల, ప్రవీణుల, ఏజెంట్ల, సలహాదారుల, న్యాయవాదుల విచారణ అంతా మూజువాణీ కార్యక్రమం క్రిందకు వస్తవి.

ఆర్టికల్ 44:

1. ఏజెంట్లు, సలహాదారులు, న్యాయవాదులు కానటువంటి వారిని విచారించేందుకు సమన్లు పంపవలసివస్తే అట్టివారిని కోర్టుకు హాజరు పరచ వలసిందని న్యాయస్థానం అట్టి వ్యక్తులు ఏ దేశంలో వుంటే ఆ దేశపు ప్రభుత్వాన్ని కోరుతుంది.

2. ఖుద్దున సాక్ష్యం సేకరించవలసిన అవసరం ఏర్పడితే అప్పుడు కూడా న్యాయస్థానం పైన సూచించిన విధానాన్నే అనుసరించ వలసి ఉంటుంది.

ఆర్టికల్ 45:

విచారణ న్యాయస్థాన అధ్యక్షుని అధ్వర్యాన జరుగుతుంది. ఏ కారణంవల్లనైనా, అధ్యక్షుడు హాజరుకాలేకపోతే, ఉపాధ్యక్షుడు అధ్వర్యం వహిస్తాడు. వీరిద్దరూ అధ్వర్యం వహించలేక పోయినప్పుడు మిగతా న్యాయమూర్తులలో అగ్రజుడు అధ్వర్యం వహిస్తాడు.

ఆర్టికల్ 46 :

కోర్టు అన్యథా నిర్ణయించితే తప్ప, పార్టీలు ప్రత్యేకంగా కోరితే తప్ప విచారణలు అన్నీ బహిరంగంగానే జరుగుతవి.

ఆర్టికల్ 47 :

1. ప్రతివిచారణను గురించీ మినిట్సు తయారు చేయబడును. ఆ మినిట్సుపై అధ్యక్షుడు, రిజిస్ట్రారు సంతకం చేయగలరు.

2. ఈ మినిట్సే అధికారపత్రాలుగా అంగీకరింప బడతవి.

ఆర్టికల్ 48 :

ఒక కేసు విచారణ ఎలా జరగాలో, పార్టీలు తమ వాదనలను ఏ విధంగా కొనసాగించాలో, ఎంత వ్యవధిలోపున ముగించాలో కోర్టే నిర్ణయిస్తుంది. సాక్ష్య సేకరణకు అవసరమైన ఏర్పాట్లు అన్నింటినీ కూడా ఈ న్యాయస్థానమే చేస్తుంది.

ఆర్టికల్ 49 :

విచారణ ప్రారంభం కాకపూర్వమే అవసరమైన పత్రాలను పంపమనిగాని, ఇతర వివరాలు తెలియజేయమనిగాని న్యాయస్థానం వివిధ ఏజంట్లను కోరవచ్చును. ఎవరైనా ఈ కోరికను తిరస్కరిస్తే అట్టి తిరస్కృతిని న్యాయస్థానం లాంఛనంగా నమోదు చేయగలదు.

ఆర్టికల్ 50 :

ఒక విచారణను జరపడానికిగాని, ఒక విషయంపై పండితాభిప్రాయం తెలపడానికి న్యాయస్థానం కొంతమంది వ్యక్తులనుగాని, కొన్ని కమిషన్లను గాని, ప్రత్యేక సంఘాలను గాని నియమించవచ్చును. లేదా ఇదివరకే ఏర్పడివున్న సంఘాలకు ఈ పనిని పురమాయింపవచ్చును.

ఆర్టికల్ 51 :

ఆర్టికల్ 30 లో వివరింపబడిన కార్య విధానాన్ని అనుసరించి విచారణ సందర్భములో కోర్టువారు సాక్షులను, ప్రవీణులను అవసరమైన ప్రశ్నలను అడిగి విషయాలు తెలుసుకోవచ్చును.

ఆర్టికల్ 52 :

నిర్ణీత కాలంలోపున కోర్టుకు కావలసిన దాఖలాలు, సాక్ష్యాలు, తదితర వివరాలు అందగానే, ఒక పార్టీ అదనంగా ప్రసాదించే వివరాలను గాని, మూజువాణీ సాక్ష్యాన్ని గాని స్వీకరింప నిరాకరింపవచ్చును. రెండవ పార్టీ అభ్యంతర పెట్టకపోతే అట్టిసాక్ష్యాన్ని కోర్టు వారు స్వీకరింపవచ్చును.

ఆర్టికల్ 53 :

1. ఒక తగాయిదాలో ప్రతివాది కోర్టుకు హాజరు కాకపోయి నప్పుడు కేసును తమ పక్షం చేయవలసిందిగా వాది కోర్టు వారిని కోర వచ్చును.

2. కోర్టు ఆ విధంగా తీర్పు ఇవ్వడానికి ముందు ఆర్టికల్స 36, 37 నిబంధనల ననుసరించి తనకు అధికారం వుందనీ, ఈ తగాయిదాలో వాది క్లెయిము చట్టరీత్యానూ, వాస్తవంగానూ సక్రమమైనదనీ ఋజువు చేసుకోవలసి ఉంటుంది.

ఆర్టికల్ 54 :

1. న్యాయస్థానం కంట్రోలుకు లోబడి ఏజెంట్లు, సలహాదారులు, న్యాయవాదులు తమ వాదనలను పూర్తిచేస్తే, కేసు విచారణ ముగిసినటు కోర్టు అధ్యక్షుడు ప్రకటించగలడు.

2. అనంతరం తీర్పు ఇచ్చే నిమిత్తం కోర్టు సమావేశాలను విర మింపగలదు.

3. న్యాయాధిపతుల సంప్రతింపులు, సమాలోచనలు ప్రయివేటుగా జరుగుతవి. అవి రహస్యంగా ఉంచబడును.

ఆర్టికల్ 55 :

1. అన్ని సమస్యలు హాజరులో ఉన్న న్యాయమూర్తుల మెజారిటీపై నిర్ణయం అవుతూ ఉంటవి.

2. ఒక సందర్భంలో వోట్లు సరిసమంగా విభాగమైతే అధ్యక్షునికి గాని, అధ్యక్ష స్థానం వహించిన న్యాయమూర్తికిగాని ఒక కాస్టింగ్ వోటు ఉంటుంది.

ఆర్టికల్ 56 :

1. ఏ కారణాలనుబట్టి ఏ దాఖలాలు ఆధారంగా న్యాయస్థానం నిర్ణయానికి వచ్చిందో వాటిని సవివరంగా తీర్పులో పేర్కొనవలసి యుండును.

2. ఇందుకు సంబంధించిన సంప్రతింపులలో పాల్గొన్న న్యాయమూర్తుల పేర్లుకూడా ఈ తీర్పులో వెల్లడించబడును.

ఆర్టికల్ 57 :

న్యాయమూర్తులు అందరూ ఏకాభిప్రాయానికి రాలేకపోయినప్పుడు, మెజారిటీ తీర్పుతో ఏకీభవింపలేక పోయినవారు విడిగా తమ తీర్పును వెల్లడింపవచ్చును.

ఆర్టికల్ 58 :

తీర్పుపై న్యాయస్థాన అధ్యక్షుడు, రిజిస్ట్రారు సంతకం చేయాలి. తీర్పు తయారైన తరువాత పార్టీలకు తగిన నోటీసు ఇచ్చి ఆ తీర్పు బహిరంగంగా కోర్టులో చదువబడును.

ఆర్టికల్ 59 :

పార్టీలకు, అందులోనూ ఆ ప్రత్యేక తగాయిదాకు సంబంధించి మాత్రమే ఈ తీర్పు వర్తిస్తుంది. అంతకు మించి ఈ తీర్పుకు విశేషాధికారం ఏమీ లేదు.

ఆర్టికల్ 60 :

అంతర్జాతీయ న్యాయస్థానం తీర్పుపై అపీలు లేదు. అంతటితోనే అది ఆఖరు. కోర్టు తీర్పు అన్వయంలో ఏదైనా పేచీ వస్తే ఆ తీర్పుకు సంబంధించిన పార్టీలలో ఎవరు కోరినా కోర్టు తన వ్యాఖ్యానాన్ని తెలియజేయవచ్చును.

ఆర్టికల్ 61 :

1. ఒకసారి న్యాయస్థానం ఇచ్చిన తీర్పును కొన్ని సందర్భాల్లో మాత్రం తిరగదోడడానికి వీలుంది. న్యాయస్థానం తీర్పు ఇచ్చిన తరువాత, ఈ తగాయిదాకు సంబంధించి ఒక క్రొత్త విషయం బయటపడి ఉండవచ్చు.

కోర్టు తీర్పు ఇవ్వడానికి ముందు ఈ విషయం వెల్లడి అయివుంటే తీర్పు మరొక విధంగా ఉండేందుకు అవకాశం ఉంటుంది. కేవలం నిర్లక్ష్యం వల్ల ఆ విషయం వెల్లడికాకపోయి ఉండవచ్చును. అలాంటి పరిస్థితులలో కోర్టు వెనుకటి తీర్పును తిరిగి పరిశీలింపవచ్చును.

2. ఆ విధంగా కోర్టు పునఃపరిశీలనకు పూనుకునే ముందు తాజాగా తెల్సిన విషయాన్ని వివరించి, ఈ విషయం వెల్లడి కావడంవల్ల వెనుకటి తీర్పు పునర్విచారణ అవసరమైనట్లు న్యాయస్థానం అసందిగ్ధంగా ప్రకటించి రివిజను పిటీషన్‌ను అంగీకరిస్తూ తీర్పు ఇవ్వవలసి ఉంటుంది.

3. తీర్పును పార్టీలు అంగీకరించగలమని ముందుగా ప్రకటించాలని పునర్విచారణారంభానికి ముందు కోర్టువారు కోరవచ్చును.

4. ఈ తాజా విషయం తెలిసిన ఆరుమాసాల్లోపుగా ఈ రివిజను పిటీషన్‌ను దాఖలు చేయవలసి ఉంటుంది.

5. ఏ పరిస్థితులలోనూ తీర్పు ఇచ్చి పది సంవత్సరాలు గడిచిన తరువాత రివిజను పిటీషన్‌ను దాఖలు చేయడానికి అవకాశం లేదు.

ఆర్టికల్ 62 :

1. కోర్టు విచారణకు వచ్చిన తగాయిదాలో ఏ దేశానికైనా న్యాయశాస్త్ర సంబంధమైన ప్రమేయం ఉన్నట్లు భావిస్తే ఈ విచారణలో ప్రమేయం పెట్టుకోవడానికి అనుమతివ్వమని ఆ దేశం కోర్టును అడగవచ్చును.

2. ఈ కోరికపై తీర్పు ఇచ్చే అధికారం అంతర్జాతీయ న్యాయస్థానానిదే.

ఆర్టికల్ 63 :

1. ఒక ఒడంబడికపై తగాయిదా వస్తే, ఆ తగాయిదా న్యాయస్థాన విచారణకు రాగానే ఆ తగాయిదాతో ప్రత్యక్ష సంబంధం లేకపోయి నప్పటికీ. ఒడంబడికతో సంబంధం వున్నట్టి అన్ని రాజ్యాలకూ ఈ విషయాన్ని కోర్టు రిజిస్ట్రారు తెలియపరచగలడు.

2. ఆ సందర్భంలో తగాయిదాకు పార్టీగాని ఒడంబడిక దేశం ఏదైనా విచారణలో పాల్గొనవచ్చు. ఆ విధంగా పాల్గొన్న దేశం కూడా కోర్టు తీర్పుకు బద్ధమై ఉండాలి.

ఆర్టికల్ 64 :

కోర్టు వేరుగా నిర్ణయించితే తప్ప పార్టీలు ఎవరి కర్చులను వారే భరించాలి.

# నాల్గవ ప్రకరణ

## సలహాలు

ఆర్టికల్ 65 :

**1.** సమితి ప్రణాళికను అనుసరించి అంతర్జాతీయ న్యాయస్థాన సలహాలను, అభిప్రాయాలను తెలుసుకొనడానికి అర్హతగల అంతర్జాతీయ సంస్థలు ఏవైనా అట్టి సలహాలను పొందడం అవసరమని భావించినప్పుడు ఆ సలహాలు ఇవ్వమని కోర్టును కోరవచ్చును.

**2.** ఏ విషయంమీద సలహా కావాలో ఆ విషయాన్ని పూర్తిగా వివరిస్తూ అందుకు సంబంధించిన యావత్తు పత్రాలనూ పొందుపరచి ఆ సంఘం అంతర్జాతీయ న్యాయస్థానానికి ఒక నివేదికను పంపవచ్చును.

ఆర్టికల్ 66 :

**1.** ఆ విధమైన నివేదిక అందగానే కోర్టు రిజిస్ట్రారు ఈ విషయంతో సంబంధంవున్న అన్ని రాజ్యాలకూ ఈ విషయాలన్నీ తెలియజేస్తాడు.

**2.** కోర్టులో హాజరు కావడానికి అర్హతగల రాజ్యాలకు సంఘాలకూ అట్టి దేశాలు, సంఘాలు హాజరు కావాలని, కోర్టుగాని, అధ్యక్షుడు గాని నిర్ణయిస్తే ఆ నిర్ణయాన్ని రిజిస్ట్రారు ఆ దేశాలకూ, సంఘాలకూ తెలియచేయ గలడు. ఈ దేశాలు, సంఘాలు కోర్టుకు హాజరై తమ వాదనను వివరించ వచ్చును. లిఖిత పూర్వక వాఙ్మూలాలను దాఖలు చేయవచ్చును.

**3.** కోర్టు విచారణకు వచ్చిన వ్యవహారంతో సంబంధవున్న ఒక రాజ్యానికి పైన సూచింపబడిన విధంగా కోర్టు ఆహ్వానం రాకపోయి నప్పుడు అట్టిదేశం కోర్టులో హాజరు కాదలచినట్లు కోర్టుకు తెలియజేయ వచ్చును. ఆ విషయాన్ని కోర్టు పరిష్కరిస్తుంది.

**4.** లిఖిత పూర్వకంగా గానీ, మూజువాణీగా గాని వాఙ్మూలాన్ని సమర్పించిన సంఘాలు, రాజ్యాలు ఇతరులు సమర్పించిన నివేదికలు వాఙ్మూ-

లాలపై తమ అభిప్రాయాలను తెలుపవచ్చును. అందుకు వీలుగా ఏ యే దేశాలు ఏ యే పత్రాలను, వాఙ్మూలాలను సమర్పించిందీ పార్టీ లందరికీ రిజిస్ట్రారు తెలియచేయగలడు.

ఆర్టికల్ 67 :

సలహా మాత్రమైన తన అభిప్రాయాలనుకూడా కోర్టు బహిరంగ సమావేశాల్లోనే వెల్లడిచేయును. అలా చేయడానికి ముందుగా సెక్రిటరీ జనరల్‌కూ, సమితి రాజ్యాలకూ, అంతరాతీయ సంఘాలకూ నోటీసు ఇవ్వవలసి యుండును.

ఆర్టికల్ 68 :

సలహామాత్రమే అయిన విషయాలలో ఒక నిర్ణయానికి రావలసి వున్నప్పుడు కోర్టు ఈశాసనంలో వివాదగ్రస్త విషయాలకు వర్తించే నిబంధనలనుకూడా దృష్టిలో వుంచుకొని వ్యవహరింప గలదు.

# ఐదవ ప్రకరణ

## సవరణలు

ఆర్టికల్ 69 :

సమితి ప్రణాళికకు సవరణలు ఏ విధంగా జరగాలని ఈ ప్రణాళిక నిర్ణయించిందో ఆ విధంగానే అంతర్జాతీయ న్యాయస్థాన శాసన సవరణ కూడా జరగవలసి ఉంటుంది. అయితే సమితిలో సభ్యత్వంలేక, ఈ శాసనాన్ని అంగీకరించిన ఇతర రాజ్యాలుకూడా అట్టి సవరణలో పాల్గొనేందుకు వీలైన నిబంధనలను భద్రతామండలి ప్రతిపాదనపై సర్వసభ్యసంఘం ఆమోదించును. ఈ శాసన సవరణ సందర్భంలో ఈ నిబంధనలను గమనింపవలసి ఉండును.

ఆర్టికల్ 70 :

ఆర్టికల్ 69 కి అనుగుణంగానే ఈ శాసనంలో ఏమైనా సవరణలు జరగడం అవసరమని అంతర్జాతీయ న్యాయస్థానం భావిస్తే ఆ సవరణకు సంబంధించిన ప్రతిపాదనలను కోర్టు సమితి సెక్రటరీ జనరల్‌కు లిఖిత పూర్వకంగా తెలియజేయ వచ్చును.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA131B146 |
| పుస్తకం పేరు | ఐక్యరాజ్యసమితికార్యకలాపాలు |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 257 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | D |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Apsar |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Heera |
| పరీక్ష చేసినది | PRAGATHI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |